# రేపటి విజేతలందరికీ శుభాకాంక్షలతో...

ఏ విజయాన్నైనా చాలా మంది కలిసికట్టుగా ప్రయత్నించినప్పుడే సాధించడం వీలవుతుంది. నేను కూడా ఐ.ఏ.ఎస్. సాధించడానికి మా అమ్మ నాన్నలు ( శ్రీమతి ఆకురాతి భోగేశ్వరి, డా॥ ఆకురాతి కోదండరామయ్య ) ఎంతగానో తోడ్పడ్డారు వారి కృషితో నా కృషిని కలుపుకుని ఈ విజంయ సాధించాను. - **ఆకురాతి పల్లవి**

గత 8 సంవత్సరాల నుంచి ఎనలేని కృషితో పట్టుదలతో శ్రమించి ఇంగ్లీష్‌లో ఉన్న ఎన్నో పుస్తకాలను చదివి తనదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి తెలుగులోనే సివిల్స్ వ్రాసి విజయకేతనం ఎగురవేసిన **ఆకురాతి పల్లవి** ఎంతో కష్టపడి తయారు చేసి సంపాదించిన జ్ఞానాన్ని ఆమె వరకే పరిమితం కాకుండా మెటీరియల్ ద్వారా అందరికీ అందుబాటులోకి తెచ్చినందుకు వారికి కృతజ్ఞతలు.

అనువాదం చేసేటప్పుడు చాలా సమస్యలు ఎదురవుతాయి. ఎందుకంటే ఒక భాషా నిర్మాణం మరో భాషా నిర్మాణంతో పూర్తిగా సరిపోదు. అటువంటి ఎన్నో సమస్యలను ఎదుర్కొని ఇంగ్లీషు నుండి తెలుగులోకి అతి సులభ పద్ధతిలో తర్జుమా చేసి ఆ మెటీరియల్‌ను తెలుగు మీడియం విద్యార్థులకు అందుబాటులోకి తేవాలనే నా కోరికను మన్నించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ప్రతి మనిషిలో అనంతమైన శక్తి దాగి ఉంటుంది. దానిని వినియోగంలోకి తెచ్చుకోవడంలోనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. ఆ శక్తిని ఎవరైతే పూర్తిగా సద్వినియోగం చేసుకోగలుగుతారో వారే ఆకాశమే హద్దుగా విజయాలవైపు అడుగులు వేయగల్గుతారు.

అసహనంతో జరిగే ప్రయోజనమేమీ లేదు. ఓర్పువహించండి. విజయం మిమ్మల్ని తప్పక వరిస్తుంది. కావున మీ లక్ష్యానికి తగ్గట్టుగా పట్టుదలతో నిరంతరం శ్రమించండి. విజయం మీదే !

**మంచి స్నేహితునిలా ఈ మెటీరియల్ ఎందరి మనసుల్లో తట్టి లేపి విజయపథం వైపు నడిపిస్తుందని ఆశిస్తున్నాను.**

**గమనిక:** గత 8 సంవత్సరాల నుండి ఎంతో శ్రమ పడి తయారుచేసుకోబడ్డ ఈ మెటీరియల్‌ను అందరికీ అందుబాటులోకి తేవాలనే సంకల్పంతో ఉచితంగా ఈ మెటీరియల్‌ను **శ్రీనివాస జిరాక్స్ సెంటర్‌**లో ఇవ్వడం జరిగింది. కేవలం జిరాక్స్‌కైన మొత్తమునే చెల్లించి ఈ మెటీరియల్ పొందవచ్చు.

మీ ఉన్నతిని ఆశిస్తూ....

ఎ. మధుసూదన్ రెడ్డి, Civil Aspirant

## Books that I referred to prepare this material

# MODERN INDIA

1. Grover & Grover***
2. Bipin Chandra NBT "స్వాతంత్ర్య సమరం"
3. Bipin Chandra & Others Penguin Publications
4. Sarkar***
5. Bipin Chandra
   ఆధునిక భారతదేశ చరిత్ర for Economic History
6. Datta & Sundaram for Economic History
7. తెలుగు అకాడమి వైదేహి, అల్లాడి
8. తెలుగు అకాడమి ఆధునిక భారత ఆర్థిక చరిత్ర
9. అంబేద్కర్ ఓపెన్ యూనివర్శిటీ ***
10. NCERT ***
11. IGNOU ***
12. Brilliant Material
13. Spectrum History
14. కృష్ణారెడ్డి బుక్స్
15. తెలుగు అకాడమి "రాజనీత తత్త్వవిచారము"
16. Hanumantha Rao

quick

Chapter - 2

25.6.03 

## *: అతివాద జాతీయత జనించుటకు గల కారణాలు: *

భారత జాతీయోద్యమంలో ప్రధమంగా ప్రజల్లో చైతన్యాన్ని, రాజకీయ చైతన్యాన్ని నింపిన జాతీయ నాయకులు అతివాదులే. 1905 నుంచి 1920 వరకు తమ ప్రాబల్యాన్ని చాటిన అతివాదుల జాతీయతా భావాలు జనించడానికి ఎన్నో కారణాలు దోహదం చేశాయి.

1) ఆంగ్లపాలన నిజ స్వరూపాన్ని గుర్తించడం:

తొలి జాతీయవాదులైన మితవాదులు కష్టంతో సేకరించిన తమ అధ్యయనాలు, గణాంకాల వలన భారతదేశ ఆర్థిక దుస్థితికి ఆంగ్లపాలనే కారణమని నిరూపించారు. నౌరోజీ తమ "ఇండియన్ పావర్టీ అండ్ అన్-బ్రిటీష్ రూల్ ఇన్ ఇండియా" గ్రంథంలో సంపద తరలింపు సిద్ధాంతాన్ని చెప్పి ఆంగ్లేయులు భారత్ ను పీల్చిపిప్పి చేస్తున్న వైనాన్ని ఎండగట్టారు. ఆర్.సి.దత్, జి.వి. జోషి ఆంగ్ల భూమిశిస్తు విధానలలోపాల్ని ఎత్తిచూపారు. సురేంద్రనాథ్ బెనర్జీ సివిల్ సర్వీసు భర్తీలో లొసుగుల్ని బయటపెట్టారు. ఆర్. ఎన్. మధోల్కర్, వాచా, గోఖలే, మాలవ్యా మొ॥ వారు సైతం ఆంగ్లపాలన లోని దోపిడీతనాన్ని బయటపెట్టారు. భారతదేశంలో పేదరికానికి

విపరీతంగా పన్ను (సేవలు, మిలటరీ)

పౌర, సైనిక పాలనా వ్యయాలు ; పెరుగు వాటిల్లు

హోం ఛార్జీలు ; వివక్షత తో కూడిన టారిఫ్ విధానం ;

ప్రాసవ దృష్టి తో కూడిన భూమిశిస్తు విధానం ;

భారత దేశ సాంకేతిక, పారిశ్రామిక అభివృద్ధి పై

శీతకన్ను వేయడం ; ఉన్నత ఉద్యోగాల నుంచి

భారతీయుల్ని వెలివేయడం మొ|| కారణాలు గా

వెల్లడించారు. రెనడే రాసిన " ఎస్సేస్ ఆన్

ఇండియన్ ఎకానమిక్స్ (1898)", ఆర్. సి. దత్

రాసిన " ఎకనామిక్ హిస్టరీ ఆఫ్ ఇండియా(1901)"

లోని జాతీయవాదుల ఆర్థికాంశాల పై సంధించిన

విమర్శనాస్త్రాలు ... కాబట్టి ఆర్థిక జాతీయవాద

భావజాలం భారత రాజకీయ ఆలోచనా అభివృద్ధి లో

సహజమైన, తార్కికమైన ముందడుగు /

తర్వాతి అడుగు (next step).

2) అధికమవుతున్న పాశ్చాత్యీకరణ కు ప్రతిస్పందన :

జాతీయోద్యమ కొత్త నాయకత్వం భారత

జీవితం, ఆలోచన, రాజకీయాల పై పాశ్చాత్యీకరణ 
ఉప్పొంగుతున్నదన్న గమనించారు. క్రైస్తవం, ఉపయోగితా తత్వం భారతీయ మేధావి - తత్వాలకు సవాలుగా నిలిచాయని తలచారు. భౌతిక వాదం, వ్యక్తిగత వాదాలతో నిండిన పాశ్చాత్య నాగరికత భారతీయ సంస్కృతి - నాగరికతలను నాశనం చేస్తుంది. భారత జాతీయతలోని ఆధ్యాత్మిక మూల్యాలను కలిపేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి.

అందుకే తీవ్రవాదుల తాత్విక, భావావేశాల స్ఫూర్తి మాత్రం భారతీయమైనదే. వారు భారతీయ ఆధ్యాత్మిక వారసత్వంనుంచి స్ఫూర్తి పొంది భారత చారిత్రక వైభవాన్ని ఆదర్శంగా చూపి ప్రాచీన భారత వైభవాన్ని పునరుద్ధరించాలని యత్నించారు. బంకించంద్ర, వివేకానంద, దయానంద సరస్వతి మొ॥ వారి రచనలు తీవ్రవాదుల ఆలోచనలకు దర్పణం పడుతాయి. బంకిం మాతృదేవికి సేవ చేయడాన్ని చెప్పాడు. వివేకానందుడు తమ దేశీయులకు తమ గత వారసత్వాన్ని చూసి గర్వపడమని ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకొని పాశ్చాత్య ప్రపంచాన్ని భారతీయ ఆధ్యాత్మికతతో జయించమని పిలుపిచ్చాడు. దయానందుడు తెల్లజాతి దురహంకారాన్ని ఖండించి 'భారతదేశం భారతీయులదే' అని చాటిచెప్పాడు.

ఈ విధంగా భారత పునరుజ్జీవనోద్యమ భావాలు కూడా తీవ్రవాద జాతీయవాదుల భావజాలానికి దారితీశాయి.

3) కాంగ్రెస్ పనితీరు / విధానాల పట్ల అసంతృప్తి:

కాంగ్రెస్‌లోని యువకులు సంస్థ లోని 15-20 సం॥ల్లో సాధించిన విజయాల పట్ల అసంతృప్తి లేదా ప్రభుత్వ వైఖరి పై కోపం లేదా ద్వేషం. ప్రభుత్వ మంచితనం, న్యాయం మీద వారికి నమ్మకం పోయింది.

వారు మితవాదుల రాజకీయ కార్యాచరణ పద్ధతుల పై వ్యతిరేకభావం కలిగి దాన్ని 'రాజకీయ భిక్షాటన' గా (ఎగతాళి చేశారు.) అభివర్ణించారు.

జాతీయోద్యమ లక్ష్యాలను తీవ్రమైన సాధనాల చిన్నచిన్న విజయాలు చూసి విసుగెత్తిన తీవ్రవాదులు ఏనాటికి కాంగ్రెస్ లక్ష్యాలను / ఎదిరించి పోరాడి ఏనాడు విప్లవ పద్ధతులతో ఉద్యమించాలని సూచించారు / భావించారు.

1905 లో ఇంగ్లాండు నుండి తిరిగొచ్చిన లజపతిరాయ్ తిలకులు భారతీయుల మొర వీడి / ఫిలాసఫీ వేరని చెప్పాడు. భారత ప్రజలు తమ దేశం గురించి తెలుసుకోవాలి)

అయితే వారు

"వారు స్వాతంత్ర్యం కోసం తమంతట తామే పెను ఉద్యమం చేయాలి, వారు తమ దృఢ సంకల్పాన్ని నిరూపించేందుకు అవసరమైతే సాహసం తో / అవసరమైతే బలి గా సిద్ధపడి ఉండాలి." (Young India, p.170)

కాంగ్రెసులోని తరువాతరం వృద్ధ రాజకీయుల పై కోపం లో ఉంది. రాజీ & విధేయతల వారి రాజకీయ మార్గం; శాసన సభల్లో స్థానాలు - ప్రశంసాపత్రాలు - బిరుదుల కోసం కృషి చేయడం వారి రాజకీయ ధ్యేయాలు; అలాగా ఉపన్యసించటం, సంవత్సరాంతాలలో కాంగ్రెసు సభలకి హాజరవ్వడం వారి రాజకీయ కార్యకలాపాలు అని మితవాదుల్ని ఎత్తిపెట్టారు అతివాదులు. సామాన్య ప్రజలు చేతిలో తమ నాయకత్వం పోతుందేమోనన్న భయంతో కాంగ్రెసు సభల్ని మధ్యతరగతి వారికి పరిమితం చేయడం; వారి కార్యక్రమాల్ని మధ్యతరగతి విద్యావంతుల & అనుగుణంగా మాత్రమే చేస్తున్నారని మితవాదుల్ని నిందించారు.

"దేశభక్తి పేరుతో వ్యాపారం చేస్తున్నారని మితవాదులు నిందింపబడ్డారు.

తిలక్ కాంగ్రెసును 'వంది మాగధుల సభ' గా పేర్కొన్నాడు, కాంగ్రెసు సభల్ని 'విరామదిన వినోదం' గా చెప్పాడు. లజపతిరాయ్ కాంగ్రెసు సభల్ని 'వార్షిక జాతీయ భారతీయుల విద్యావంతుల పండుగ' గా చెప్పాడు. అనగా కాంగ్రెసు కు ఎట్టి నిర్మాణాత్మకమైన కార్యక్రమం లేదని వారి భావన. తిలక్ "మనం సంవత్సరానికొకసారి కప్పలాగా అరిచేట్లయితే మన కృషి కి మనం ఎట్టి విజయాలు/ఫలితాలు పొందలేము" అని పేర్కొన్నాడు. ఈ విభిన్నమైన భావాల్నుంచే అతివాద జాతీయవాద భావజాలం జనించింది.

4) దిగజారుతున్న భారతదేశ ఆర్థిక పరిస్థితి:

19 వ శతాబ్దపు చివరి కాలంలో భారత దేశం లోని ఆర్థిక దైన్యం భారతీయ జాతీయ ఉద్యమంలో, అతివాద భావజాలం జనించటానికి కావాల్సిన సరియైన అనుకూలమైన వాతావరణాన్ని ఏర్పరచింది.

1896-97, 1899-1900 లలో

సంభవించిన <u>తీవ్ర క్షామం</u> మరోవైపు మహమ్మారిలా విజృంభించిన <u>బ్యుబానిక్ ప్లేగు మహమ్మారి</u> లు కలిసి లక్షల సంఖ్యలో ప్రాణనష్టానికి కారణమయ్యాయి. ప్రభుత్వ సహాయచర్యలు చాలినంతగా లేక, మెల్లగా సాగుతూ, సరిగ్గా వ్యవస్థీకరించబడక ప్రజలు నానా బాధలూ పడ్డారు. తిలక్ <u>ప్లేగు కమీషనర్ల క్రూరచర్యల్ని</u> నిందిస్తూ 'అధికార వర్గాలు కన్నా ప్లేగే మా పట్ల తక్కువ క్రూరత్వాన్ని చూపింది' అని విమర్శించాడు.. అప్పటి <u>దక్కను లో తిరుగుబాట్లు</u> చెలరేగగా ప్రభుత్వం వాటిని క్రూరంగా అణచివేసింది. ~~ఈ~~ ఈ సంఘటనలు ప్రజలకి వారి దీనమైన అసహాయస్థితి ని బహిర్గతపర్చాయి.

ఉదారవాద నాయకులు తరచూ వచ్చే కరువుల్ని ప్రభుత్వం అవలంబించిన [illegible] విధానాల ఫలితమేనని ప్రచారం చేసేవారు. <u>1903 లో జరిగిన దర్బారు</u> సందర్భంగా <u>లాల్ మోహన్ ఘోష్</u> అది ప్రభుత్వం ను గుండెలేని కసాయి మనిషి గా నిరూపిస్తుందని చెప్పాడు.

5) సమకాలీన అంతర్జాతీయ పరిస్థితుల ప్రభావం:
భారతదేశానికి వెలుపల జరిగిన ఘటనలు యువతరాన్ని బాగా ప్రభావితం చేశాయి. భారతీయులకు ఆంగ్ల వలసల్లో ముఖ్యంగా దక్షిణాఫ్రికాలో ఎదురైన అవమానకర పరిస్థితుల వలన ఆంగ్ల వ్యతిరేక భావం బలపడింది. అదేగాక ఈజిప్టు, పర్షియా, టర్కీ, రష్యాలలో జరిగిన జాతీయోద్యమాలు భారతీయుల్లో కొత్త ఆశలు రేకెత్తించాయి. 1896 లో అబిసీనియా ఇటలీ పై సాధించిన విజయం, 1905 లో జపాన్ రష్యా పై సాధించిన ఘనవిజయం భారతీయులకి స్ఫూర్తినిచ్చాయి. ఐరోపావారిని ఓడించడం అసాధ్యమన్న భావన అంతమైంది.

6) కర్జన్ ప్రగతి నిరోధక చర్యలు: కర్జన్ భారతీయులను ఒక 'జాతి' గా గుర్తించడానికి నిరాకరించాడు. భారతీయ విద్యావంతులను అవమానపరిచి వారిని చాలా హీనంగా మాట్లాడాడు. కలకత్తా కార్పొరేషన్ చట్టం, అఫీషియల్ సీక్రెట్స్ చట్టం, భారతీయ విశ్వవిద్యాలయాల చట్టం దేశంలో పెద్ద ఎత్తున నిరసనలకి కారణమయ్యాయి. 1899-1900 కరువు భారతీయుల్ని బలితీసుకొంది

1903 లో ఢిల్లీ వైభవోపేతంగా దర్బారు జరపడం భారతీయులలో వ్యతిరేక భావాలు రగిలించింది.

7) బెంగాలు విభజన: కర్జను పాలన కాలంలో అత్యంత గర్హించబడే చర్య బెంగాలు విభజన. 1905 లో కర్జను రాజకీయ దురుద్దేశంతో చేసిన బెంగాలు విభజన ద్వారా కర్జనుకు, బ్రిటిష్ అధికారులకు భారతీయ ప్రజాభిప్రాయం పట్ల ఏ మాత్రం శ్రద్ధ లేదని రుజువు చేసింది. విభజన (కు వ్యతిరేకంగా) వద్దంటూ అప్పటివరకూ కాంగ్రెసు, బెంగాలీలు మితవాద పద్ధతుల్లో చేసిన ప్రదర్శనలు, నిరసనలు బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. [illegible] రాజధానిలో విభజన ద్వారా బెంగాలీ మాతృభాష బెంగాలీ మాతృభాష కాని వారికి మధ్య, హిందూ-ముస్లిం లకు మధ్య విద్వేషాలు రగుల్కొన్న దుష్పరిణామం భారతీయులకు అవగతమయ్యింది. ప్రజాభిప్రాయానికి ప్రభుత్వం ఏ మాత్రం విలువ ఇవ్వకపోవడం వల్ల మితవాదుల విజ్ఞప్తులు, ప్రార్థన, నిరసన పద్ధతుల వైఫల్యం ప్రస్ఫుటంగా చాటాయి.

దీంతో అతివాద జాతీయవాద భావాలు బాగా పెరుగుకోవడం సహజ పరిణామమే అయ్యింది.

## ఇతర కారణాలు:

1) మితవాదుల విధానాలు కేవలం విజ్ఞాపనలు లేఖల నుండి సంస్కరణలు పొందవచ్చునన్న నమ్మకం మీద ఆధారపడినట్టివి. కానీ క్రమక్రమంగా రాజకీయ, ఆర్థిక విషయాల పట్ల ప్రభుత్వ వైఖరుల వల్ల ఈ నమ్మకం వీగిపో జొచ్చింది.

2) 1892 – 1905 మధ్య జరిగిన రాజకీయ పరిణామాలు సైతం జాతీయవాదుల్ని నిరాశకు గురిచేశాయి.

1892 చట్టము అసంతృప్తికరమైనది. 1898 లో విదేశీ పాలనకు వ్యతిరేకంగా భావాలేర్పరచడం నేరమని చట్టం చేశారు. 1899 లో కలకత్తా కార్పొరేషన్ లో భారతీయుల సంఖ్య తగ్గించారు. 1904 లో ఇండియన్ అఫీషియల్ సీక్రెట్స్ చట్టం చేసి పత్రికా స్వేచ్ఛను హరించారు. 1897 లో విచారణ లేకుండా నాటూ సోదరుల్ని దేశం నుంచి బహిష్కరించారు. అదే సంవత్సరం తిలక్ తో సహా పలువురు పత్రికా సంపాదకులకి సుదీర్ఘ జైలుశిక్ష విధించారు. (ప్రజల్ని ప్రభుత్వ వ్యతిరేకంగా

7) బెంగాలు విభజన
1903-05 మితవాద విధానాల వైఫల్యం

8) ఆశించిన వల్ల ఆధునీకరణ జరగలేదు

9) భారతీయులలో ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం, తమను తాము పాలించుకోగలమన్న విశ్వాసం .....

- వివేకానంద "భారతీయులు మరల లేచి ...."
- ఐర్లాండ్ జపాన్ స్వాతంత్ర్య పోరాటాల ఉదాహరణలు చేయగలరని

10) విప్లవాత్మక నాయకత్వం అతివాదానికి ఆకర్షితులైనారు.

11) విప్లవకారుల సంఖ్య పెరిగే కొద్దీ అతివాదం మీద విశ్వాసం
జాతీయత, ప్రజాస్వామ్యం మొ॥ భావాల ప్రభావం

12) అప్పటికే అతివాద రాజకీయ శక్తి ఆచరణలో ఉండడం
- 1889 నుండి తిలక్ "కేసరి" ద్వారా జాతీయతాభావ ప్రచారం
- 1893 నుండి గణపతి 1895 నుండి శివాజీ ఉత్సవాలు
- 1896-97 మహారాష్ట్రలో పన్ను నిరాకరణోద్యమం ....

## The Objectives and Methods of the Extremist Group

## అతివాదుల ఆశయాలు - పద్ధతులు

అతివాదుల్లో ముఖ్యులైన తిలక్, బిపిన్ చంద్ర, అరబిందో, లజపతిరాయలు అతివాదులలో ఆశయాల్ని నిర్వచించి దాని ఆచరణకు నిర్దిష్ట రూపాన్నిచ్చి అతివాదుల కార్యకలాపాలకు మార్గదర్శకత్వం వహించారు.

తిలక్ అతివాదులకు నినాదం (slogan) నినాదాన్ని అందించారు - అదే

'స్వరాజ్ నా జన్మహక్కు, నేను దాన్ని సాధించి తీరుతాను.'

తిలక్ దృష్టి లో స్వరాజ్యం అంటే

"స్వరాజ్యం లేదా స్వయం-పాలన అన్నది స్వధర్మాన్ని అనుసరించడానికి అత్యవసరమైనది. సాంఘిక సంస్కరణ, పారిశ్రామిక ప్రగతి, ఉపయోగకరమైన విద్య, జాతీయ భావాన్ని సాఫల్యం చేయడం ఇవేవీ కూడా స్వరాజ్యం లేకుండా సాధ్యపడవు. అదే మనం కోరుకునేది, అందుకే మనల్ని దేవుడు ఈ భూమి మీదకి దాన్ని పొందడానికి పంపించాడు."

అరవింద ఆశయాన్ని బి.సి. పాల్ మాటల్లో చెప్పాలంటే

"దేశమంతా ఇప్పుడు కోరుకునేది సంస్కరణ (reform) కాదు, సరికొత్త అవతరణ (re-form). భారత ప్రభుత్వ విధానాన్ని నిర్ణయించే హక్కుల వాళ్ళకి త్యజించాలి, ప్రస్తుత ప్రభుత్వం విదేశీ నిరంకుశ మన కోసం వారికిష్టం వచ్చిన దాన్ని చేసే విధానాలకి స్వస్తి చెప్పాలి, మన దేశ ప్రజల్ని వారికిష్టం వచ్చినట్లుగా పన్నులు కట్టమనడం ఇకపై సాగదు, మన దేశ ఆదాయాన్ని వారికిష్టమైన తీరుగా తగలెయ్యడం ఇక పై కుదరదు."

అరబిందో ఘోష్ స్వరాజ్యాన్ని ఇలా వివరించాడు.

"స్వరాజ్యం ఆధునిక పరిస్థితుల్లో ప్రాచీన భారతీయ జీవనవిధానాన్ని గడపడం లాంటిది. కాళి గొప్పతనానికి కారణమైన సత్యయుగం మళ్ళీ రావడం లాంటిది. సత్యయుగం తన గొప్ప పాత్ర అయిన ఆధ్యాత్మిక, మార్గదర్శకత్వాన్ని తిరిగి తీసుకుంటుంది. అంతిమ ధ్యేయమైన వేదాంత భావాన్ని రాజకీయాల్లో సాధించే దిశగా తన ప్రజలకి ఆత్మవిముక్తి లా దారి చూపిస్తుంది. ఇదే భారత్ కి నిజమైన స్వరాజ్."

అరవిందుడు ఇంకా ఇలా చెప్పాడు.,

"ఏ జాతి కయినా రాజకీయ స్వేచ్ఛ ప్రాణం. ఆ రాజకీయ స్వాతంత్ర్యం కోసం కృషి చేయకుండా సాంఘిక సంస్కరణలు, విద్యా సంస్కరణలు, పారిశ్రామిక వ్యాప్తి, జాతి నైతికతా వృద్ధి కోసం ఉద్యమించడం అన్నది అధికమైన అజ్ఞానానికి నిష్ప్రయోజనానికి లక్షణం."

లజపతిరాయ్ మాటల్లో అతివాద ఆశయాన్ని చెప్పాలంటే..

"వలస ప్రజలకి బానిస మాదిరిగానే ఆత్మ ఉండదు. ఆత్మ లేని మనిషి శవంతో సమానం. ఆత్మ లేని జాతి ఎలా ఉంటే అలా బలిపడే మూగ జీవుల మందలా ఉంటుంది."

అందువల్ల స్వరాజ్యం ఒక జాతి కి తొలి అత్యవసర ఆవశ్యకత. దాని తర్వాతే ఏదైనా. సంస్కరణలు, మంచి పాలన లాంటి వేవీ దానికి ప్రత్యామ్నాయం కాలేవు.

26-6-03

## మితవాదులకి - అతివాదులకి మధ్య గల భేదాలు

See page: 43

X

1) మితవాదుల స్వరాజ్యం వలస స్వయం పాలన మాత్రమే. అది బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగానే ఉంటుంది.

మొదట్లో అతివాదుల స్వరాజ్యం మాత్రం సంపూర్ణ స్వాతంత్ర్యం విదేశీ నియంత్రణ నుంచి. జాతి వ్యవహారాల్ని నిర్వహించుకోవడంలో ఏ విధమైన విదేశీ శక్తుల కు లోబడకుండా పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వ్యవహరించ గలిగేది అతివాదుల స్వరాజ్యం. అయితే తిలక్ జైలు నుంచి విడుదల అయ్యాక బ్రిటిష్ సామ్రాజ్యానికి లోబడిన స్వయం పాలన అన్నారు.

2) అతివాదులు - మితవాదులు ప్రయోగించిన పద్ధతుల్లో కేవలం వారి తీరు తెన్నుల్లో (approach) స్థాయి-దృష్టి-ఉత్సాహాల్లో (tempo) భేదాలున్నాయి.

(1) మితవాదులకి రాజ్యాంగబద్ధ ఆందోళన, (2) బ్రిటిషువారి న్యాయబుద్ధి - మంచితనాల పై విశ్వాసముంచడం, (3) వార్షిక సదస్సులు నిర్వహించడం, (4) ఉపన్యాసాలివ్వడం, (5) సుదీర్ఘ తీర్మానాలు చేయడం, (6) ఇంగ్లాండుకు ప్రతినిధుల్ని పంపించడం మొదలైనవి

అపారమైన నమ్మకం ఉంది.

అతివాదులకు ఆంగ్లేయుల ప్రజల-
పార్లమెంటు యొక్క మంచితనం మీద విశ్వాసం
లేదు. అలాగే కేవలం సమావేశాల ద్వారా
ఫలితాలు వస్తాయన్న నమ్మకమూ లేదు. అందుకే తిలక్

“మనం కేవలం సంవత్సరానికొకసారి
కప్పల్లాగా అరిచినట్లయితే మన కృషి ఏ ఫలితాన్ని
సాధించదు;” అని అన్నాడు.

అతివాదులు పాలకుల నిరసన, ప్రజా ఉద్యమం,
బాధలు పడ్డానికి - త్యాగాలకి గట్టిగా సంసిద్ధులై ఉండడం
మొ॥ వాటిపై విశ్వాసం ఉంచారు. అతివాదులు స్వేచ్ఛ
కోసం పరితపించే తత్వాన్ని పెంపొందించ యత్నించారు.
అందుకోసం గాను ఎన్ని బాధలైనా అనుభవించేందుకు,
దేశం కోసం ఎంతటి త్యాగాన్నైనా త్వరితంగా చేయగలిగేందుకు
ప్రజల్ని ఉత్తేజపరిచారు. వారు ప్రజల్లో పాలకుల
యెడల ఉన్న సర్వశక్తిమంతులన్న భావన పోగొట్టి (వారు)
ప్రజలు తమ స్వయం సమృద్ధిని, ఆత్మవిశ్వాసాన్ని
పెంపొందించుకునేలా ప్రోత్సహించారు.

3) <u>మితవాదులు</u> కాంగ్రెసు సభలలో గాని, తీర్మానాలు-
విన్నపాలు మొ॥ వాటిలో గాని <u>ఆంగ్ల భాషనే</u>
అధికంగా వినియోగించేవారు. అందువల్ల అవి చాలామందికి
అర్థమయ్యేవి కావు.

అయితే <u>అతివాదులు</u> తమ ఉపన్యాసాలు,
రచనా వ్యాసంగాలు, పత్రికా సంపాదకీయాలు మొ॥
అన్నీ <u>ప్రాంతీయభాషల్లోనే</u> చేసేవారు. అందువల్లే
వారు తమ సందేశాన్ని విస్తృత ప్రజానీకానికి అందించ
గలిగారు.

4) మితవాదులు భారతదేశంలో ఆంగ్లేయుల పాలన భారతీయుల
కి మేలు చేస్తుందని వారి పాలన వల్లే జాతీయత
కాపాడబడుతుందని వారు వెళ్ళిపోతే తిరిగి అంతఃకలహాలు
అరాచకం ఏర్పడతాయని భావించారు. అందువల్లే మితవాద
తత్వం ప్రభుత్వానికి '<u>సహాయం</u>' చేయాలనే చెప్పింది.

2. అతివాదులు మాత్రం ఆంగ్ల విధేయుల
పట్ల ఏ మాత్రం విశ్వాసం లేని వారు. ఆంగ్లేయుల ఆర్థిక
దోపిడీ అంతమొందించడానికి ఒత్తిడి తేవడం, ఇక
విదేశీయ ప్రత్యక్ష చర్య అవసరమని భావించారు.
అందువలన వారు '<u>సహాయ నిరాకరణ</u>', ప్రభుత్వ
[illegible] చర్యలను నిరసించటం చేయాలన్నారు.

గాయపరచాలని కావాలని చేసే కుట్ర'

(౮)

'మతాలని గాయపరచడానికి ఉద్దేశించిన వాంఛ' గా 'బహిష్కరణ' ను గుర్తించే భావించారు. 'మనలా మనకో అవసరమయిన వైవిధ్యాన్ని పెంచేది' అని ఆయనే చెప్పారు.

బహిష్కరణ అన్యాయ ద్వేషాన్ని ప్రతిఘటించడానికి ఒక ప్రత్యేక చర్య అని సురేంద్రనాథ్ భావించారు. విభజనను రద్దు చేసిన తర్వాత దాని ఉపయోగించనవసరం లేదని / ఉపయోగించరాదని ఆయన అన్నారు.

అయితే తీవ్రవాదులైన లజపతిరాయ్ మొదలైన వారు ఆంగ్లేయుల ఆధిపత్యానికి ముప్పు ఏర్పడినప్పుడే వారు భారతీయుల కష్టనష్టాల పట్ల దృష్టి సారిస్తారని చెప్పారు. బహిష్కరణ అనేక ప్రయోజనాలను దాని తెస్తుందని తిలక్, పాల్, అరబిందో భావించారు. (అతివాదుల) వారి దృష్టిలో బహిష్కరణ మాంచెస్టర్ పై ఆర్థిక ఒత్తిడి, స్వాతంత్ర్యోద్యమానికి ప్రోత్సాహకంగా రాజకీయ తిరుగుబాటుకి ఇది ఒక సాధనం.

స్వరాజ్య సాధన ను స్వయం సమృద్ధి లా ఇది ఒక కష్టాలా.

7) మితవాదులు '<u>స్వదేశీ</u>' ని కేవలం ఆర్థికంగా మొదట్లో '<u>బహిష్కరణ</u>' పట్ల విముఖం గానే ఉన్నారు. కాని క్రమక్రమంగా వారు 'బహిష్కరణ' ను బెంగాలు లో అమలు చేయడానికి అంగీకరించారు. అదీ కేవలం విభజన రద్దు అయ్యే వరకు మాత్రమే.

అతివాదులు మాత్రం 'స్వదేశీ' 'బహిష్కరణలు' రెండు వాటిని స్వరాజ్య సాధన కు ఆయుధాలు గా పరిగణించి వాటిని బెంగాలు కు మాత్రమే పరిమితం చేయడం కాదు మొత్తం దేశానికంతటికి వర్తింపచేయాలని అన్నారు. భారతదేశం లోని ప్రముఖ పట్టణాలన్నింటిలో వీటిని విస్తృతంగా నిర్వహించాలని విభజన రద్దు తో వీటిని ఆపకుండా స్వరాజ్యం సిద్ధించే వరకూ ఈ ఆయుధాల సాయం తో పోరాటం జరపాలని అతివాదులు కాంక్షించారు.

8) మితవాదుల ఉద్యమానికి సాంఘిక పునాది చాలా ఇరుకైనది. అది కేవలం ప్రజానీకం లోకి సామాన్యజనుల్లోకి చేరలేదు. మితవాద నాయకులు

ప్రజల మీద రాజకీయ విశ్వాసం లేదు. వలస సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా ప్రజావిప్లవం జరగాలంటే అందుకు ఎటువంటి ప్రజల్లో ఉన్న భిన్నత్వాన్ని కలిగించే రకాల్ని
3) రకమైనటువంటివాళ్ళు ఉండాలని వారు భావించారు, ప్రజలు ఒక 'జాతి' గా ఏర్పడినట్లయితే అట్టి ప్రజాపోరాటం సాధ్యమని వారు భావించారు. అయితే అలాంటి ఉద్యమ సన్నాహాలలో ఒక భాగం. గా ప్రజలు ఏకీకృత భావాన్ని పొంది 'జాతి' గా ఎదుగుతారన్న సత్యాన్ని వారు గ్రహించలేక పోయారు.

అతివాదులు మితవాదులతో ప్రధానంగా విభేదించే అంశం ఏదే! అతివాదులకు సామాన్య ప్రజానీకం యొక్క శక్తి మీద అపార నమ్మకం ఉంది. వారు ప్రజా ఉద్యమం ద్వారానే స్వరాజ్యాన్ని సాధించాలని తలచారు. అందువలననే వారు ప్రజలతో రాజకీయ కార్యక్రమాలు చేపట్టడం, ప్రజలలో ప్రత్యక్ష రాజకీయ చర్య చేయటానికి కృషి చేయడం చేశారు.

9) మితవాదులు ఆంగ్లప్రజలు, పార్లమెంటు భారతీయుల శ్రేయం చేయాలని కోరుకుంటున్నారు అయితే వారికిక్కడి పరిస్థితులు తెలియవని భావించారు. అందువల్లే వారు ఆంగ్లేయులకు విధేయత చూపారు..

# ఉద్యమాల కార్యకలాపాలు

ఉద్యమాలు ప్రవచించిన కార్యకలాపాలు విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ, జాతీయ విద్య, సాత్విక నిరోధం.

విదేశీ వస్తువుల పట్ల బహిష్కరణ, మన దేశంలో తయారు చేయబడిన వస్తువులు మాత్రమే వాడటం - 'స్వదేశీ', ఇవి రెండూ కూడా భారతీయ పరిశ్రమల ప్రోత్సాహించటానికి (1), భారత ప్రజలకు (2) పని కి ఉద్యోగాలకు ఎక్కువ అవకాశాలు కల్పించటానికి ఉద్దేశించబడ్డాయి. అయితే విదేశీ వస్తువుల బహిష్కరణ వెనక గల (అసలు) మొదటి ఉద్దేశం విదేశీ ఉత్పత్తిదారులకు (3) పట్ల నష్టం కలిగించటం ద్వారా బెంగాలు విభజన రద్దుకు వారి సానుభూతి, సహాయాలను సంపాదించవచ్చునని లాలా లజపతిరాయ్ వెల్లడించారు. అయితే త్వరలోనే విదేశీయుల (4) పట్ల దోపిడీ కి వ్యతిరేకంగా బహిష్కరణ ఒక శక్తివంతమైన ఆయుధమని వెల్లడి అయ్యింది. అంతేకాక

గుర్తెరగాలి. అంత పెద్ద యంత్రాన్ని అంత మృదువుగా నడిపేట్లు చేయడంలో మీరు మరో గొప్ప కందినలు. నిర్లక్ష్యం చేయబడిన అట్టడుగు వర్గాల అవసరాలకు మీరు తెలుసుకుంటే ~~[illegible]~~ పాలన ను స్తంభింపచేయగల అద్భుతమైన శక్తి మీరుండన్న విషయాన్ని / విషయం పట్ల మీరు జాగ్రత్తం కావాలి."

✓ "సమితులు" అభివాదాలు సహకార సంస్థలు, వాలంటరీ అసోసియేషన్లు వెంట వారి పేర్లను కూడా ప్రోత్సహించారు. ముఖ్యంగా గ్రామాల పారిశుభ్రత; నివారణా పోలీసు విధులు; జాతరలు తదితర జన సమూహాల్ని నియంత్రించడం; కరువు సమయాల్లో సహాయ కార్యక్రమాలు; ఇతర ప్రకృతి విపత్తుల సమయాల్లో రక్షణా చర్యలు ~~[illegible]~~ సహకార, వాలంటరీ సంస్థలు చేపట్టాలని వారు కోరారు. ~~Arbitration~~ Committees were set up to decide civil and non-cognizable disputes.

సహకార ఉద్యమం యొక్క ఆశయాన్ని

బిపిన్ చంద్ర పాల్ మాటల్లో చెప్పాలంటే...

"సహకార సంస్థల ద్వారా ప్రథమంగా ప్రజల్లో (1) బలమైన పౌర విశ్వాసాన్ని సృష్టించవచ్చు. (strong civic sentiment) ఇది (2) సంఘటిత శ్రేయస్సు కు బాటలు వేస్తుంది. క్రమక్రమంగా వారికి సుదీర్ఘమైన బరువైన (3) స్వేచ్ఛా పౌరసత్వం యొక్క బాధ్యతల్ని మోసేందుకు సిద్ధపరచవచ్చు. దీని తర్వాతి అడుగుగా కేంద్రంలో విస్తృతంగా అనేక (4) రాజకీయ సంస్థల్ని ఏర్పాటు చేయవచ్చు, తద్వారా రాజకీయ నాయకులు ప్రజలతో (5) ప్రత్యక్ష - సజీవ సంబంధాలు ఏర్పరుచుకోవచ్చు. (6) ప్రభుత్వం మీద నిరాటంకంగా ప్రభావం చూపే వ్యవస్థీకృతమైన ప్రజాభిప్రాయాన్ని ఎప్పటికప్పుడు వెలిబుచ్చేలా తీర్చిదిద్దవచ్చు. ~~[illegible]~~ తద్వారా క్రమక్రమంగా ప్రజా హక్కుల్ని విస్తరించవచ్చు."

+

స్వాతంత్ర్య సమరంలో స్వదేశీ + జాతీయ విద్య కూడా రాయాలి.

## Gist

1. స్వదేశీ
2. బహిష్కరణ > (3) సహాయ నిరాకరణ
4. జాతీయ విద్య
5. సమాంతర సంస్థలు / "సమితులు"

# అతివాదుల ఘనత

1905 నుంచి 1920 వరకూ భారత జాతీయోద్యమాన్ని తమ భావాల చేత ప్రభావితం చేసి దాన్ని అతివాదయుగం గా పేర్గాంచేలా చేసిన జాతీయవాదులు (మహనీయులు) అతివాదులు.

1) వీరు విదేశీ పాలనకు భారతీయ ఆసక్తులకూ మధ్య వైరుధ్యాన్ని స్పష్టపరిచి అన్య విధేయతా భావాన్ని పూర్తిగా పారద్రోలారు.

2) భారతీయులకు ఆత్మ విశ్వాసాన్ని, స్వశక్తి మీద ఆధారపడటాన్ని నేర్పారు. నిద్రాణమైయున్న భారత జాతి తన శక్తి తెలుసుకొని జూలు విదిల్చిన సింహంలా పోరాడాలని పిలుపిచ్చారు.

3) క్రింది మధ్యతరగతి ప్రజలను, విద్యార్థులను, యువజనులను, మహిళలను చేర్చుకొని ఉద్యమానికి సాంఘిక పునాది ని ఏర్పాటు చేశారు.

4) రాజకీయ వ్యవస్థలను కొత్త పద్ధతుల్లో ఏర్పాటు చేయడం చేశారు. రాజకీయ సమరాలను కొత్త పద్ధతుల్లో జరపడం ప్రవేశ పెట్టారు.

5) వీరు తమ ఉపన్యాసాలు, రచనా ప్రచారాలు ద్వారా ప్రాంతీయ భాషలలో నిర్వహించి ప్రజలను

రాజకీయాల్లో చేరువ చేశారు.

6) అతివాదులు ప్రజాస్వామ్యం, రాజ్యాంగబద్ధత, ప్రగతి మొ॥ వాని గురించి మాట్లాడారు. వారి లో చాలా మంది పట్టణ ప్రాంత దిగువ మధ్యతరగతి వర్గానికి చెందినవారే. వీరు స్వదేశీ ఉద్యమ ఫలాలను విస్తరింపజేసి అలాగే కాంగ్రెసు గురించి స్వదేశీ భావాల గురించి సామాన్య ప్రజానీకంలో విస్తృతంగా ప్రచారం చేసి వారిలో రాజకీయ చైతన్యం కలిగించేందుకు కృషి చేశారు.

7) తీవ్రవాదులు - భారతీయుల ఆసక్తులకు పాశ్చాత్య వైరుధ్యాన్ని గుర్తించి ఆర్థికంగా ఆర్థిక దోపిడి తిలక్ మొదలైనవారు సభలు - సమావేశాలు చాలవని ప్రజాచర్య అవసరమని చెప్పారు. ప్రజల్లో ఆత్మ నిరతి, ఆత్మ త్యాగం పెంపొందాలని బోధించారు. సహాయ నిరాకరణ, సామ్రాజ్య ప్రతిఘటన, ప్రజా తిరుగుబాటు, ఆత్మ త్యాగం, స్వీయ సమృద్ధి, క్రమశిక్షణ, త్యాగం మొ॥ భావాల్ని + పద్ధతుల్ని అందించారు. అతివాదులు దేశభక్తిని 'ఒక విద్యావంతులు పొద్దుపుచ్చే వినోదం' స్థాయి నుండి 'దేశం కోసం సేవ, త్యాగనిరతి' స్థాయికి తీసుకెళ్ళారు.

8) అతివాదులు జరిపిన స్వదేశీ, బహిష్కరణ ఉద్యమాలు విజయవంతమయ్యాయి. 1911 లో బెంగాలు విభజన రద్దు చేయబడింది. ఈ విజయం భారతీయులకు ఆత్మ విశ్వాసాన్ని, తమ శక్తి పట్ల వారికి నమ్మకాన్ని కల్గించింది.

9) అతివాదుల ధ్యేయమైన "స్వరాజ్" ను ఆంగ్లేయులు అంగీకరించక పోయినప్పటికీ 'స్వరాజ్' ను కోరడం ఒక మొదటి విప్లవాత్మకమైన కోరికగా ప్రభుత్వ వ్యతిరేక చర్యగా పరిగణింపబడలేదు. ఇది అతివాదులు సాధించిన గొప్ప విజయం.

# అతివాదుల లోపాలు

అతివాదతత్త్వం అంటూ నిజానికి ఏదీ లేదు. 'అతివాద' తత్త్వం, రాజకీయాలుగా చెప్పబడినప్పటికీ అది ఒక నిర్దిష్ట రాజకీయతత్త్వం కాదని తెలుసుకోవాలి. అతివాదులుగా చెప్పబడేవారిలో బహిరంగా విప్లవకార్యకలాపాలు చేసేవారు (వారినిబట్టి), రహస్యంగా విప్లవకార్యాలను సమర్థించేవారు, ఏ విధమైన హింసాత్మకమైన చర్యల్నైనా పూర్తిగా వ్యతిరేకించేవారు కూడా ఉన్నారు. అంతేకాక అతివాదులలో అగ్ర నాయకులైన అరవిందో, తిలక్, పాల్, లజపతిరాయ్ లు వారి రాజకీయ భావాల్లో ప్రాధాన్యతాక్రమ విషయంలో; కార్యక్రమ ఆచరణా విధానంలో విభేదిస్తారు. నాయకుల్లో వేర్వేరుగాను ఒక నాయకుడే మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా తన అభిప్రాయాల్ని మార్చటం కూడా జరిగింది. ఉదాహరణకు, తిలక్ దృష్టిలో 'స్వరాజ్యం' ఒక విధమైన స్వయం-పాలన మాత్రమే కాగా అరవిందుని స్వరాజ్యం మాత్రం సంపూర్ణ స్వాతంత్ర్యం. తిలక్ విప్లవాత్మక భావాలు అతని చివరి రాజకీయ జీవితంలో తగ్గుముఖం పట్టడమే గాక తిలక్ ప్రభుత్వంతో సహకారం చేయటానికి సిద్ధమయ్యేట్లుగా కూడా కన్పడుతుంది.

ఇక అరవిందుని 'సంపూర్ణ స్వాతంత్ర్యం' భావన కూడా 'మానవ ఐక్యత' 'ప్రపంచ యూనియన్' గా మారిపోయింది. ఈ విధంగా ఆలోచనలకు నిర్దిష్ట లక్ష్యం గాని స్పష్టమైన ఆశయాలు, ఆదర్శాలు గాని ఉన్నట్లు కన్పడదు.

[అందుకే విదేశీ పాలన వల్ల కలిగే చెడుగుల్ని గుర్తించడం లేదా వలస పాలనా సంకెళ్ల నుండి ఏదో ఒక విధమైన స్వాతంత్ర్యాన్ని కోరుకోవడం లేదా ఆలోచనలుగానూ బయటగానే కన్పిస్తాయి. ఆలోచనం అన్నది నిజానికి ఆలోచనా క్రమం, ఒక సందర్భాన్ని ఎదుర్కోవడానికి ఇచ్చే ఆచరణాత్మక వ్యూహం.]

సాంఘికంగా చూసినట్లయితే ఆలోచన భావజాలం ఆవిర్భవించడం ప్రగతి (2) నిరోధకంగా తోస్తుంది. మితవాదుల్లో నాయకులు పేరు ఆధునికీకరణ, సాంఘిక సంస్కరణల్లో చెప్పుకోదగినంతమైన మార్పులను లేవదీయలేదు. అలాగే బాలికల వివాహ వయస్సు ను పెంచేందుకు ~~ఉద్దేశించబడిన~~ The Age of Consent Bill

ను వ్యతిరేకించడం ; కాంగ్రెస్-వ్యతిరేక సంస్థలలో చేరడం ; (1893) గణేష్ ఉత్సవాల్ని నిర్వహించడం; శివాజీ ఉత్సవాల్ని జాతీయ పండుగలుగా జరపడం ఇవన్నీ హిందూ సంస్థల్ని హిందూ జాతీయవాద నాయకులు గా చిత్రించేందుకు దోహదం చేశాయి. ప్రధానంగా లాలాలజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్‌లు సాంఘిక సంస్కరణల కన్నా ఎంతో గొప్పగా చెప్పినప్పటికీ వారు కేవలం హిందూ జాతి గురించి, రాజకీయ స్థాయిలో హిందూ ఆసక్తుల్ని పరిరక్షించడం మొ|| వాటి గురించి మాట్లాడటం చేశారు. వాస్తవాలు & ఆలోచనల ప్రగతి నిరోధకంగా కన్పించే సంప్రదాయాల్ని విదేశీ పాలన ను వ్యతిరేకంగా ప్రచారించినవే. అయినప్పటికీ ఇది రాజకీయాలకూ - మతానికీ మధ్య ఆరోగ్యకరమైన అనారోగ్యకరమైన సంబంధాన్ని పెంపొందించడానికీ; మతతత్వాన్ని మేలుకొలుపడానికీ; ముస్లిం వేర్పాటు వాదానికీ దారి తీసింది.

తెలంగాణులు ప్రజా ఉద్యమాన్ని గాని సామాన్య ప్రజాస్వామికం లో రాజకీయ ప్రచారం చేసినా ఇంకా సామాన్యజనంలో ఎక్కువ మంది, కార్మికులు, కర్షకులు జాతీయ రాజకీయాల (3) ప్రధాన ప్రవాహానికి వెలుపలే ఉన్నారు.

ప్రజా సమరాలు ఏర్పాటు చేయడానికి గొప్ప కృషి జరుగుతోందని ఎర ప్రచారాలు ప్రసంగాలు జరిగినప్పటికీ మొత్తం మీద అలాంటి ప్రజా సమరాలు అసలు లేవని చెప్పాలి. శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ వట్టి భావాలు గా మాత్రమే ఉండి పోయాయి. పటిష్టమైన రాజకీయ సమరాలు కు / సమర (4) పద్ధతులను చూపెట్టే లక్ష్యం సఫలం కాలేదు. దేశానికి పటిష్టమైన జాతీయ వ్యవస్థ ఏదీ లేకపోయింది.

తెలంగాణులు (5) పెట్టుబడిదారీ విధానం పరిధులను దాటలేకపోయారు. సాంఘిక - ఆర్థికాభివృద్ధి ఇంకా ఇప్పటికీ పెట్టుబడిదారీ విధానానికి లోబడి ఉందని అలక్ ఆదితర తెలంగాణులు భావించారు.

తెలంగాణులు ఆశయాలు సమున్నతమైనవే అయినప్పటికీ ప్రజల తో (ధనాత్మకమైన) [illegible]

నాయకుల్ని / మార్గదర్శకుల్ని అందించడం లో విఫలమయ్యారు. ప్రజా ఉద్యమాన్ని నడపడానికి చర్య ని (6) వ్యవస్థీకరణ ను అందించలేకపోయారు. అలాగే అరెస్టు వల్ల, అరవిందుని నిష్క్రమణం వల్ల ఉద్యమం కుంటుపడిపోయిందనడం లో అందులో ఆశ్చర్యం లేదు.

వారు ప్రజా చైతన్యాన్ని రేకెత్తించగలిగారే గాని ఆ చైతన్యాన్ని ఏ మార్గం లో పెడితే ఫలవంతమవుతుందో ఆ చైతన్యానికి కావ (7) ఫలవంతమయ్యే మార్గాన్ని మాత్రం చూపలేక పోయారు. అయితే 1908 ప్రాంతాల నుంచి ఉగ్రవాద కార్యకలాపాలు వృద్ధి చెందడానికి ఇదొక కారణమై ఉంటుంది. వారు రైతుల వద్దగా కార్మికుల వద్దగా రాజకీయ కార్యకలాపాల్ని చేర్చలేకపోయారు. రైతులకు శిస్తు నిరాకరణ ; కార్మికులకు పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా సమ్మెలు చేయడం మొ॥ కార్యక్రమాలు అందించగలిగితే వారు ఆ వర్గాలకు చేరువయ్యేవారు, అయితే అతివాదులు అలాంటి చర్యలేవీ చేపట్టలేదు.

# హోంరూలు ఉద్యమము - వివిధ వర్గాల ప్రాంతాల పాత్ర

మొదటి ప్రపంచయుద్ధ సమయంలో భారతదేశంలో రాజకీయ స్తబ్దతని తొలగించటానికి తిలక్, బిసెంటులు నడిపిన ఉద్యమమే హోంరూలు ఉద్యమము. ఈ నాటికి కాంగ్రెసు ప్రజా ఉద్యమానికి సిద్ధంగా లేనందున వీరు కాంగ్రెసు కు వెలుపలే ఈ ఉద్యమాన్ని నిర్వహించారు.

అనిబిసెంటు హోంరూలు లీగు ఏర్పాటు Sept, 1915 యోచన ను వెల్లడించి 'న్యూ ఇండియా' 'కామన్ వెల్త్' అనే మద్రాసు దినపత్రిక నుంచి తర్వాత 'యంగ్ ఇండియా' (early 1916) అనే బొంబాయి దినపత్రిక నుంచి ఈ దిశగా కృషి చేసింది.

అయితే తిలక్ మహారాష్ట్రలో తన ప్రాబల్యాన్ని వినియోగించి 1916 ఏప్రిల్ లోనే తన హోంరూలు లీగ్ ను (ఏర్పాటు చేసి) బిసెంటు కంటే ముందుగా ఏర్పాటు చేశాడు. ఇది కేవలం మహారాష్ట్ర, కర్ణాటకలకే పరిమితమయ్యింది. అయితే 1917 ఏప్రిల్ నాటికి (14,000) 14 వేల మంది 1918 లోనాటికి 32 వేల మంది సభ్యులుగా చేరారు.

బిసెంటు హోంరూలు లీగు కు అఖిల

భారత గూండా ఉన్నప్పటికీ అది దాని స్థాపనలోని దివ్యజ్ఞాన సమాజ సంబంధాలపై మొదట్లో ఎక్కువగా ఆధారపడింది. బిసెంటు లీగు 1916 సెప్టెంబరులో స్థాపించబడింది.

అలాగే కేల్కర్‌లు పూనా నుంచి చాలా కేంద్రీకృత వ్యవస్థగా ఉద్యమాన్ని నడుపుతున్నారు. అయితే ఆదయార్ ప్రధాన కేంద్రంగా గల బిసెంటు లీగు మాత్రం దాని 200 లకు పైగా ఉన్న దాని స్థానిక బ్రాంచీలపై వదులైన పర్యవేక్షణ మాత్రమే చేసేది. వీటిలో 132 బ్రాంచీలు మద్రాసు ప్రెసిడెన్సీలోనే ఉన్నాయి. ఉద్యమ ఉచ్ఛస్థితిలో బిసెంటు లీగులో (1917 మధ్యకాలంలో) 27 వేల మంది సభ్యులున్నారు.

వారి రూలు ఉద్యమ కార్యకలాపాలుగా సంఘాలుగా సమావేశాల్ని / చర్చా కార్యక్రమాల్ని చేపట్టడం; నగరాల్లో పఠనాలయాల్ని ఏర్పర్చడం; ఆధీన సంస్థల్లో pamphlets ని అమ్మడం; ఉపన్యాస యాత్రలు చేయడం మొ॥ — పాత మితవాదుల పద్ధతులకు వీటికి తేడా ఏమీ లేదు. అయితే స్థాయిలోనూ వ్యాప్తిలోనూ చూసినట్లయితే ఇది తప్పకుండా

కొత్తదనాన్ని సంపాదించింది.

అలాగే లేక మొదటి సంవత్సరంలో ఆరు మరాఠీ, రెండు ఇంగ్లీషు pamphlets లు దాదాపు 47,000 కాపీలు అమ్మింది. బిసెంటు(వ్యవస్థ) సంస్థ 1916 sept. నాటికి 26 రకాల tracts ని దాదాపు 3,00,000 కాపీలు అమ్మింది.

1917 జూన్ లో బిసెంటు, ఆమె అనుచరులు సహచరులు అరెస్టయిన, వారిని ప్రభుత్వం అరెస్టు చేసినప్పుడు సామూహిక ప్రతిఘటన చేయాలని కూడా చర్చ జరిగింది.

చాలా వరకు ప్రచారం కూడ [illegible] (మరీ abstract గా ఉన్న) అగోచరంగా ఉన్న విద్యావంతులకు అంతమైన స్వయం పాలన కి పరిమితంలో మామూలుగా ఉన్న అలాంటి ఉపన్యాసాలు కొన్ని ఆసక్తికరమైన కృషి ని వెల్లడిస్తాయి. అలాగే పదే పదే అర్థంలో గాంధేయ భావాన్ని చెప్పడం కన్పిస్తుంది. స్వయం పాలన అన్న ఆదర్శాన్ని మరింత నిర్దిష్టమైన, బలీయమైన ప్రజల బాధలతో ముడిపెట్టడం చేశారు.

' అడవి శాఖ విభాగాలు మన మీద జులుం చెలాయిస్తున్నారు. అబ్కారీ శాఖ విభాగం లో మద్యం బాగా వ్యాపించింది' అని చెప్పాం ఉద్యమం, 1916 లో తిలక్ ఉన్నాడు. దీంతో పాటు రెవెన్యూ బిల్లులు, ఉప్పు పై పన్ను గురించి కూడా తిలక్ ప్రస్తావించడం జరిగింది. ఇలా పలు రకాల్ని ఉద్యమ సందర్భంగా పరిగణన లోకి తీసుకున్నారు.

ప్రా

తిలక్ ఉద్యమం పూర్తిగా బ్రాహ్మణులకు పరిమితమైన విషయం కాదు. తిలక్ సభ్యుల్ని జాబితాల్ని పరిశీలిస్తే, పూనా లోని బ్రాహ్మణేతర వ్యాపారులు చెప్పుకోదగ్గ రీతి లో పాల్గొన్నారు; ఖాందేష్ లాంటి జిల్లాల్లో గుజార్లు - మరాఠాలు బ్రాహ్మణుల సంఖ్యను మించిపోయారు.

మరో రకం తిలక్ నాయకులైన బి.పి.వాడియా లాంటి వారు కొంత ట్రేడ్ యూనియన్ కార్యకలాపాల్ని కూడా ఆరంభించారు. అయితే ఇది చాలా మితవాద స్వభావం కలిగినటువంటిది. మద్రాసు నగర కార్మికుల్లో ఈ విధమైన మితవాద ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు ఆరంభం చేయబడ్డాయి.

ప్రారంభించారు

బిసెంటు లీగుకు మద్రాసు నగరం లాంటి తమిళ బ్రాహ్మణులు, మొఫుసిల్ పట్టణాల్లోని బ్రాహ్మణులు యునైటెడ్ ప్రావిన్సు లాంటి పట్టణ ప్రొఫెషనల్ గ్రూపుల వారి మద్దతు, అందులోనే యు. ప్రా. లోని కాయస్థుల, కాశ్మీరీ బ్రాహ్మణులు, కొంతమంది ముస్లింల మద్దతు లభించింది. సింధు లాంటి హిందూ అమిల్ మైనారిటీ వర్గాల మద్దతు అందింది. బొంబాయి నగరం, గుజరాతులలోని యువతరాలైన గుజరాతీ పారిశ్రామికవేత్తల వర్తకుల, న్యాయవాదుల సహకారం లభించింది.

(1) థియొసాఫీ దాని నిరంతర సంస్కరణా భావజాలంతో, ప్రాచీన హైందవ విజ్ఞానం - వైభవాలకు సంబంధించిన సిద్ధాంతాలు, ఆధునిక పాశ్చాత్యం సాధించిన విజయాలన్నీ భారత ఋషులు ఏనాడో ఊహించినవేనన్న మౌలిక ఆలోచనలు మొ॥ వి/ ఇట్టి వర్గాలు ఉద్యమం పట్ల అధికంగా ఆకర్షితులవ్వడానికి కారణమయ్యాయి. పైగా (2) ఈ ప్రాంతాలు అంతకు ముందు పునరుజ్జీవనోద్యమాలైన బ్రహ్మసమాజం, ఆర్య సమాజం మొ॥ వాని కార్యకలాపాలలో ప్రభావితం కాకపోవడం కూడా అందుకు కొంత దోహదం చేసింది. పైగా ఈ ప్రాంతాల్లో

బొంబాయి, మద్రాసు నగరాలు తప్ప మిగిలిన ప్రాంతాల్లో రాజకీయ (3) శూన్యత చోటుచేసుకుందని చెప్పవచ్చు. ఈ ప్రాంతాల్లో బలీయమైన రాజకీయ సంప్రదాయాలేవీ మితవాదులవైనా, అతివాదులవిగానీ ఏర్పాటుచేయబడక పోవడం కూడా మరో కారణం.

ఉద్యమ చివరి దశలో బిసెంటే స్వయంగా రాడికల్ రాజకీయాలనుంచి పూర్తిగా వేరు పడింది. ఆమెతో పాటే ఆమె ఆప్త సహచరులైన వాడియా, అరుండేల్, సి.పి. రామస్వామి అయ్యర్ మొ॥ వారు కూడా వేరు పడ్డారు.

ఉద్యమ ప్రాముఖ్యత

అయితే (1) హోంరూలు ఉద్యమం చేత చైతన్యం గాబడిన ఎందరు యువకులు భవిష్యత్తులో మంచి నాయకులుగా వెలుగొందారు. వారిలో మద్రాసులో సత్యమూర్తి; కలకత్తాలో జితేంద్రలాల్ బెనర్జీ; అలహాబాదులో నెహ్రూ జవహర్; లక్నోలో ఖాలీకుజ్జమన్; బొంబాయి - గుజరాతులలో ధనికులైన జమ్నాదాస్ ద్వారకాదాస్ పారిశ్రామికవేత్త ఉమర్ సొభాని, ధనిక కొడుకు శంకరలాల్ బంకర్ ఇంకా ఇందులాల్ యాజ్ఞిక్ మొ॥ వారు ముఖ్యులు.

# భారత కౌన్సిల్ చట్టము 1909

## మింటో-మార్లే సంస్కరణలు

### చట్టం చేయడానికి దారి తీసిన పరిస్థితులు :-

1) భారతీయులు కోరుకున్న స్వాయత్తమైన కోరికలను కూడా 1892 భారత కౌన్సిల్ చట్టం నెరవేర్చలేదు. దాంతో తిలక్ రాజకీయ వాదులు నయము దాయింపులతో బతిమిలాడితే వచ్చేవి కావని ఒత్తిడి ద్వారా మాత్రమే వాటిని సంపాదించగలమని తెల్పి చెప్పారు.

2) విదేశ పాలన వల్ల నిరంతరం కొనసాగుతున్న ఆర్థిక దోపిడి ఆర్. సి. దత్తు, నౌరోజీ మొ॥ వారి అధ్యయనాల వల్ల రుజువు చేయబడి దేశ దుస్థితి & వలస పాలకులు వారంభికంగా నిర్దుష్టంగా అవలంబిస్తున్న విధానాలే కారణాలని స్పష్టంగా తెలియసాగింది.

3) ప్రజల్లో రాజకీయ స్పృహ ని పెంచిన కారణాలు ఇంకా అనేకం ఉన్నాయి. ప్రభుత్వ సర్వీసుల్లో భారతీయులకు తగిన ప్రాతినిధ్యం ఇవ్వలేదు. 1899 కలకత్తా కార్పొరేషన్ చట్టం ద్వారా దాన్ని పూర్తిగా అధికారీకరణ చేశారు. దాని మొత్తం సభ్యుల సంఖ్య లో మూడవ వంతు ని తీసేసి ఆంగ్లేయుల ఆధిపత్యం

రద్దుచేశాడు. [He completely officialised the Calcutta Corporation, giving it a European majority by reducing total membership by a third, through his infamous Act of 1899]

1904 లో విశ్వవిద్యాలయాల చట్టం ద్వారా వాటి స్వయం అటానమీని తీసేసాడు. 1904 లోనే ఆఫీషియల్ సీక్రెట్స్ చట్టం ద్వారా 'రాజద్రోహ' పరిధిని పెంచాడు. 1905 బెంగాల్ విభజన ద్వారా ప్రజలకు ప్రభుత్వం మరింత దూరమైంది.

4) ఆంగ్లేయుల జాతివివక్షత ప్రధానంగా దక్షిణ ఆఫ్రికా లో భారతీయుల్ని కేవలం వారు భారతీయులనే నల్లజాతివారని తీవ్ర వివక్ష & అవమానాలకి గురి చేసేవారు. ఇది భారతజాతీయుల్లో ప్రతిఘటనని రగుల్చింది. అంతేకాక భారతీయులు వారి సొంతదేశంలో స్వాతంత్ర్యం పొందనిదే ఇతర దేశాల్లో పోరాడి ఎదుర్కోవడం సాధ్యం కాదని గుర్తించడం జరిగింది.

5) 19 వ శతాబ్దం చివరి రోజుల్లో దేశాన్ని పీడించిన క్షామాలు, బ్యుబోనిక్ ప్లేగు ఆంగ్ల పాలనా ఫలితమే నని ప్రజలు భావించారు. సహాయచర్యలలో మంచి ఉద్దేశం లోపించి ప్రభుత్వం ప్రవర్తించినట్టు ప్రజలు దాన్ని కావాలని తమ వ్యక్తిగత స్వాతంత్ర్యాల్లోకి కాలరాయడం గా నిందించారు.

6) 1882 నుంచి దేశంలో జాతీయ పత్రికలు స్వేచ్ఛగా వృద్ధి చెందుతున్నాయి. అవి జరుగుతున్న మార్పుల్ని గమనించి ఆంగ్ల పాలకను తీవ్రంగా విమర్శించసాగాయి. వేదికలు కూడా ఆ విషయంలో వెనుక పడలేదు. లాల్-బాల్-పాల్ లు దేశమంతా ప్రచండంగా ప్రచారాన్ని కొనసాగించి దేశ వాతావరణాన్ని వేడెక్కించారు.

7) అంతర్జాతీయంగా ఇటలీ పై ఇథియోపియా, రష్యా పై జపాన్‌లు సాధించిన విజయాలు తెల్లవాడి గొప్పదనానికి గొడ్డలిపెట్టు గా పరిణమించాయి. తెల్లవాడు అజేయుడన్న భావం ఇకమీదట పటాపంచలైంది. ఇవి భారతీయులకు కొంతమేర ఆత్మవిశ్వాసాన్ని స్ఫూర్తి నే అందించాయి.

8) దేశ రాజకీయాల్లో 'తీవ్రవాద' ప్రాబల్యం పెరగసాగింది. దాంతో 1907 లో సూరత్ సభలో కాంగ్రెసులో మితవాదులు, తీవ్రవాదులు విడిపోయారు. మితవాదులు మాత్రమే కాంగ్రెస్ లో మిగిలారు.

మరో పక్క జాతీయోద్యమ ఆరంభం నుంచి ముస్లింలు ఉదాసీనంగానే ఉన్నారు. అందుకు వారి విద్య, ఆర్థిక వెనుకబాటుతనం; లేదా అల్పసంఖ్యాకులమన్న భయాలు కారణాలు.

దీంతో బ్రిటిష్ రాజకీయవాదులందరూ వేడిని దృష్టిలో పెట్టుకుని ఏదో ఒక వర్గానికైనా తృప్తి కల్గించే సమయం అంటూ ప్రభుత్వం గుర్తించింది. ఈ రాజకీయ చైతన్యాన్ని అణిచివేసి ప్రభుత్వం నిరంకుశ (1) అణిచివేత, మితవాదుల్ని (2) సంతృప్తి పర్చేందుకు కొన్ని సదుపాయాలు కల్పించడం, (3) విభజించి పాలించడం అనే మూడు పద్ధతుల్ని పాటించదలచింది / పాటించింది. చివరి రెండు పద్ధతుల్ని సాధించేందుకే ప్రభుత్వం 1909 భారత కౌన్సిళ్ళ చట్టం చేయాలని వచ్చింది. (ఆ) ను చేసింది.

1892 భారత కౌన్సిల్స్ చట్టాన్ని కాంగ్రెసు ఉద్యమ వేగాన్ని తగ్గించేందుకు చేశారు. అయితే 1909 చట్టాన్ని భారతజాతీయకాంగ్రెసులోని మితవాదుల్ని, ముస్లింలుల్ని తమ వైపుకు తిప్పుకోవడానికి తద్వారా ఆంగ్ల ఉద్యోగస్వామ్యానికి అండగా నిలవడానికి చేసింది.

# 1909 చట్టం లోని ముఖ్యాంశాలు

ఈ చట్టం కేంద్ర, రాష్ట్ర శాసనసభలందు అదనపు సభ్యుల సంఖ్యను, అధికారాల్ని విస్తృతం చేసింది. కేంద్ర, రాష్ట్ర శాసనసభలందు ప్రత్యేక నియోజక వర్గాలు కేటాయించబడెను.

కేంద్ర శాసనసభ:




అదనపు సభ్యుల సంఖ్య గరిష్ఠపరిమితి '60' కి పెంచబడింది, దాంతో మొత్తం సభ్యులు 69 అయ్యారు. అందులో 37 మంది అధికారసభ్యులు మిగిలిన 32 మంది అనధికారులు. అధికారుల్లో 9 మంది ఎక్స్-అఫీషియో సభ్యులు — వారు: గవర్నరు జనరలు; 7 గురు ఎక్జిక్యూటివ్ కౌన్సిలర్లు; ఒక ఎక్స్‌ట్రార్డినరీ సభ్యుడు. మిగిలిన 28 మంది అధికార సభ్యులు గవర్నరు జనరలు చేత నియమించబడతారు.

32 మంది అనధికారసభ్యుల్లో 5 గురు గవర్నరు జనరల చేత నియమించబడతారు. మిగిలిన 27 మంది ఎన్నుకోబడుతారు.

అయితే ఈ విధంగా ఎన్నుకోబడటానికి భారతదేశానికి ప్రాంతీయ/ప్రాదేశిక భౌగోళిక ప్రాతిపదికం సరిపడదని తెల్పారు. అందువల్ల భారతశాసనసభలో

ఎన్నిక సూత్రంగా వివిధ తరగతులు, ఆసక్తుల ప్రాతినిధ్యం ఇవ్వడమే మేలైతే ఆచరణాత్మకమైన విధానమని నిర్ణయించారు.

ఈ ప్రాతిపదికన మొత్తం 27 మంది ఎన్నిక కాబడే సభ్యుల్లో 13 మంది ప్రాదేశిక నియోజకవర్గాల నుంచి ఎన్నుకోబడుతారు. మిగిలిన 14 మందిలో 6 గురు భూస్వాముల నియోజకవర్గాల నుంచి 6 గురు ప్రత్యేక ముస్లిం నియోజకవర్గాల నుంచి మిగిలిన ఇద్దరు బెంగాలు, బొంబాయి ఛాంబర్ ఆఫ్ కామర్స్ నుండి ఎన్నుకొనే విధంగా ఏర్పాటైంది.

ప్రావిన్షియల్ శాసన సభలు :-

1909 చట్టం ద్వారా పెంచబడిన వివిధ ప్రావిన్సుల శాసనసభల సభ్యుల సంఖ్య — బర్మా : 16, తూర్పు బెంగాలు, అస్సాం — 41 ; బెంగాలు - 52, మద్రాసు, బొంబాయి, యునైటెడ్ ప్రావిన్సులలో ఒక్కొదానికి 47, పంజాబు - 25.

ఈ చట్టం ప్రావిన్సుల్లో అనధికారసభ్యుల మెజారిటీ ఏర్పరచింది. అయితే అనధికారసభ్యుల్లో

కొంతమంది ని గవర్నరు నియమించుటచేత వారు ప్రభుత్వ పక్షం వహించుట చేత శాసనసభలపై /లు ప్రభుత్వ అధికారం లభించి ఉండేట్లు చేయబడింది.




ఉదాహరణకు మద్రాసులో 47 గురు శాసనసభ్యుల్లో 21 మంది అధికారులు 26 మంది అనధికారులు. ఈ 26 మంది అనధికారసభ్యుల్లో 5 గురిని గవర్నరు నియమించును, మిగిలిన 21 మంది ఎన్నుకోబడుతారు. 21 మంది అధికారసభ్యులు మరియు ఈ 5 గురు నియమింపబడిన అనధికారసభ్యులు ఎప్పుడూ ప్రభుత్వ పక్షమే వహించుట చేత శాసనాలలో అధికారసభ్యులదే మెజారిటీగా ఉండేది. ఇదే విషయం ఒక్క ప్రాంతీయులకు వర్తిస్తుంది.

ఈ ప్రాంతీయులను ఎన్నుకోబడేవారు వివిధ నియోజకవర్గాల ద్వారా ఎన్నుకోబడుతారు. ప్రత్యేక నియోజకవర్గాలు, విశ్వవిద్యాలయాలు, డిస్ట్రిక్ట్ బోర్డులు, మున్సిపాలిటీలు మొ॥ వారిని ఎన్నుకొనేవి.

కేంద్ర కార్యనిర్వాహక మండలి లో ఒక భారతీయుడుండుటకు ప్రాతినిధ్యము కల్పించిరి. ఇట్లు నియమితుడైన ప్రథమ భారతీయుడు ఎస్. పి. సిన్హా.

రాష్ట్ర కార్యనిర్వాహక మండళ్లలోనూ, ఇండియా కౌన్సిలు లోను భారతీయులకు ప్రాతినిధ్యమియ్యబడింది. బెంగాలు, మద్రాసు, బొంబాయి ప్రావిన్సులలో కార్యనిర్వాహక మండలి సభ్యుల సంఖ్య 4 కి పెంచబడింది. లెఫ్టినెంట్ గవర్నర్లకు కూడా ఇలాంటి మండళ్ళను నియమించే/ ఏర్పాటు చేసే అధికారం ప్రభుత్వానికి ఇవ్వబడింది.

శాసన సభల విధులు - అధికారాలు:-

1909 చట్టం ద్వారా కేంద్ర, రాష్ట్ర శాసనసభల అధికారాలు పెంచబడ్డాయి. ఈ చట్టం సభ్యులకు చర్చల్లో పాల్గొని "అనుబంధ ప్రశ్నలు" వేసే అధికారాన్ని ఇచ్చింది. కేంద్ర శాసనసభ లో బడ్జెటు మీద చర్చకు సంబంధించి విస్తృత నియమావళి ఏర్పాటు చేశారు. సభ్యులకు బడ్జెటు మీద ఓటు చేసే అధికారం లేదు. అయితే స్థానిక ప్రభుత్వాలకు అదనపు గ్రాంట్లు కేటాయించమని, పన్నుల సవరణలు, కొత్త అప్పులు, బడ్జెటు లో ప్రతిపాదించబడిన ఇతర అంశాలు, వివరణాత్మక పత్రం లో చెప్పబడ్డ అంశాలు మొ|| వాటికి సంబంధించి సభ్యులు తీర్మానాలు చేయవచ్చు.

ఇవేగాక, ఫైనాన్షియల్ స్టేట్మెంట్ ను

సభకు సమర్పించవలెను దాని పైనాన్సు సభ్యులు (ఫైనాన్స్) గా ఉన్న కమిటీ పరిశీలనకు పంపాలి. ఈ కమిటీలలో అనధికార సభ్యులు, నియమించబడ్డ సభ్యులు 50 : 50 ప్రాతినిధ్యంలో ఉంటారు.

సాధారణ ప్రజా సమస్యలను సంబంధించిన

విషయాలను చర్చించేందుకు కూడా నియమాలు ఏర్పాటు చేయబడ్డాయి. సభ్యులకు వివిధ విషయాలపై ప్రశ్నలు చేసేందుకు, బిల్లు ప్రవేశపెట్టేందుకు వీలు ఉంది. అయితే ప్రెసిడెంటుకు ఈ ప్రశ్నలను భాగాన్ని గాని మొత్తాన్ని గాని ఏ కారణం చూపకుండా రద్దు చేసే అధికారం ఉంది. అలాగే ప్రశ్నలు ఒకవేళ సభ ఆమోదం పొందినా ప్రభుత్వం వాటికి కట్టుబడి ఉండాల్సిన అవసరం ఏమీ లేదు.

అయితే ఈ చట్టం చర్చించ కూడదు నిషేధించబడిన అంశాలు కొన్ని ఉన్నాయి. శాసన సభ్యులు భారత ప్రభుత్వ విదేశ వ్యవహారాలు, స్వదేశీ సంస్థానాధీశులతో గల సంబంధాలను గురించి గాని సైన్య వ్యవహారాలు మొ|| అంశాలు, ప్రభుత్వ రైల్వే పద్దులు అప్పు మీద వడ్డీ మొ|| అంశాలను గురించి చర్చించరాదు.

## 1909 చట్టం మీద విమర్శనాత్మక అంచనా

1909 చట్టం భారత రాజకీయ సమస్యల పై పరిష్కారాన్ని ఇవ్వలేకపోయింది / చెయ్యలేదు. అత్యల్ప మందికి మాత్రమే ఓటుహక్కు / పరిమితమైన ఓ.హ. / కొద్దిమందికే ఓటుహక్కు, పరోక్ష ఎన్నికలు, పరిమితమైన అధికారాలు మాత్రమే శాసన సభలకు ఇవ్వడం .. ఇవన్నీ ప్రాతినిధ్య ప్రభుత్వాన్ని నామమాత్రం చేశాయి. వాస్తవాధికారాలన్నీ ప్రభుత్వం చేతిలోనే ఉన్నాయి. శాసన సభలకు మిగిలింది విమర్శించడమొక్కటే!

ఈ సంస్కరణలు భారత రాజకీయాల్లో అనేక కొత్త సమస్యలను సృష్టించాయి. వాటిలో అతి ముఖ్యమైంది ముస్లిములకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటు చేయడం. జవహర్ లాల్ నెహ్రూ దీని ప్రభావాన్ని తెలుపుతూ

"దీని ద్వారా మన ముస్లిం సోదరుల చుట్టూ రాజకీయ అడ్డుగోడలు కట్టబడ్డాయి. వారిని మిగిలిన భారతదేశం నుంచి వేరు చేశారు. శతాబ్దాల తరబడి సాగుతున్న ఐక్యం చేసే మిశ్రమం చేసే నిరంతర కార్యాన్ని వెనక్కు మళ్ళించినట్లయ్యింది. అది లా

ఈ చట్టం అప్పుడే ఎదుగుతున్న ప్రజాస్వామ్యాన్ని కళ్ళెపాటు పొడిచిందని కె.ఎమ్. మున్షి వ్యాఖ్యానించారు.

భారత రాజ్యాంగ సంస్కరణలపై నివేదిక (1918) (సమసరిగా) లో ఇలా చెప్పబడింది.

"మత ప్రాతిపదిక నియోజక వర్గాలు చరిత్ర పాఠాలకి వ్యతిరేకం. ఇది మతాల, వర్గాల విభజనని శాశ్వతం చేసింది. ఫలితంగా ప్రజలు భిన్న వర్గాలుగా ఏర్పడి అనేక పౌరుల మధ్య విభేదం మరియు పక్షాలుగా భావించేలా చేసింది. ఇది ప్రస్తుతమున్న (వర్గ విభజన) భావాన్ని బలోపేతం చేసింది. స్వయం-పాలనా విధానం వృద్ధి చెందదాని & ఇది ముఖ్య సూత్రంగా పరిగణించగలదు."

లార్డ్ మోర్లే అను మింటో కు రాసిన లేఖ లో ప్రత్యేక నియోజకవర్గాల్ని అందించటం ద్వారా అనేక "మనం రాక్షసి బల్లి పళ్ళను నాటుతున్నాం, దీని పంట చాలా చేదుగా ఉంటుంది" (We are sowing dragon's teeth and the harvest will be bitter) అని చెప్పింది

వాస్తవమే.

1909 చట్టం వల్ల అసంతృప్తి వెల్లడించారు. అనేక ఇతర కారణాలు కూడా ఉన్నాయి. ప్రజలు కోరింది దేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని. కానీ వారికి దక్కింది మాత్రం సుదూరమైన, ఎప్పుడోగాని ప్రమత్తమయ్యే ప్రజాస్వామ్యం లో కలిసిన (benevolent despotism) ఉదార నియంతృత్వం మాత్రమే. ఈ బిల్లు ను పార్లమెంటు లో ప్రవేశపెడుతూ మోర్లే అసలు భారతదేశంలో పార్లమెంటరీ వ్యవస్థ ను ప్రవేశపెట్టే యోచన ఏదీ లేదని స్పష్టంగా చెప్పాడు. దేశం లో అప్పుడే ఆరంభమైన నూతన జాతీయవాద శక్తులకు ఈ ప్రకటన చికాకు కలిగించింది.

ఆచరణ లో ఈ సంస్కరణలు మరిన్ని సమస్యల్ని సృష్టించాయి. పార్లమెంటరీ రూపం ప్రవేశ పెట్టారే గాని బాధ్యతనేదీ ఇవ్వలేదు. ఇది ఆలోచనలేని బాధ్యతారహితమైన ప్రభుత్వ విమర్శకు దారి తీసింది. భారతనాయకులు శాసనసభల్ని ప్రభుత్వ కార్యకలాపాల్ని నిరసించే వేదికలుగా మార్చుకున్నారు. తాము ఏ బాధ్యతలు నిర్వర్తించవలసిన అవసరం లేదన్న భావన (వారిని ... ) వారికి బాధ్యతారహిత

ధోరణి ని అలవర్చింది.

ఈ చట్టం ప్రవేశపెట్టిన ఎన్నికల పద్ధతి ఎంత హాస్యంగా ఉందంటే, ప్రజా ప్రాతినిధ్యం అన్నది మొత్తం మీద అనేక స్థాయిల్లో పరోక్ష కార్యక్రమంగా మారిపోయింది. ప్రజలు స్థానిక సంస్థల సభ్యుల్ని ఎన్నుకునే వారు. ఈ సభ్యులు ఎలెక్టోరల్ కాలేజీ సభ్యుల్ని ఎన్నుకుంటే వారు మళ్లీ ప్రావిన్షియల్ శాసనసభ సభ్యుల్ని ఎన్నుకునేవారు. ఈ సభ్యులు (ప్రా.శా.స. లో ఈ విధంగా ఎన్నికైన సభ్యులు కేంద్ర శాసనసభ సభ్యుల్ని ఎన్నుకునేవారు. దీని లోపాల్ని 1918 మాంటెఫర్డ్ నివేదిక మాటల్లోనే చెప్పాలంటే

" ప్రాథమిక ఓటరుకు అంతిమ ప్రతినిధిగా శాసనసభలో కూర్చునే వ్యక్తి కి ఏ విధమైన సంబంధమూ లేదు. ఈ ప్రాథమిక ఓటరు ఓటుకు శాసనసభా కార్యక్రమాల మీద ఏ విధమైన ప్రభావమూ ఉండదు. ఇలాంటి పరిస్థితుల్లో ఓటుహక్కును వినియోగించుకునే ఓటరు మీద ఏ విధమైన బాధ్యతలు గాని అతనికి ఏదైనా రాజకీయ విజ్ఞానం రావడం గాని ఉండవు. బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని

తప్పుల బరువును మోయగల ప్రజల తయారు చేయ డానికి ఇంకా ఎంతో శ్రమ/పని చేయాల్సి ఉంది."

1909 సంస్కరణలు వారి ప్రజలకు ఇచ్చింది నీడలే గాని నిజం పదార్థం కాదు. (the shadow rather than the substance.) అవి ప్రభావాన్ని కల్పించగలిగాయి గాని అధికారాన్ని ఇవ్వలేక పోయాయి. (granted influence & not power) ఈ సంస్కరణలు ఒక వర్గం వారిని (ముస్లిములకి) బుజ్జగించటానికి చేసి అలా వేరుగా అధికారాన్ని వేరే వర్గం వారికి బదలాయించాయి. ఈ సంస్కరణలు కార్యనిర్వాహక వర్గం శాసనసభలు పరస్పరం ఘర్షణ పడే సందర్భాన్ని సృష్టించినాయి. ఫలితంగా బ్రిటిష్ ప్రభుత్వమూ భారత జాతి పరస్పర వ్యతిరేకుల్లా మెలిగే వాతావరణం ఏర్పడింది.

(1) ఈ సంస్కరణలు ప్రజాస్వామ్య సూత్రమైన

ఎన్నిక సూత్రాన్ని అవలంబించాయి. దానితోపాటే

ప్రజాస్వామ్య వ్యతిరేకమైన మత ప్రాతినిధ్యాన్ని కలిపారు.

ప్రాతినిధ్యంలో

(2) అధికార సభ్యులు మెజారిటీని ఉంచుకొన్నారు. అయితే

ఎన్నికయిన సభ్యులు మాత్రం మైనారిటీలు గానే మిగిలారు.

(3) కౌన్సిల్ లో సభ్యుల్ని పెంచారు. కానీ ఈ కౌన్సిల్

అర్థం పార్లమెంటరీ వ్యవస్థ ను ప్రవేశపెట్టే ఉద్దేశం మాత్ర

మాత్రం కాదని చెప్పారు. (4) ఇండియా కౌన్సిలు నందు

గవర్నరు జనరల్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు నందు భారతీయులకు

ప్రవేశం కల్పించారు, వాస్తవాధికారం మాత్రం

పూర్తిగా ఆంగ్లేయుల చేతుల్లోనే కేంద్రీకరించబడి

ఉంది.

అయినప్పటికీ చాలా విధాలుగా ఈ 1909

సంస్కరణలు 1892 చట్టం కంటే మిన్నయని చెప్పాలి.

అయితే వీటిని కూడా మత ప్రాతిపదికం కల్పించి

విషయం మాత్రం చాలా వెనకడుగు,

బాధాకరమైన విషయం.

— H.C.E. Zacharias

## కాంగ్రెసు వైఖరి:

- మద్రాసులో 1908 సమావేశం లో అప్పటికి మితవాదుల ప్రాబల్యం లో ఉన్న కాంగ్రెసు సంస్కరణల్ని కొంతమేరకు ఆనందం తో ఆహ్వానించింది. లార్డు మోర్లే ప్రవేశపెట్టిన సంస్కరణల రూపొందించడం పట్ల లోతైన, నిండారైన సంతృప్తిని కాంగ్రెసు వ్యక్తీకరించింది. ఈ సంస్కరణలు చేస్తున్నందుకు లార్డు మోర్లే కు, మింటో కు కాంగ్రెసు తన మిక్కిలి విధేయతను, ఘనమైన కృతజ్ఞతను ప్రకటించింది.

- అయితే మితవాదుల ఆనందం తాత్కాలికమైంది అయ్యింది. 1909 డిసెంబరు లో లాహోరు సమావేశంలో మదనమోహన మాలవ్యా కాంగ్రెసు ప్రెసిడెంటు హోదాలో కాంగ్రెసు వైఖరి మార్పును దర్పణం పట్టారు. మైనారిటీలు మెజారిటీలను ఒక మూలకి తోసివేసేలా చేసి ఉన్నారు. పంజాబు, తూర్పు బెంగాలు, బొంబాయి లాంటి ప్రాంతాల్లో హిందువులు తీవ్ర నిక్షేపానికి గురయ్యారన్నారు.

  కాంగ్రెసు వైఖరి లో ఈ మార్పుకి లాహోరు సమావేశం కి నాలుగు వారాల ముందు విడుదల చేసిన నిబంధనలే కారణం. ఈ నిబంధనలు

- ఒక మతం వారికి సంబద్ధమైన రీతిలో వారి కూర్పు కి మించి ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించేలా ఉన్నాయి.
- నియోజకవర్గాలు, ఓటర్లు, అభ్యర్థుల అర్హతలు విషయంలో ముస్లింలకు అనుకూలంగా ఉపయోగకరంగా

1.7.03

# 1919 చట్టం చేయడానికి దారి తీసిన పరిస్థితులు

1) 1916 నాటికల్లా భారతలోనూ ఇంగ్లండులోనూ అన్ని వర్గాల వారూ భారత ప్రభుత్వ నిర్మాణంలో కొన్ని మార్పులు అవసరమని భావించడం మొదలు పెట్టారు. దీనికి మొదటి ప్రపంచయుద్ధం సృష్టించిన పరిస్థితులు చాలా వరకు కారణమని చెప్పవచ్చు. యుద్ధం వల్ల మన దేశానికి ఎటువంటి లాభమూ లేకపోయినా అసలు ఏ సంబంధమూ లేక పోయినా ఇంగ్లండు వలస దేశంగా మన దేశం సహజంగానే యుద్ధంలో పాల్గొంది. యుద్ధానికి కావాల్సిన మానవ, ధన, వస్తు సాధనాలు అందించింది. యుద్ధంలో / కీలక సమయంలో అందించిన సాయానికి గాను (ఆ) సాయం వల్ల భారతీయుల ఆశలు కూడా ఎక్కువ అయ్యాయి. పాలకులకి సాయం చేసినందుకు ఏదో ప్రతిఫలం ఆశించడం కాదిది. నిజానికి యుద్ధంలో విదేశీ సైనికుల తో సమానంగా పోరాడడం వలన మనవాళ్ళలో నూతన ఆత్మ-విశ్వాసం జనించింది. భారతీయులు తమను తామే పరిపాలించుకోగల తమ సామర్థ్యానికి గుర్తింపు ను కోరుకోవడం గా దీన్ని చెప్పవచ్చు.

భారతీయుల ఈ ఆశయాలు యుద్ధం సమయంలో పొడసూపిన భావజాలం

ద్వారా మరింత బలపడ్డాయి. అమెరికా ప్రెసిడెంటు ఉడ్రోవిల్సన్ (యుద్ధం ప్రపంచంలో ప్రజాస్వామ్యాన్ని) యుద్ధం చేస్తున్నది ప్రపంచంలో ప్రజాస్వామ్యానికి భద్రత ఉండేలా చేయడానికని చెప్పారు. దాంతో భారతదేశానికి కూడా స్వయం-పాలన బాట పైన నమ్మ పెట్టాలన్న ఆశ జనించింది.

2) 1909 చట్టం ముస్లిములను శాశ్వత మద్దతు దార్లుగా చేయలేకపోయింది. ఈ చట్టం తర్వాత వారిద్దరి మధ్య దూరం పెరిగిపోయింది. 1911 లో బెంగాలు విభజన రద్దు ముస్లింలను అసంతృప్తి చేసింది. 1912 లో లార్డ్ హార్డింజ్ ప్రభుత్వం ఆలీఘర్ విశ్వవిద్యాలయ స్థాపన కి సంబంధించిన ప్రతిపాదనను తిరస్కరించింది. 1913 1913 లో కాన్పూరు లో మసీదు నిర్మాణ వేదిక ని కూలగొట్టడం లో కల్లోలాలు జరిగాయి. భారతదేశానికి వెలుపల ఇంగ్లాండు ట్రిపోలియన్, బాల్కన్ యుద్ధాల్లో టర్కీ కి సాయం చేయడానికి నిరాకరించింది. క్రమంగా లిబరల్ నాయకులైన మహమ్మదలీ, షౌకత్ అలీ

స్వీయము ను కూడా తయారుచేశారు.

5) ఇంగ్లాండ్ లో ప్రముఖులు అయిన లియోనెల్ కర్టిస్ విలియమ్ డ్యూక్ మొ॥ వారు తమంతలు లాంటి 'రౌండ్ టేబుల్' గా ఏర్పడి భారత ప్రభుత్వ నిర్మాణ సంస్కరణలను గూర్చి చర్చించారు. శాసన సభల్లో ఎన్నికైన సభ్యుల కి మెజారిటీ కల్పించి వారికి ఏ విధమైన బాధ్యతలు ఇవ్వకపోతే ఆ సభల్లో శాశ్వత ప్రతిపక్షం (permanent opposition) సృష్టిస్తుందని భావించి వీరు ద్వంద్వపాలన ను ప్రతిపాదించారు.

6) 'ఏదో ఒక రోజున మళ్ళీ భారతదేశం నుంచి పారద్రోలగలమని అద్భుతమైన కలలుకనేవారి' గా మోర్లే చే అభివర్ణించబడిన ఉగ్రవాదులు కూడా రాజకీయంగా చైతన్యవంతంగా ఉన్నారు. దేశం లోపల వెలుపల ఏర్పడిన సంస్థల ద్వారా తమ కార్యక్రమాల్ని కొనసాగిస్తూనే ఉన్నారు. పంజాబు లో గదర ఉద్యమం, బెంగాల్ లో కొమగటుమారు ఓడ సంఘటన మొ॥ నాటి ఉగ్రవాద కార్యకలాపాలకి కొన్ని ఉదాహరణలు మాత్రమే.

7) 1909 చట్టం ద్వారా చేసిన సంస్కరణల పట్ల ప్రజాగ్రహం తీవ్రంగా పెల్లుబుకుతుంది. దాన్ని అణచి వేసేందుకు ప్రభుత్వం ఇండియన్ ప్రెస్ యాక్ట్, 1910 ; సెడిషియస్ మీటింగ్ యాక్ట్, 1911 ; క్రిమినల్ లా సవరణ చట్టం 1913 ; మొ॥ లని చేసింది. ముఖ్యంగా 1915 లో డిఫెన్స్ ఆఫ్ ఇండియా చట్టం ద్వారా అప్పీలు లేకుండా ఉద్యమకారుల్ని విచారించేందుకు, అనుమానితుల్ని నిర్బంధించేందుకు ప్రభుత్వానికి అధికారం కలిగింది. ఇది తీవ్రంగా గర్హించబడింది.

8) ఇలాంటి పరిస్థితుల్లో రాజకీయ సంస్కరణల్ని ఇంకెంతో కాలం వాయిదా వేయలేరు. ఈ కాలంలో వెల్లువెత్తిన భారతీయుల చైతన్యానికి సాక్ష్యంగా భారతీయులు తమంతటతాము వివిధ సంస్కరణ స్కీములను ప్రభుత్వ పరిశీలనకై తయారుచేయడాన్ని పేర్కొనవచ్చు. ఈ విధంగా ప్రవేశపెట్టిన వారిలో కేంద్ర శాసన సభ సభ్యులు 19 మంది ఉన్నారు. వారిలో జిన్నా, (శ్రీనివాస శాస్త్రి), సురేంద్రనాథ బెనర్జీ మొ॥ వారు ప్రముఖులు.

భారతదేశంలోని రాజకీయ ఒత్తిడిని ఎదుర్కొనేందుకు భారతీయుల మద్దతు సంపాదించేందుకు సాధనంగా ఈ సంస్కరణలను ప్రవేశపెట్టారు.

2-7-03



# 1919 చట్టంలోని ముఖ్యాంశాలు

ఇంగ్లండు లేదా హోం ప్రభుత్వంలో వచ్చిన మార్పులు:-

1) 1793 నుండి సాగుతున్న ఆచారం, భారత వ్యవహారాల మంత్రికి భారత ప్రభుత్వం జీతాలివ్వడం ఇక పై జరగదు. అతని జీతములు ఆంగ్ల ప్రభుత్వమే భరిస్తుంది.

2) భా. వ్య. మంత్రి నుండి కొన్ని విధులను తీసివేసి వాటిని భారత ప్రభుత్వం చే నియమించబడి, భా. ప్ర. నుండి జీతాలు అందుకొనే భారత హైకమీషనరు కు అప్పగించారు. ఇతడు ఇంగ్లాండులో గవర్నరు జనరలు ఏజెంటు గా వ్యవహరించేవాడు. ఇతడు స్టోర్స్ డిపార్టుమెంటు, భారత విద్యార్థుల డిపార్టుమెంటు మొ|| వాటికి బాధ్యత వహించేవాడు.

3) భారత ప్రావిన్సుల విషయాలలో భా. వ్య. మం. అధికారం ట్రాన్స్‌ఫర్డు విషయాలకు సంబంధించినంత వరకు తగ్గించివేయబడింది. కేవలం కేంద్ర విషయాల్లో మాత్రం మునుపటిలాగానే అతని పూర్తి అధికారం కొనసాగుతుంది.

1916 లో కాంగ్రెస్ 'భారతదేశం ఢిల్లీ, సిమ్లాల నుండి పాలించబడాలే గాని వైట్‌హాలు, డౌనింగ్ స్ట్రీట్ ల నుండి కాదు' అని తీర్మానం

## కేంద్ర జాబితాలోని విషయాలు

గవర్నరు జనరలు తీరుతని కౌన్సిలు నిర్వహిస్తుంది. ఈ విషయాలు జాతీయ ప్రాధాన్యం గలిగి ఒకటి కంటే ఎక్కువ ప్రాంతీస్సులకు సంబంధించినవి అయి ఉంటాయి. అందులో విదేశీ వ్యవహారాలు, భద్రత-రక్షణ, రాజకీయ సంబంధాలు, (పోస్ట్) తంతి-తపాలా, ప్రభుత్వ ఋణాలు, సమాచారవ్యవస్థ, సివిల్ మరియు క్రిమినల్ లా మరియు ప్రాసీజరు మొ॥. కేంద్ర జాబితా లో చెప్పబడినవి.

ప్రొవిన్షియల్ స్థాయిలో చెప్పబడిన ప్రజారోగ్యం, స్థానిక స్వపరిపాలన, విద్య, ఆరోగ్య పాలన, భూమిశిస్తు పాలన, నీటి సరఫరా, కరువు ఉపశమనం, శాంతి భద్రతలు, వ్యవసాయం మొ॥ రాష్ట్ర జాబితా లో ఉన్నాయి. రాష్ట్ర (లో) ప్రావిన్షియల్ జాబితాలో ప్రత్యేకించి చెప్పని అంశమేదయినా అది కేంద్ర జాబితాలోకి కూడా గవర్నరు జనరలుకే చెందుతుంది. కూడా అవశిష్టాధికారాలు గవర్నరు జనరలువే.

### కార్యనిర్వాహక వర్గం లోని మార్పులపై వ్యాఖ్య:

① గవర్నరు జనరలు ఎక్సిక్యూటివ్ కౌన్సిలు నందు భారతీయుల సంఖ్య పెంచినప్పటికీ వారికి కేటాయించిన శాఖలు ప్రాధాన్యం లేనివి.

ఈ చట్టం "భారత శాసనసభ అధికారాలకు లోబడి" ఉండేట్లుగా నిర్ణయించింది. వాటిలో అప్పుచేయడం, స్థానిక సంస్థల యొక్క పన్ను విధింపు (ఋణ) అధికారాలు, నీటిపారుదల - సరఫరా , పరిశ్రమల విషయాలు ఫాక్టరీలలో పనులు , (ఎలెక్ట్రిసిటీ) విద్యుచ్ఛక్తి మొ|| ముఖ్యమైనవి.

ప్రధాన కార్యనిర్వాహక అధికారం ఇంకా గవర్నరు-జనరలు చేతిలోనే ఉంది. ఇతడు ఆంగ్ల పార్లమెంటుకు ప్రతినిధి, భారత వ్య. మంత్రి తో సదా సంబంధాలు కలిగి ఉంటాడు. ఇతడు తన కౌన్సిలర్ల మీద పూర్తి నియంత్రణ కలిగి దేశానికి సంబంధించి విస్తృత అధికారాలు అనుభవించాడు. ఈ విధంగా (6) గవర్నరు జనరలు నియామకం, అధికారాలు, విధుల విషయంలో దేశ ప్రజల అభిప్రాయం పూర్తిగా విస్మరించబడింది.

శాసన శాఖ లో మార్పులు :-

కొత్త చట్టం ఒకే సభ ఉండే ఇంపీరియల్ కౌన్సిల్ స్థానంలో "ద్విసభా శాసనసభ" ని ప్రవేశపెట్టింది. అవి

Bicameralism

'కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్' మరియు 'సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ' గా పిలువబడ్డాయి.

ఎగువ సభ అయిన కౌన్సిల్ ఆఫ్ స్టేట్ నందు 60 మంది సభ్యులుంటారు. వారిలో 26 మందిని గవర్నరు జనరలు నియమిస్తాడు. మిగిలిన 34 మంది ఎన్నుకోబడతారు, ఇలా ఎన్నికయిన వారి మెజారిటీ విస్తరించటం జరిగింది. 26 మంది నియమితుల్లో 20 మంది అధికారులు 6 గురు అనధికార సభ్యులు. 34 మందిలో 20 మంది జనరల్ నియోజకవర్గాల ద్వారా 10 మంది ముస్లింల ద్వారా) ముగ్గురు 3 యూరోపియన్ల (ద్వారా) తక్కిన ఒక్కరు సిక్కుల నియోజకవర్గాల ద్వారా ఎన్నుకోబడతారు.



కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు ప్రతి సంవత్సరం పాక్షికంగా పునర్వ్యవస్థీకరించబడుతుంది. ఇందులో సభ్యులకు 5 సం॥ పదవీ కాలం ఉంటుంది. దీని ప్రెసిడెంటును రాజప్రతినిధి నియమిస్తాడు. ఇందలి సభ్యులని "Honourable" అని పిలుస్తారు. స్త్రీలకు ఇందులో సభ్యత్వము పొందే అవకాశాలు లేవు. గవర్నర్ జనరలు కు ఈ సభని ఉద్దేశించి మాట్లాడేందుకు, దాన్ని సమావేశపర్చేందుకు, నిరవధికంగా వాయిదా (prorogue) వేసేందుకు, లేదా సభని రద్దు (dissolve) చేయడానికి అధికారం ఉంది.

ఈ సభ కోసం ఓటుహక్కు చాలా పరిమితంగా ఉండేది. సంవత్సరానికి పదివేల ఆదాయం మీద ఆదాయపు పన్ను చెల్లించేవారో లేదా కొంతలు రూ. 750 పైన భూమిశిస్తు చెల్లించేవారో అయి ఉండాలి. దీనికి లేదు వారు విశ్వవిద్యాలయాల సెనేటు సభ్యులో, బయటి వారో, శాసన సభల్లో అనుభవం ఉన్నవారో గ్రాడ్యుయేట్లు సంబంధాలు ఉండేవి. దీంతో 1920 నాటికి 24 కోట్ల దేశ జనాభా లో 17,364 మంది మాత్రమే ఓటు హక్కుకు కావాల్సిన అర్హతలు కలిగి ఉన్నారు.

17 వేలు
24 కోట్లు

## దిగువ సభ అయిన లెజిస్లేటివ్

అసెంబ్లీ నందు మొత్తం 145 మంది సభ్యులు. వీరిలో 41 మంది నియమింపబడగా 104 మంది ఎన్నుకోబడతారు. ఈ 41 మందిలో 26 గురు అధికారసభ్యులు కాగా 15 మంది అనధికారసభ్యులు. ఇక ఎన్నికైన 104 మందిలో 52 మంది జనరల్; 32 మంది మతల [30 మంది ముస్లిం + ఇద్దరు సిక్కు]; మిగిలిన 20 మంది ప్రత్యేక [7 గురు భూస్వాములు 9 మంది యూరోపియన్లు 4 గురు భారతీయ వ్యాపార వర్గాలు] నియోజకవర్గాల వారిచే ఎన్నుకోబడుతారు.



కొన్నిటి మీద శాసనసభ ఓటు చేయవచ్చు, కొన్నిటిని కేవలం చర్చించవచ్చు, ఇంకొన్ని కనీసం చర్చించడం కూడా చేయలేరు.

కేంద్రం లో వచ్చిన మార్పుల మీద విశ్లేషణ :

1919 చట్టం "కేంద్రంలో" ప్రవేశ పెట్టింది (1) responsive ప్రభుత్వమే గానీ responsible ప్రభుత్వం కాదని చెప్పేమాట వాస్తవమే. శాసన సభ కి అభిప్రాయ ప్రకటనం చేసే వారికి వేదికవడం వలన గవర్నర్ జనరలు లెజిస్లేటివ్ సభ్యులు లేవనెత్తే దానికి విలువ ఇచ్చేవారిని. అయితే దీని అర్థం ఈ సభ్యులు శాసనసభ కి బాధ్యులై తొలగించబడవచ్చని కాదు, నిజానికి వీరు శాసనసభ కోరికలకి స్పందించడమే గాక దాని ద్వారా ప్రజల కోరికలని కూడా స్పందించేవారు.

కొంతమంది శాసనసభ్యులని ప్రభుత్వ (2) శాసనాల సంఘం, ఆర్థిక సంఘం వంటి స్టాండింగ్ కమిటీల సభ్యులుగా నియమించడం వలన వారికి ప్రభుత్వ విధానాల్ని ప్రభావితం చేసేందుకు

## ప్రావిన్షియల్ ప్రభుత్వాలు - ద్వంద్వ పాలన

### కార్యనిర్వాహక వర్గం లో మార్పులు :-

1919 చట్టం చేసిన మార్పుల్లో అతి ప్రధానమైనది ప్రావిన్సుల్లో చేసిన మార్పులే. మాంటెగ్‌ఫర్డ్ నివేదిక లో "బాధ్యతాయుత ప్రభుత్వ అభ్యుదయ పథం లో నడిపేందుకు ప్రావిన్సులే సరైన వేదికలు." కొంత బాధ్యతను ఒక్కసారి గా ఇచ్చి పరిస్థితులనుపరిశీలించినప్పుడు పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచాలి. అందుగాను ప్రావిన్సులకు ~~కొన్ని~~, పాలన అంశాల్లో చాలా [illegible] స్వాతంత్ర్యం ; కేంద్ర నియంత్రణ నుంచి దాని బాధ్యతలు అది నెరవేర్చుకునేందుకు కావాల్సినంత స్వాతంత్ర్యం ఇవ్వడం అవసరమౌతుంది," అని ఉన్నది. 1919 చట్టం పీఠిక లో ఇదే సూత్రం పునరుద్ఘాటించబడింది. ~~ఈ~~ సూత్రాన్ని ప్రతిఫలింపజేసేందుకు గాను చట్టం ప్రావిన్సుల్లో ద్వంద్వపాలన ను ప్రవేశపెట్టింది.

దీనికింద ప్రావిన్షియల్ (ప్రభుత్వ) విషయాల్ని 2 గా విభజించారు.

రిజర్వుడు అంశాలు :- వీటిని గవర్నరు అతనిచే నియమించ బడిన (కార్యనిర్వాహక సంఘం) ఎక్జిక్యూటివ్ కౌన్సిలు సభ్యుల సహకారంతో పాలిస్తాడు. వీరు శాసనసభకు బాధ్యత వహించరు. ఈ రిజర్వుడు శాఖలపై గవర్నరు జనరలు మరియు భారతవ్యవహారాల మంత్రి యొక్క దర్శకత్వం, నియంత్రణ, పర్యవేక్షణ ఉంటాయి. రిజర్వుడు విషయాల్లో ముఖ్యమైనవి భూమిశిస్తు, కరువు నివారణ ఉపశమనం, న్యాయ, పోలీసు, పింఛను, క్రిమినల్ తెగలు, ముద్రణా యంత్రాలు, "నీటిపారుదల", జలమార్గాలు, గనులు, ఫ్యాక్టరీలు, విద్యుత్తు, గ్యాస్, కార్మిక సంక్షేమం, పారిశ్రామిక తగాదాలు, వాహనాలు, చిన్న రేవులు, ప్రభుత్వ సర్వీసులు మొ||.

ట్రాన్స్ఫర్డ్ శాఖలు : వీటిని గవర్నరు మంత్రుల సాయంతో పాలించేవాడు. శాసనసభలో ఎన్నికైన సభ్యుల్లో కొందర్ని గవర్నరు మంత్రులుగా నియమించేవాడు. వీరు శాసనసభకు బాధ్యత కలిగి ఉంటారు. (They were to hold office during the pleasure of the Governor)

భారతీయ వ్యవహారాల మంత్రి) - కొన్ని ; గవర్నరు జనరల్

లేదా కొన్ని ఈ ట్రాన్స్‌ఫర్డ్ విషయాల్లో జోక్యం చేసుకునే

హక్కుని చాలావరకు తగ్గించివేశారు.

గవర్నరు కి మంత్రులు సలహాలు ఇచ్చే ఈ ట్రాన్స్‌ఫర్డ్ విషయాల్లో ముఖ్యమైనవి గా విద్య (యూరోపియన్, ఆంగ్లో-ఇండియన్ల విద్య కాకుండా) వైద్యశాలలు, స్థానిక స్వపరిపాలన, ప్రజా సదుపాయాలు, ప్రజారోగ్యం, "వ్యవసాయం", సహకార సంస్థలు, మత్స్యపరిశ్రమ, పబ్లిక్ వర్క్స్, ఎక్సైజ్, పరిశ్రమలు, తూనికలు - కొలతలు, మత (మఠాలు) విషయాలు మొ||. చట్టం ప్రకారం ఈ ట్రాన్స్‌ఫర్డ్ శాఖల గురించి నిర్ణయాలు తీసుకునేటప్పుడు మంత్రులందరూ కలిసి సమావేశం కావాల్సిన అవసరం లేదు. గవర్నరు ప్రతి మంత్రి తో విడివిడిగానే వ్యవహరించేవాడు.

~~ఉమ్మడి~~ రిజర్వుడు, ట్రాన్స్‌ఫర్డ్ విషయాల్లో సామాన్యంగా ఉన్న శాఖలు ముఖ్యంగా రెవెన్యూ కేటాయింపుల విషయంలో రిజర్వుడు, ట్రాన్స్‌ఫర్డ్ శాఖల మధ్య ఉమ్మడి పరిశీలన జరిగేది. ఈ ఉమ్మడి సమావేశాలకి గవర్నరు అధ్యక్షుడు,

చివరి నిర్ణయం కూడా అతని చేతుల్లోనే ఉండేది.

## శాసనశాఖ లో వచ్చిన మార్పులు :-

ఈ చట్టం ద్వారా ప్రావిన్సుల చట్టసభల్లో లేదా లెజిస్లేటివ్ కౌన్సిళ్ళ లో కూడా మార్పులు చోటు చేసుకున్నాయి. వాటి సభ్యుల సంఖ్య పెంచబడింది, అయితే మొత్తం సభ్యుల సంఖ్య ప్రావిన్సు కి ప్రావిన్సు కి మారుతూ ఉంటుంది. ఈ ప్రావిన్షియల్ కౌన్సిలులలో మొత్తం సభ్యుల్లో 70% మంది ఎన్నుకోబడాలి. అధికారుల సంఖ్య 20% ని కి మించరాదు. మిగిలిన వారు నియమితులైన అనధికార సభ్యులు.

ప్రావిన్షియల్ కౌన్సిలు కి "ప్రత్యక్ష ఎన్నికల" పద్ధతి ని ప్రారంభించారు. ప్రాథమిక ఓటర్లే సభ్యుల్ని ఎన్నుకుంటారు! అయితే మత, వర్గ నియోజకవర్గాలు, కొన్ని మతాల వారికి ప్రత్యేక ప్రాధాన్యతలు; ఓటుహక్కు కులం అధిక ధనం అర్హతగా ఉండడం మొ॥ ఎన్నికలకి సంబంధించిన చెడుగులు మాత్రం తొలగించబడలేదు.

## ప్రావిన్షియల్ కౌన్సిలు అధికారాలు :-

వీటి అధికారాలు కూడా పెంచబడ్డాయి. సభ్యులకి వాక్స్వాతంత్ర్యం ఉంది. ప్రశ్నలు, అనుబంధ ప్రశ్నలు అడగడానికి, తీర్మానాలు చేయడానికి,

ప్రొవిన్షియల్ విషయాలకు సంబంధించి కమూలాన్ని ప్రకారం చట్టేందుకు లేదా కమూలు చేయడానికి చారణ తొలగించేందుకు అధికారం ఉంది. అయితే శాసనసభ ఆమోదం పొందిన బిల్లులు గవర్నర్ ఆమోదం లేనిదే చట్టాలు కావు. సభ్యులు బిల్లుల ను వ్యతిరేకించే అధికారం ఉంది. అయితే అవసరమనిపిస్తే దాన్ని తిరిగి బిల్లు లా పెట్టే అధికారం గవర్నర్ కు ఉంది.

## ప్రొవిన్షియల్ ప్రభుత్వం లోని మార్పులపై ఒక పరిశీలన :- (1921-37)

ప్రొవిన్సుల్లో 1921 April 1 న ప్రవేశపెట్టిన ద్వంద్వ పాలన 1937 ఏప్రిల్ వరకు పనిచేసింది. అయితే బెంగాల్, సెంట్రల్ ప్రావిన్సుల్లో మాత్రం మధ్య కాలంలో పనిచేయలేదు. ఈ కాలం లో రెండు లోటుపాట్లు బాగా వెలుగుచూశాయి.

1) పాలనా విషయాలు రెండు సెక్షన్లు విభాగాలుగా విభజించబడినప్పటికీ రాజకీయ సిద్ధాంతాలు 8

ప్రభుత్వ ఆచరణ కు విరుద్ధమైనది. ఇటు మంత్రిగారి ఇటు ఎక్జిక్యూటివ్ కౌన్సిలరు గారి ఒకరితో ఒకరు సంబంధం లేకుండా పనిచేస్తుండడం కుదరదు, కాబట్టి ఈ విభజన అసంబద్ధం, అశాస్త్రీయం. ప్రవాసాంధ్రుల ట్రాన్స్‌ఫర్డు శాఖగా ఉండి నిలుపుదలకు రిజర్వుడు గా ఉండడం ఎలాంటి హాస్యాస్పద విషయమో!

2) ఈ రెండు విభాగాల లక్ష్యంలో ఆచరణలో పొసగిక సాధ్యం కాలేదు. ఉదాహరణకు సిక్కు గురుద్వారాల విషయంలో తలెత్తిన చిక్కు బరిచేటప్పుడు శాంతిభద్రతలను పర్యవేక్షించే ఎక్జిక్యూటివ్ కౌన్సిలరు (అది రిజర్వుడు శాఖ కాబట్టి) ఆ సందర్భాన్ని ఎదుర్కొనేటప్పుడు ఇంకా కొన్ని తీసుకురావాల్సి ఉంటుంది. అయితే అలా వారి చేయలేరు. ఎందుకంటే అలాంటి చట్టాల్లో చట్టాలు చేసే అధికారం (శా) శాసనాలు (ప్రవేశపెట్టే అధికారం కేవలం (religious endowments) మత సంస్థలు-వ్యవహారాల మంత్రి కే ఉంది (ఎందుకంటే ఇది ట్రాన్స్‌ఫర్డు శాఖ కాబట్టి.)

3) కొన్ని సార్లు చాలా గందరగోళ స్థితి నెలకొని అధికారులు ఒక విషయం ఏ శాఖ కి చెందిందో కూడా నిర్ణయించలేక పోయేవారు. ఉదాహరణకు

C.Y. చింతామణి తన అనుభవాన్ని చెబుతూ... 1921 లో
ప్రావిన్సియల్ స్థాయిలో భారతీయులకు చిన్న చిన్నవిగా
చేసే విషయాన్ని విడిగా విడిగా చేయటం
మొదలు పెట్టారు. మరుసటి సంవత్సరం నివేదిక
సమర్పించగా ఆ విషయం రెవెన్యూ శాఖ చూడాల్సిందని
అనుకున్నారు. దాంతో రెండేళ్ల పాటు ఈ విషయాన్ని రెవెన్యూ
ఆ శాఖ పరిశీలించింది. రెండేళ్ల చివర్లో అసలు
విషయం లెజిస్లేటివ్ శాఖ వారిదని తేల్చారు.

4) ఈ రెండు విభాగాల మధ్య తరచూ విభేదాలు
తలెత్తుతూ ఉండేవి. మంత్రులు ప్రజాప్రతినిధులు
కాగా ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లు ఉద్యోగస్వామ్య భాగస్వాములు.
దాంతో వారి మధ్య ఘర్షణ ఉత్పన్నమైంది. కొన్నిసార్లు
వారిరువురూ ఒకరినొకరు బహిరంగంగానే నిందించుకునేవారు.
ఒక నియమం లాగా గవర్నరు ప్రతిసారి తన ఎగ్జిక్యూటివ్
కౌన్సిలు సభ్యుల్నే సమర్థించేవాడు.

5) మంత్రుల పరిస్థితి మరో విధంగా కూడా బలహీనంగా
ఉండేది. మంత్రులకు అటు గవర్నరు ఇటు
లెజిస్లేటివ్ కౌన్సిలు ఇద్దరు యజమానులు
ఉండేవారు. మంత్రులను గవర్నరే నియమించేవాడు.

గవర్నరు తన ఇష్టప్రకారం మంత్రుల్ని తొలగించవచ్చు. మంత్రులు తమ శాఖల పాలనకి సంబంధించి శాసనసభ కి బాధ్యులు వహించాలి. శాసనసభ కనుక అతని కి వ్యతిరేకంగా అవిశ్వాస తీర్మానం చేస్తే అతడు/మంత్రి తన పదవి కోల్పోతాడు. ఆచరణాత్మక రాజకీయాల్లో మంత్రులు శాసనసభల కంటే గవర్నరు కే ఎక్కువ జాగ్రత్త వహించి ఉండేవారు. ప్రావిన్షియల్ శాసనసభల్లో బలమైన రాజకీయపక్షాలేవీ లేవు. దానితో ఏ మంత్రికీ సరైన మద్దతు ఉండేది కాదు. వారు తమ మద్దతు కోసం సభలో అధికారపక్షాలపై ఆధారపడాల్సి ఉండేది. గవర్నరు తన పట్ల సుముఖంగా ఉంటేనే మంత్రులకి వారి మద్దతు లభించేది కాదు. అందువల్ల మంత్రులు సదా గవర్నరు విధేయులై ఉండడం లో ఆశ్చర్యం లేదు! నిజానికి మంత్రులు ఉద్యోగం / ఉద్యమం పొందిన గవర్నరు కార్యదర్శుల్లా ఉండేవారు. గవర్నరు పిలుపు కోసం ఎదురుచూస్తూ

6) గవర్నర్లు మంత్రుల్లో సమిష్టి బాధ్యతా నియమాన్ని పెంపొందించలేదు. మంత్రులు ఎప్పుడూ కూడా ఒక సమిష్టి (team) వర్గం గా పనిచేయలేదు. వారెప్పుడూ ఒకరితో ఒకరు పోట్లాడుకునేవారు. 1928 లో ఫెరోజ్ ఖాన్ నూన్, ఒక పంజాబు మంత్రి బహిరంగంగా తన హిందూ సహచరుల చర్యని విమర్శించాడు, నిందించాడు.

7) ముఖ్యమైన విషయాల్లో కేవలం సమర్థులే మంత్రులతో కనీసం సంప్రదించేవారు కూడా కాదు. ఉదాహరణకు గాంధీజీ అరెస్టును చెప్పవచ్చు. సహాయనిరాకరణ ఉద్యమానికి ప్రతీకారంగా కొరడావేత విధానాన్ని నిర్దేశించడం, అమలులో పెట్టడం మంత్రులతో సంబంధం లేకుండానే ప్రభుత్వం చేసేసింది. మంత్రులకు కనీసం ప్రభుత్వం వాస్తవంగా ఏం చేయాలనుకుంటుందో కూడా తెలియదు. సి.ఆర్.దాస్ మాటల్లో

"మంత్రులు కేవలం మూగ ప్రేక్షకులు, లేదంటే వారు మాట్లాడలేరు, ఏమీ చెప్పలేరు."

8) మంత్రులకు కనీసం తమ శాఖల సర్వీసులపై కూడా నియంత్రణ లేదు. (ఆనాటి సెక్రెటరీ) కార్యదర్శి నేరుగా గవర్నర్ తో మాట్లాడేవాడు, దానితో మంత్రి అభిప్రాయం కన్నా కార్యదర్శి అభిప్రాయానికి ప్రాధాన్యత ఎక్కువగా ఉండేది. ఎప్పుడైనా మంత్రికి

అతని శాఖలోని కార్యదర్శి కి మధ్యగాని ; మంత్రి కి వేరైనా డివిజను కమీషనరు కి ; మంత్రి కి డిపార్టుమెంటు అధిపతి కి మధ్య వివాదాలు తలెత్తినప్పుడు దాన్ని తప్పక గవర్నరుకు నివేదించాలి, ఈ గవర్నరు ఎప్పుడూ అధికార్లనే సమర్థించేవాడు. పి. ఎస్. మసలదన్ ప్రకారంగా

"మంత్రులు ఏర్పరిచిన విధానాలని (policies) అమలు చేసే బాధ్యత వారి కింద ఉన్న సర్వీసులకి వదిలేసేవారు, అయితే ఈ సర్వీసుల మీద మంత్రులకెట్టి నియంత్రణా ఉండేది కాదు. మంత్రులకి బాధ్యత ఉండేది కాని దానికి తగ్గ అధికారం మాత్రం ఉండేది కాదు."

9) అఖిల భారత సర్వీసుల ఉద్యోగుల నియామకం, జీతాలు, పెన్షన్, అలవెన్సులు, బదిలీలు మొ॥ భారత వ్యవహారాల మంత్రి నియంత్రణలో ఉండేవి. ఈ ఉద్యోగులు ట్రాన్స్‌ఫర్డ్ శాఖల్లో పని చేస్తున్న వారు భా. వ్య. మం. నియంత్రణ కిందే ఉండేవారు. దాంతో వారు మంత్రుల్ని లెక్క చేసేవారు కాదు. వారి శాఖల్లో ఖాళీలు వచ్చినప్పుడు తమకిష్టమైన వారిని తమ కింద అధికారులుగా ఎన్నుకునే స్వేచ్ఛ, అధికారం మంత్రులకి ఉండేది కాదు.

10) జాతి-నిర్మాణ కారక శాఖలన్నింటిని మంత్రుల కిచ్చారు. అయితే వాటికవసరమయిన ధనం మాత్రం ఇవ్వలేదు. దాంతో వారు ఫైనాన్సు శాఖ మీద ఆధారపడాల్సి వచ్చేది. అలాగే ఉద్యోగస్వామ్యంలో భాగం గాబట్టి ప్రజల కోరికలను ప్రాతినిధ్యం వహిస్తున్న మంత్రుల పట్ల ఏ మాత్రం సానుభూతి కలిగి ఉండేవారు కాదు. ఎల్లప్పుడూ రిజర్వుడు శాఖల అవసరాలే చూస్తూ ట్రాన్స్‌ఫర్డ్ శాఖల అవసరాలకు అడ్డుపుల్లలేస్తూ వారి పథకాలు, ప్రాజెక్టులు విఫలమయ్యేందుకు కారణమయ్యేవారు.

ద్వంద్వపాలన లో ఉన్న ఈ లోపాలే గాక వాటి పరిస్థితులు కూడా అది విఫలమవడానికి దోహదం చేశాయి.

1) ఆనాటి రాజకీయ వాతావరణం అంతా పంజాబు లోని భీకర సంఘటనల వల్ల, డయర్ పట్ల ఇంగ్లాండు ప్రవర్తన వల్ల అనుమానం తోనూ అపనమ్మకం తోనూ నిండి పోయింది.

2) 1920 లో ఋతుపవనాలు విఫలమై ప్రజల కష్టాలు మరింత పెరిగాయి.

3) మార్కెట్లో ధరలు పడిపోయాయి. కేంద్ర, రాష్ట్రాల

ఆదాయాలు తగ్గాయి.

4) మెస్టన్ అవార్డు (Meston Award) కింద ప్రావిన్సులు ఏటా భారత ప్రభుత్వానికి కొంత ధనం ఇవ్వాల్సి ఉండేది. దీంతో ఆర్థిక ఇబ్బందులలో ఉన్న ప్రావిన్సుల నుండి కేంద్రం పైసా పైసా లెక్కన రాబట్టిందంటూ వసూలు చేయడంతో ప్రావిన్సులు ఆర్థిక దుస్థితికి గురయ్యాయి.

ఈ విధంగా ఆర్థిక విపత్తు, రాజకీయంగా ప్రతికూల వాతావరణాలు కలిసి ప్రావిన్సులలో మాంటేగు & చెమ్స్‌ఫర్డ్ రాజ్యాంగ సంస్కరణల విజయానికి ఆటంకమయ్యాయి.

—o—

1919 చట్టంలో జాతీయవాదుల ప్రకారం కింది లోపాలున్నాయి.

1) కేంద్రంలో కనీసం పాక్షిక బాధ్యతాయుత ప్రభుత్వం కూడా లేకపోవడం.

2) మాంటెగు ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక ప్రత్యేక వర్గాల నియోజకవర్గాల్ని స్వయం పాలన సూత్రవృద్ధికి గొప్ప ఆటంకమని చెప్పినా ఈ చట్టం ప్రత్యేక నియోజకవర్గాల్ని స్థిరపర్చింది.

3) ప్రావిన్సుల్లో ఆరంభించిన ద్వంద్వపాలన మృదువుగా నడవడానికి వీల్లేనంత సంక్లిష్టమయ్యింది.

అయితే ఈ చట్టం చెప్పుకోదగ్గ మార్పులు సాధించింది. మొట్టమొదటి సారిగా ఈ చట్టం అతి పరిమితమైనదే అయినా కొంత అధికారబదిలీ కూడా అమలు చేసింది. Coupland మాటల్లో చెప్పాలంటే

" ఈ చట్టం శాసన - కార్యనిర్వాహక అధికారాల విభజన గీతను దాటింది. మునుపటి చర్చలు భారతీయులు వారి శాసనసభల్ని నియంత్రణ చేసేందుకు ఉద్దేశించినా ప్రస్తుతం ఇది వారి ప్రభుత్వానికి / పాలనకి వర్తిస్తుంది. ప్రస్తుతం భారతీయులు చెప్పుకోదగినంతగా సొంతంగా పాలించుకుంటున్నారు, ఎన్నికైన శాసనసభ్యులుగా ఆ చట్టసభలకు

3) కేంద్రం లో బాధ్యతాయుత పాలన ని ప్రవేశపెట్టక పోవడం. ~~అయితే~~ ఇండియన్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ను విస్తృతం చెయ్యడం, అందులో భారతీయుల ప్రాతినిధ్యం పెంచడం.

4) ప్రావిన్సుల్లో ప్రజాపాలన ఏర్పాటు చేసినా వాటిని పార్లమెంటు, భారత వ్యవహారాల మంత్రి నియంత్రణని సడలించడం.

1919 చట్టం లో ఈ (recommendations) సిఫారసుల కి చట్ట రూపం ఇవ్వడం జరిగింది.

* ద్వంద్వ పాలన వల్ల

- కేంద్ర జాబితా
  - ఆసక్తి విషయాలు + దేశం మొత్తానికి పాలనలో ఐక్యత అవసరమైనప్పుడు..
- రాష్ట్ర జాబితా
  - వివిధ ప్రావిన్సుల పాలనకు తగినట్లుగా పాలనలో వైవిధ్యాలు అవసరమైనప్పుడు..
    - రిజర్వుడు శాఖలు
    - ట్రాన్స్‌ఫర్డు శాఖలు.

గవర్నరు అధికారాలు:-

1) రిజర్వుడు అంశాల్లో సర్వాధికారి.

2) ట్రాన్స్‌ఫర్డు అంశాల్లో సైతం ఇతడు నామమాత్ర రాష్ట్రాధినేత (or) రాజ్యాంగ బద్ధ అధిపతి కాదు. అవసరమనిపిస్తే తనకు మంత్రులు ఇచ్చిన సలహాలను ఇతడు తోసిరాజనవచ్చు.

3) సంపూర్ణ వీటో అధికారం ఉన్నది

4) ప్రొవిన్షియల్ శాసనసభ తిరస్కరించిన ఏ బిల్లు అయినా గవర్నరు Power of Certification ద్వారా శాసనంగా మార్చవచ్చు.

5) ఇతడు (ordinance) ఉత్తర్వులను జారీ చేయవచ్చు.

6) శాసనసభని ఎప్పుడైనా రద్దు చేయవచ్చు లేదా దాని కాలాన్ని సంవత్సరం పాటు పొడిగించవచ్చు.

7) ప్రొవిన్సుల్లో రాజ్యాంగబద్ధ పాలన గనుక విఫలమయితే గవర్నరే మొత్తం పాలనంతా చేజిక్కించుకుని రిజర్వుడు, ట్రాన్స్‌ఫర్డు అంశాలన్నింటినీ అతడే పాలించవచ్చు.

* కేంద్రంలో గవర్నరు-జనరల్ లాగే గవర్నర్లకు మొదటిసారిగా 1919 చట్టం ద్వారానే తీర్మానాలని తిరస్కరించేందుకు, బిల్లులు సర్టిఫై చేసేందుకు, ఆర్డినెన్సులు జారీ చేసేందుకు అధికారం లభించింది.

* ఈ చట్టప్రకారం తొలి ఎన్నికలు 1920 లో జరిగాయి. ద్వంద్వపాలన మొత్తం 9 గవర్నర్ల ప్రావిన్సుల్లో 1921 నుండి 1937 వరకు నిరాఘాటంగా అమలైంది. అయితే బెంగాలులో 1924-27, సెంట్రల్ ప్రావిన్సులో 1924-26 ల మధ్య మాత్రం రద్దురాయితం ఏర్పడింది.

* ద్వంద్వపాలన బరువైన, సంక్లిష్టమైన, గందరగోళ వ్యవస్థ. అది ఏ విధమైన తార్కిక పునాది లేక రాజ్యంలో స్థిరపడి వైఫల్యాన్ని పొందవలసిన దుర్మార్గపు విధానంతో ఉంది. అయితే ఈ ప్రయోగం పూర్తిగా విఫలమైందని చెప్పలేము.

ప్రజా మంత్రిమండళ్ల లోని దృష్టి

స్థానిక సంస్థల సంస్కరణలు, విద్య, సాంఘిక సమస్యల పైకి మళ్లాయి. బీహారు-ఒరిస్సా గ్రామ పాలనా చట్టం (1922), బొంబాయి స్థానిక బోర్డుల చట్టం (1923), కలకత్తా మున్సిపల్ చట్టం (1923) బొంబాయి ప్రాథమిక విద్యా చట్టం (1923) మద్రాసు రాష్ట్ర పారిశ్రామిక సహాయ చట్టం (1923) Madras Religious Endowment Act (1926) మొ॥ వీటిలో ముఖ్యమైనవి.

ద్వంద్వ పాలన విజయాలు ఎంతో పరిమితం

మైనప్పటికీ చిరకాలంగా ఆంగ్లేయులు ప్రచారం చేసిన భావన - భారతీయులు అధికారం మీద తాము నిలబడలేరన్న ఎంత మాత్రం కాదని రుజువవుతుంది. దీనికి తోడు మన మంత్రులు (లో) భారతీయ నాయకులు మొదటిసారిగా రాజ్యాంగబద్ధ వ్యవస్థలో కొంత పాలనానుభవాన్ని పొందారు. ఈ అనుభవం మన నాయకుల్లో ఉత్సాహాన్ని, చొరవను నింపింది. మనవారి ఆత్మవిశ్వాసం పెరగటానికి దోహద పడింది.

కాంగ్రెసు ప్రతిస్పందన See another notes

Gist

కేంద్రం లో
- ద్వంద్వ సభ
- కేంద్ర, రాష్ట్ర జాబితాలు
- కేంద్ర శాసనసభలో ఎన్నికైన వారి మెజారిటీ

రాష్ట్రాలలో
- ద్వంద్వ ప్రభుత్వం
- ప్రత్యక్ష ఎన్నికలు
-

చేసేవారు.

ఇక కంపెనీలో కింది అధికారులు తమ చాలీ-చాలని జీతాలకు అనేక విధాలుగా ధనాన్ని పోగుచేసేవారు. వ్యక్తిగత వ్యాపారం, జైనలు విధించడం, పన్నులు వసూలు చేయడం; భారతీయ ప్రముఖులకు, అధిపతులకు ఇచ్చిన ఋణం మీద విపరీతంగా విధించిన వడ్డీల ద్వారా ఇలా అనేక మార్గాల్లో కింది అధికారులు ధనాన్ని సంపాదించేవారు.

ఈ విధంగా కంపెనీ ఉద్యోగులు అతి తేలిగ్గా తొందరగా సంపాదించాక సంపాదిస్తున్న విపరీతమైన ధనం మిగతా ఉద్యోగుల్లో కూడా ధనం మీద దురాశను రేకెత్తించింది. ఈ ఆకస్మికధనం ఇంగ్లాండు సమాజంలో ఈ వర్గాల వారిని ప్రభావితం చేసింది. ఇది కంపెనీ ప్రొప్రయిటర్లు తమ బంధువుల్ని, స్నేహితుల్ని ఈ లాభదాయకమైన సర్వీసుల్లో నియమించుకొనేలా పురికొల్పింది. పైగా వారు అధిక డివిడెండ్ల కోసం డిమాండు చేయడం మొదలు పెట్టారు. 1767 లో పదిశాతం ఉన్న రేటుని 1771 లో 12½% కి పెంచాలని ప్రతిపాదించారు. చివరికి భారతీయ సంపదల పట్ల ఇంగ్లాండు పార్లమెంటు సభ్యులు, మంత్రులు కూడా ఆశపడ్డం మొదలు పెట్టారు. మెల్లగా బ్రిటీషు జాతీయ ఋణాన్ని భారత్ ద్వారా తీర్చుకోవాలనే అంశాన్ని ప్రతిపాదించారు. అతికొద్ది కాలం లోనే ఈ అంశం అసాధారణంగా అందరి దృష్టి

ప్రకటించింది. ఇంగ్లాండు ఆనాటి సమాజంలో కలిసివుంది చెప్పబడుతున్న తూర్పు నిధులనే భావం కూడా వెలువడి వుంది.

క్లైవ్ బ్రిటిషు ప్రధానమంత్రి ఛాథంపిట్ కు ఒక లేఖలో బెంగాలు ఆక్రమణ ముందు కాలంలో ఈ ధనం చెల్లింపులకు వాడుకోవచ్చని రాశారు. తూర్పు దేశాలు (ప్రత్యేకించి భారత) ఆదాయాలకు మార్గాలుగా పనిచేస్తాయని వారు విశ్వసించారు. భారత ప్రభుత్వంగా రాజకీయ పాలించబడుతున్నది ధనం లోటు పూడ్చడానికి కావలసిన ధనాన్ని సమకూర్చగలదని ఒక (pamphleteer) కరపత్రదారుని అభిప్రాయం.

ఈ పరిస్థితుల ప్రభావం వలన మంత్రులు, పలు పార్లమెంటు సభ్యులు ప్రజల మద్దతు సంపాదించి భారత ఆదాయాలను కేవలం ఆంగ్ల వ్యాపార కంపెనీ లాభదాయకానికి గాక ప్రజలపై పన్నుల భారం (తగ్గించడం) తగ్గించేందుకు కూడా వినియోగించాలని అభిప్రాయం కంపెనీ ఆంగ్ల ప్రభుత్వానికి కొంత మొత్తం "కప్పం" చెల్లించాలని ఒత్తిడి తీసుకువచ్చారు.

ఫలితంగా 1767 చట్టం చేయబడి కంపెనీ ప్రతి ఏటా (ఒక) సంవత్సరానికి నాలుగులక్షల 400,000 పౌండ్ల స్టెర్లింగులను బ్రిటిష ప్రభుత్వానికి 'కప్పం' గా చెల్లించాలని నిర్ణయించబడింది.

ఈ కప్పం చెల్లించే పద్ధతి గురించి W.E.H. Lecky పండితుడు ఇలా వ్రాశాడు -

“ చార్టరు గాని శాసనం గాని అధికారం యొక్క ప్రాప్తి లేకుండానే ఆంగ్ల మంత్రులు కంపెనీ ఆదాయాన్ని ప్రాదేశిక ఆదాయం, వర్తక ఆదాయం అని విభజించారు. ప్రాదేశిక ఆదాయ విషయంలో భాగం పెడుతూ కంపెనీ నిర్బంధంగా చట్టం ప్రకారం చెల్లించాల్సిన 400,000 పౌండ్ల కంటే (సంవత్సరానికి) అధిక ధనాన్ని చెల్లించమని కంపెనీ పై ఒత్తిడి తెచ్చేవారు. కంపెనీ ఆదాయాలు ఈ విపరీత ఒత్తిడిని తట్టుకోలేకపోయేవి. కంపెనీ ఎల్లకాలం చాలినంతగా లభ్యమయ్యేవి. కంపెనీ దివాలాకోరుతనానికి నిజమైన మూలం కూడా ఈ కప్పం చెల్లించే పద్ధతి పూర్తిగా దౌర్జన్యపూరితమైనది. పలు రకాల పెత్తుల ద్వారా దాదాపు పెద్ద మొత్తంలో స్టెర్లింగుల ధనం (సంవత్సరానికి గాను) ప్రతి ఏటా కంపెనీ నుంచి ఆంగ్ల ప్రభుత్వానికి (ఆంగ్ల ప్రభుత్వం లోని వారికి) చేరేదని తెలుస్తుంది.”

6.7.03 

## జమీందారీ పద్ధతి

1765 లో ఈస్టు ఇండియా కంపెనీ దివాని అధికారాన్ని అనగా బెంగాలు, బీహారు, ఒరిస్సాలలో రెవెన్యూ అధికారాన్ని రెవెన్యూ పై నియంత్రణాధికారాన్ని పొందింది.

ప్రారంభంలో కంపెనీ పాత రెవెన్యూ వసూలు విధానాన్ని కొనసాగించదలచుకొంది. అయితే వసూలు చేయాల్సిన మొత్తాన్ని గణనీయంగా పెంచింది.

[Rs. 14,290,000 in 1722 and Rs. 18,180,000 in 1764 to Rs. 23,400,000 in 1771]

అయితే 1773 లో కంపెనీ స్వయంగా భూమి ఆదాయ వసూళ్ళను ప్రత్యక్షంగా పర్యవేక్షించదలచింది. వారెన్ హేస్టింగ్స్ రెవెన్యూ వసూలు చేసే అధికారాన్ని వేలం పాటలో ఎవరు ఎక్కువ పాడితే వారికి ఇచ్చేవాడు. అయితే హేస్టింగ్స్ ప్రయోగం విఫలమైంది. భూమి ఆదాయాన్ని జమీందారులు ఇతర వేలం పాట దారులు విపరీతంగా పెంచి [illegible] వాస్తవంగా వసూళ్ళ మొత్తం సంవత్సర సంవత్సరానికి మారుతూండేవి. అయినా తప్పు [illegible] అధికారులు [illegible] మొత్తానికి

ఎంతో తక్కువగా ఉండేది. దాంతో క్రమంగా
ప్రాంతాల్లో ఉన్న కంపెనీ స్థావరాల్లో అస్థిరత బాగా
చోటుచేసుకుంది. పైగా పన్ను విధానం (assessment)
ఎంత ఉంటుందో తెలియక, ఎవరు
తమ రెవెన్యూ వసూలుదారు లేరో తెలియక అటు
జమిందారు గాని ఇటు రైతులుగాని సాగు ని ~~(తా)~~ వ్యవసాయాన్ని
వృద్ధి చేసేందుకు ఏ చర్యలూ తీసుకునేవారు కాదు.

ఇటువంటి పరిస్థితుల్లోనే మొదటిసారిగా
శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి కి సంబంధించిన ఆలోచన
జరిగింది. దీన్ని చర్యల తర్వాత 1793 లో
శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి ని లార్డ్ కార్న్‌వాలిస్
బెంగాలు, బీహారుల్లో ప్రవేశ పెట్టాడు.

శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి లో
రెండు ముఖ్యాంశాలు ఉన్నాయి. అవి

1) జమిందార్లు, రెవెన్యూ వసూలుదార్లని (గా ఉన్న జమిందార్లని) అంతర్భాగంగా
భూస్వాములుగా మార్చివేసింది. వారు ప్రభుత్వ
ఏజెంట్లు గా రైతుల వద్ద నుండి రెవెన్యూ వసూలు
చేయడమే గాక తమ జమిందారీ లో ఉన్న
భూమికంతటికీ వారు యజమానులు గా

శాశ్వత భూస్వాములుగా చేయబడ్డారు. వారి పేర భూమి పై యాజమాన్యహక్కు వారసత్వం చేయబడింది. ఇతడు భూమిని తాకట్టు పెట్టవచ్చు, ఇంకొకరి పేరు మీదకి మార్చవచ్చు, బదిలీ చేయవచ్చు, అమ్ముకోవచ్చు కూడా. (ప్రభుత్వం భూమిశిస్తు (land revenue) చెల్లింపుల జమీందారుని బాధ్యతగా కావించి అతడు చెల్లించని పక్షంలో అతని భూమిని స్వాధీనం చేసుకుని అమ్మివేయగలదు, తద్వారా జమీందారు భూమిని తన భూమిశిస్తువసూలు హక్కును రెండింటినీ కోల్పోవాల్సి వస్తుంది.

2) జమీందార్లు తాము రైతుల నుంచి వసూలు చేసిన మొత్తంలో $\frac{10}{11}$ వ వంతు ప్రభుత్వానికి ఇచ్చి కేవలం $\frac{1}{11}$ వ వంతు మాత్రమే తమ వద్ద ఉంచుకోగలరు. అయితే జమీందార్లు చెల్లించాల్సిన మొత్తాన్ని మాత్రం శాశ్వతంగా నిర్ణయించేసేవారు.

వ్యవసాయాన్ని మెరుగుపర్చటం, నూతన భూముల్ని సాగు చేయడం, ఎక్కువగా రైతుల్నుంచి వసూలు చేయటం వంటి మార్గాల ద్వారా జమీందారు ఆదాయం పెరిగితే దాన్నంతటినీ అతడే ఉంచుకోవచ్చు. (ప్రభుత్వం దీని మీద ఇంకా డిమాండు చేయడం ఏదీ ఉండదు. అయితే ఇదే సమయంలో

| | | |
|---|---|---|
| మీర్ ఖాసిం పాలన లో | 1762-63 | Rs. 64.6 లక్షలు |
| మీర్ జాఫర్ పాలన లో | 1763-64 | రూ. 76.2 లక్షలు |
| " | 1764-65 | రూ. 81.7 లక్షలు |
| కంపెనీ 'దివానీ' మొదటి సంవత్సరం | 1765-66 | రూ. 147.0 లక్షలు |
| కంపెనీ | 1790-91 | రూ. 268 లక్షలు |

ఈ గణాంకాల ద్వారా కంపెనీ దివానీ తొలి సంవత్సరంలోనే రెవెన్యూ వసూళ్లు అమాంతంగా 80% పైగా పెరిగిపోవడాన్ని గమనించవచ్చు. ~~అంతేగాక~~ 1790-91 నాటికి (ఈ మొత్తం దాదాపుగా) ఈ 1765-66 నాటి వసూళ్లు దాదాపుగా రెట్టింపు కావడాన్ని కూడా గమనించవచ్చు.

## జమీందారీ పద్ధతి లోని మంచి-చెడులు:

జమీందారీ పద్ధతి ప్రారంభంలో మంచి ఫలితాలతో మొదలైంది.

1) ఇది రైతును ఇష్టం వచ్చినట్లు శిస్తు వసూలు చేసే అక్రమ పన్నులు విధించే శిస్తు వసూలుదార్ల నుంచి కాపాడుతుంది.

2) మొదట్లో ఎవరు, ఎంత వసూలు చేస్తారో తెలియక తెలియదు, జమీందారు గాని ప్రభుత్వాన్ని వృద్ధి

చేసేవారు కాదు. కాని జమీందారీ పద్ధతి కింద రైతుల ఆదాయంలోంచి జమీందారుడే రాబట్టేవారు సాగు వృద్ధి కి కృషి చేస్తారని భావించారు.

3) కంపెనీకి స్థిర ఆదాయాన్ని సమకూర్చింది.

అయితే జమీందారీ పద్ధతి ఎన్నో సమస్యల్ని సృష్టించింది.

1) భూమిశిస్తు కేంద్రక ఆర్థికవ్యవస్థ లో భూమి ఒక వస్తువుగా - మార్చుకోడానికి అమ్మడానికి వీలుగా మార్చి పెను మార్పు సృష్టించింది.

2) భారతీయ గ్రామాల యొక్క స్థిరత్వం, క్రమానుగతత్వం కదిలించి వేసింది.

3) రైతు మొత్తం గ్రామీణ వ్యవస్థనే కుదిపేసింది.

4) అధికారి శిస్తు నిర్ణయాలు విపరీతంగా నిర్బంధంగా చేయడం వల్ల రెవెన్యూ శిస్తులు చాలా ఎక్కువగా నిర్ణయించబడ్డాయి. ఫలితంగా 1794 - 1807 ల మధ్య దాదాపు సగానికి పైగా జమీందారీ భూముల్ని అమ్మకానికి పెట్టారు.

5) రైతులు భూమి మీద తమ హక్కుల్ని (తమ) యాజమాన్యహక్కుని కోల్పోవడమే గాక ఇటు జమీందార్ల చేత భూమి నుంచి వెళ్లగొట్టబడేవారు కూడా.

# Additional points

* శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతిని రచించినవాడు సర్ జాన్ షోర్, తెలియజేసిన దాని ప్రకారం బెంగాలు మొత్తం శిస్తుల్లో 100 రూపాయల్లో (ప్రభుత్వం 45, జమీందార్లు-దళారులు-మధ్యవర్తులు 15, రైతులుగా సాగుచేసే వాడికి 40 మాత్రమే మిగిలేది.

బ్రిటీషువారు శిస్తు వసూలు దార్లని జమీందార్లు గా భూస్వాములుగా ఎందుకు గుర్తించారు?

బ్రిటీషువారు భారతీయ వ్యవస్థని పొరపాటుగా అర్థం చేసుకున్నారన్నది ఒక వాదన. ఇంగ్లీషు వ్యవసాయ వ్యవస్థలో భూస్వాములు కేంద్ర బిందువు. బ్రిటీషువారు ఇక్కడున్న భారతీయ జమీందారుల్ని లార్డ్‌ల మాదిరి గా ఊహించుకోవడం పొరపాటు గా చేశారు. అయితే ఇక్కడ వారిద్దరి మధ్య ఉన్న తేడాను గమనించాలి.

నిర్దిష్టకాలానంతరం జనసమీక్ష చేయాల్సి ఉంటుంది.

* తర్వాతి కాలంలో మొత్తం భారతదేశమంతటా మరో వర్గం భూస్వాములు సృష్టించబడ్డారు. విదేశీ ప్రభుత్వానికి విశ్వాసపాత్రమైన సేవలందించిన వారికి ప్రభుత్వం భూమి ఇవ్వడం మొదలు పెట్టడం ద్వారా ఈ వర్గం వారు ఏర్పడ్డారు.

+

Read compulsorily

ఆధునిక భారతదేశ చరిత్ర

(1757 - 1947) (తె. అ.)

Page: 107 - 110.

జమీందారీ పద్ధతి - రైతుల స్థితిలో మార్పులు :-

ఆంగ్లేయులు జమీందారీ పద్ధతిని ప్రవేశపెట్టక ముందు కేవలం శిస్తు వసూలు దారులు గా ఉన్న జమీందార్లు ఈ పద్ధతి లో భూయజమానులు అయ్యారు. ఫలితంగా సాగు చేసే రైతు బాడుగదారు గా (tenant) అద్దెకుండేవాడి గా దిగజార్చబడ్డాడు. అతడు తరతరాలు గా

భూమి మీద అనుభవిస్తున్న హక్కులు ఇతర సంప్రదాయ హక్కులు కోల్పోవాల్సి వచ్చింది. పచ్చిక బయళ్లని వాడుకోవడం; అడవి భూముల్ని, చెరువు పారుదలకాల్వల్ని, మత్స్య పరిశ్రమ, ఇళ్ల స్థలాలు, శిస్తు దీర్ఘకాలంగా పెంచటం నుంచి రక్షణ మొ॥ వాటన్నింటినీ రైతు త్యాగం చేయాల్సి వచ్చింది. వాస్తవానికి కౌలుదారులు, బీహారుల్లో ఈ అద్దెదార్లు జమిందార్ల దయాదాక్షిణ్యాల మీద బతకాల్సి వచ్చింది. జమిందారు శిస్తులేదా చెల్లింపు సమయాల్లో విపరీతమైన రెవెన్యూ భారాన్ని చెల్లించడం క్రమం తప్పకుండా ఉండేందుకని ప్రభుత్వం రైతుల్ని వారికి వశం గా పెట్టింది.

బారామహల్ – 1792 – అంచనా వేసిన పంటలో 50%
మద్రాసు ప్రావిన్సు – 1820 – స్థూల పంటలో $\frac{1}{3}$ వ వంతు
– 1864 – నికర పంటలో 50%.

సరస

## : రైత్వారీ విధానము :

ఈ రైత్వారీ విధానం లో రిజిస్టరుకాబడిన ప్రతి భూమిగల వానిని ఆ భూమికి యజమానిగా గుర్తించటం జరిగింది. ప్రభుత్వానికి భూమి శిస్తు చెల్లించే విషయంలో అతనే ప్రత్యక్షబాధ్యుడిగా ప్రభుత్వం ఎంచేది. అతనికి తన భూమిని సొంతంగా ఇతరులకి ఇవ్వడానికి, బదిలీ చేయడానికి, తాకట్టు పెట్టడానికి, అమ్మడానికి అధికారం ఉంటుంది. అతడు ప్రభుత్వానికి చెల్లించాల్సిన శిస్తు చెల్లించునంత కాలం అతన్ని అతని భూమి నుండి ప్రభుత్వం తొలగించదు.

## మద్రాసు లో శిస్తు నిర్ణయం :

మద్రాసు ప్రెసిడెన్సీలో మొట్టమొదటి శిస్తు నిర్ణయం 1792 లో కంపెనీ బారామహల్ జిల్లాను ఆక్రమించుకున్న తర్వాత జరిగింది. కెప్టెన్ రీడ్, థామస్ మన్రో సహకారంతో "అంచనా" వేసిన ఉత్పత్తి/పంట మీద 50% ని ప్రభుత్వ డిమాండు గా నిర్ణయించాడు. అయితే ఇది మొత్తం (economic rent) న్యాయమయినటువంటి శిస్తు ఆర్థిక బాడుగ సరసమైన, తగినంత శిస్తు కంటే కూడా అధికమయ్యింది.

ఇదే విధానాన్ని ఇతర ప్రాంతాలకు కూడా వ్యాప్తి చేశారు.

మొదట్లో మదింపు చాలా ఎక్కువగా ఉండి తీవ్రమైనదై ప్రజలు నానా బాధలు పడ్డారు.

## థామస్ మన్రో - మద్రాసు శిస్తు నిర్ణయం:

థామస్ మన్రో (1820-27 లలో మద్రాసు గవర్నరు) ఈ శిస్తు నిర్ణయం లోని లోపాలు గమనించాడు. రైతు స్వాధీనంలోని భూముల "స్థూల Gross" పంట ఉత్పత్తి లో $\frac{1}{3}$ వ వంతు శిస్తు కింద చెల్లించేట్లు రైత్వారీ విధానాన్ని కొంత మద్రాసు ప్రావిన్సు లోని (శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి ప్రాంతాలను తప్ప) అన్ని ప్రాంతాలకు విస్తరింపచేశాడు. దురదృష్టవశాత్తు ఇది కూడా దారుణంగా (economic rental) ఆర్థిక బాడుగ మొత్తాన్ని గ్రహించివేసింది.

(పన్నులు కేవలం ధన రూపంలో నిర్ణయించబడేవి. దీనికి భూమి యొక్క వాస్తవ పంట లో గాని మార్కెట్లు లో అమలులో ఉన్న ధరల విలువ లోగాని ఏ సంబంధం ఉండేది కాదు.

మళ్ళీ శిస్తు నిర్ణయం దాదాపు 30 సంవత్సరాలు ప్రమాణంగా ఉండి తీవ్రమైన ఇబ్బందులని, వ్యవసాయ దైన్యాన్ని సృష్టించింది. రైతాంగం పేదరికం లో మగ్గిపోయారు. రైతు శిస్తు చెల్లించలేకపోయిన వడ్డీ వ్యాపారుల సంకెళ్లలో చిక్కుకు పోయారు. వసూళ్ల అధికారులు చాలా క్రూరంగా రైతుల్ని ఇబ్బందులకి గురి చేసేవారు. బకాయిలు పడ్డవారిని అన్నం తిననీయకపోవడం, కాళ్ళు చేతులు కట్టివేయడం, కొట్టడం, వారి జుట్టుని గాడిదల తోకలకి కట్టడం, ఎండలో నిలబెట్టడం, చెట్లకి వేలాడదీయడం వంటి శిక్షలు విధించేవారు.

1855 లో స్థూల పంట ఉత్పత్తి లో 30% ఆధారంగా విస్తృతమైన సర్వే శిస్తు నిర్ణయ పద్ధతులు నిర్ణయించబడ్డాయి. కాని అమలు మాత్రం 1861 లో మొదలయ్యింది. 1864 లో చేయబడిన నిబంధన ప్రకారం (The Rule of 1864) (ప్రభుత్వ డిమాండు పంట నికర విలువ లో 50% గాను, 30 ఏళ్ళ కొకమారు సవరింపు చేయవలసింది గాను నిర్ణయించబడినది. అయితే ఈ సూచనలు పేపరుకే పరిమితమై వాస్తవ పాలన లో వాటి అమలు ప్రశ్నార్థకమైంది.

(3) 1824-28 లలో ప్రింగిల్ (Pringle) క్రమమైన భూసర్వేలను నిర్వహించాడు. నికర పంట లో (net produce) 55% ని ప్రభుత్వ ఆదాయంగా నిర్ణయించడమైంది. దురదృష్టవశాత్తూ చాలా సర్వేలు తప్పుడువిగా, పంట ఉత్పత్తుల అంచనాలు కూడా తప్పుడువిగా తేలాయి. పలు ఫలితంగా మదింపులు విపరీతమై రైతులు నానా బాధలు పడ్డారు. నిరాశ, నిస్పృహ, బాధ లో చాలా మంది రైతులు తమ భూములను వదిలేశారు. సాగు చేయబడిన పెద్ద పెద్ద భూభాగాలు సాగుదల లేని తప్పిపోయాయి.

(4) వింగేట్ యొక్క సర్వే - బొంబాయి లో రైత్వారీ శిస్తు నిర్ణయం:

1835 లో లెఫ్టినెంట్ వింగేట్ ని సూపరింటెండెంట్ ఆఫ్ సర్వేగా నియమించారు. అతడు 1847 లో నివేదిక సమర్పించాడు.

స్థూలంగా చెప్పాలంటే ప్రభుత్వ భూమిశిస్తు ఏ జిల్లా కు నిర్ణయించాలంటే అది దాని 'జిల్లా గత చరిత్ర' మరియు 'ఆ జిల్లా ప్రజల గల పరిస్థితులు' (అనగా వారి చెల్లింపు/శిస్తు చెల్లింపు సామర్థ్యం) ఆధారంగా నిర్ణయించబడేది. తర్వాత మొత్తం

జిల్లా భూమిశిస్తు సెటిల్మెంటు ను ఇతర పొలాల మధ్య వంటి

వారు. గ్రామాల నుండి ఉన్న పొలాలను వేరే

శిస్తు నిర్ణయించే పద్ధతి ని ఇప్పుడు మార్చి భూసారం

ఆధారంగా శిస్తు నిర్ణయించు పద్ధతి ని ప్రవేశపెట్టారు.

దీంతో పాటు శిస్తు మదింపు చేసేటప్పుడు సాగుదారుడి వ్యక్తిగత భూమి ఆధారంగా కాక "పొలం" ఆధారంగా చేసేవారు. దీంతో సాగుదారుడు తన కిష్టమైన పొలాన్ని వదిలి వేయడానికి స్వేచ్ఛగా/ స్వతంత్రంగా తన కు నచ్చిన పొలాన్ని తీసుకోడానికి అవకాశం ఏర్పడింది. ఈ విధంగా 30 ఏళ్లకు శిస్తు నిర్ణయం చేయబడింది.

ఈ శిస్తు మదింపు విధానం చాలా వరకు ఊహల మీద ఆధారపడింది అధిక శిస్తుల దారితీసింది.

30 ఏళ్ల తర్వాత పునర్నిర్ణయం మొదలైంది. 1866 లో ఇది ఆరంభించబడింది. 1861-65 లలో అమెరికా అంతర్యుద్ధం వలన లాంకషైర్లోనూ బొంబాయి పత్తి ధరలు పెరిగాయి. ఈ లాంకషైర్ పెరుగుదల సర్వే అధికారులను మదింపు ను

66 % నుంచి 100 % మధ్య ఏకపక్షంగా పెంచేందుకు అవకాశం ఇచ్చింది. పైగా సాగుదారుడికి కోర్టులో అప్పీలు చేసుకునేందుకు ఏ మాత్రం ఇవ్వలేదు.

దాంతో 1875 లో దక్కను లో రైతుల తిరుగుబాట్లు జరిగాయి. 1879 లో చేసిన దక్కను వ్యవసాయదారుల ఉపశమన చట్టం వారిని వడ్డీ వ్యాపారుల నుంచి కాపాడిందే గాని ఆ బాధలకి మూలమైన ప్రభుత్వ శిస్తు విధానం నుంచి రక్షణ కల్పించలేదు.

బొంబాయి లో రైత్వారీ శిస్తు నిర్ణయంలో 2 పెద్ద లోపాలు - శిస్తు పెంపు, అనిశ్చితి. పైగా పెరుగుదలకి వ్యతిరేకంగా కోర్టులో అప్పీలు చేసుకునే వీలు లేదు. కలెక్టరు సాగుదారుడికి శిస్తు లో భవిష్యత్ పెరుగుదల గురించి ముందుగానే హెచ్చరిక చేస్తాడు. సమ్మతి అయితే రైతు ఉంచుకోవచ్చు, లేదా భూమిని వదులుకోవచ్చు.

+

M.A. Guide లో విమర్శ చదవాలి.

## మహల్వారీ శిస్తు నిర్ణయ పద్ధతి

ఈ విధానం లో శిస్తు నిర్ణయం ఒక గ్రామానికి ఒక మహాలుగా చేసేవారు. గ్రామ భూములు 'సహ-భాగస్వాముల సమూహం' మొత్తానికి ఉమ్మడిగా చెందుతుంది. ఈ సహ-భాగస్వాములందరూ ఉమ్మడిగా శిస్తు చెల్లింపుకు బాధ్యులు వహించేవారు. అయితే వ్యక్తిగత బాధ్యత కూడా ఉండేది. ఎవరైనా సహభాగస్వామి తన భూమిని వదులుకుంటే అది మొత్తం గ్రామానికంతా చెందేది. గ్రామ వర్గం (Village Community) నిర్ధారణ భూములన్నిటికీ, అడవులు, పచ్చిక బయళ్లలో సహ యాజమాన్యం వహించేది.

వాయువ్య ప్రాంతాలు, అవధ్ లలో శిస్తు నిర్ణయ పద్ధతి:

సీడెడ్ జిల్లాలకు (అలహాబాదు, దాని పరిసర ప్రాంతాలు) మొదటి లెఫ్టినెంట్ గవర్నర్ అయిన హెన్రీ వెల్లెస్లీ ఆ ప్రాంతం ఆక్రమణలోకి వచ్చిన తొలి సంవత్సరంలోనే అప్పటి వరకూ అయోధ్య నవాబు వసూలు చేస్తున్న దానికంటే 20 లక్షల రూపాయలు ఎక్కువగా భూమి శిస్తు నిర్ణయించాడు. ఆ మేరకు జమీందార్లు, రైతులతో 3 ఏళ్ల కు శిస్తు

నిర్ణయ ఒప్పందం కూడా చేసుకున్నాడు. మూడో సంవత్సరం గడిచేసరికి మరో 10 లక్షల రూపాయల భారం పడ్డింది. హైదరాబాదు నవాబు వసూళ్లు ఏ ఏడాదికాఏడాది పంటని బట్టి మారుతుండేవి. కంపెనీ శిస్తు వసూళ్ల మొత్తం పరిమితులు లేకుండా భారతదేశం మునుపెన్నడూ ఎరగని రీతి లో నిర్దాక్షిణ్యంగా క్రూరంగా ఉండేవి.

ఇదే విధమైన శిస్తు నిర్ణయ పద్ధతిని ఆక్రమిత / ఆక్రమిత ప్రాంతాలలో (Conquered Provinces) (జమున - గంగా నదుల మధ్య ప్రాంతం) లో కూడా ప్రవేశపెట్టారు.

## 1822 రెగ్యులేషన్:

బోర్డు ఆఫ్ కమిషనర్ల సెక్రటరీ అయిన హోల్ట్ మెకంజీ 1819 లో ఒక నివేదికలో ఉత్తర భారతంలో గ్రామ వర్గాల స్థితిని గూర్చి చెప్పాడు. అతడు భూ సర్వే, భూమి పై హక్కుల రికార్డు, భూమి శిస్తు నిర్ణయం ఇవన్నీ గ్రామ గ్రామానికీ లేదా మహాలు మహాలుకీ జరగాలని, భూమి శిస్తు వసూలు గ్రామపెద్ద నుంచి లేదా లంబార్దార్ల నుంచి

వసూలు చేయబడాలని సూచించాడు.

రెగ్యులేషన్ VII, 1822 పై సూచనలకు

చట్టరూపమిచ్చింది. దీని ప్రకారం జమిందార్లు ~~[struck]~~ చెల్లించాలని

భాటకం లో 80% ని భూమి శిస్తుగా నిర్ణయించారు.

అలా జమిందార్లు లేదా భూస్వాముల యాజమాన్యం లో

గాక పాలుదార్ల ఉమ్మడి బాడుగ కింద భూమి ఉంటే

ప్రభుత్వ డిమాండు భాటకం లో 95% దాకా

నిర్ణయించబడేందుకు అనుమతి ఇవ్వబడింది.

అయితే విపరీతంగా నున్న ప్రభుత్వ డిమాండు, వసూలు

చేసేప్పుడు అవలంబించిన కొలతల, లోపాల వలన ఈ పద్ధతి

విఫలమయ్యింది.

రెగ్యులేషన్ IX, 1833 - మెర్టిన్స్ బర్డ్ ద్వారా

భూమిశిస్తు నిర్ణయం :-

విలియం బెంటింక్ ప్రభుత్వం 1822 లోని

1822 నాటి విధానం ~~[struck]~~ అమలులోని కాఠిన్యం వల్ల

విస్తృతమైన వైఫల్యం మిగిల్చిందని గుర్తించింది. సుదీర్ఘ

చర్చల అనంతరం 1833 రెగ్యులేషన్ చేయబడింది.

దీని ద్వారా సరళమైన రీతిలో ఉత్పత్తి ని

భూమి వైశాల్యం, భాటకాన్ని అంచనా వేయటం చేసింది. అంతేగాక వివిధరకాల భూములకు సగటు భాటకాన్ని నిర్ణయించే పద్ధతిని కూడా ప్రవేశపెట్టింది. మొదటిసారిగా ఫీల్డు పటాలు, ఫీల్డు రిజిస్టర్లని ఏర్పాటు చేయటము సంభవించింది.

ఈ కొత్త విధానాన్ని తయారు చేసిన మెర్టిన్స్ బర్డ్ ను "ఉత్తర భారత భూమిశిస్తు నిర్ణయ పిత" గా కీర్తిస్తారు. ఈ కొత్త విధానం లో ఒక ప్రాంతం లోని భూమిని సర్వే చేసి ఆ పొలం సరిహద్దుల నిర్ణయించి అందులో సాగులో ఉన్న భూమి సాగులో లేని భూమిని విడిగా చూపేవారు. తర్వాత మొత్తం ఆ ప్రాంతానికంతా శిస్తు మదింపు నిర్ణయింపబడేది. తర్వాత ప్రతి గ్రామానికి ప్రభుత్వ డిమాండు నిర్ణయించే వారు. అంతర్గతంగా సవరింపులు చేసుకునే అధికారాన్ని 'మహల్' కు ఇచ్చారు. ప్రభుత్వ డిమాండు ను భాటకం లో 66% గా నిర్ణయించారు. శిస్తు నిర్ణయం 30 సంవత్సరాలకు జరిగింది.

శిస్తు నిర్ణయ పని (ఈ పథకం కింద) 1833 నుంచి ప్రారంభమయ్యింది. ఈ పనులు

జేమ్స్ థామ్సన్ పాలనా కాలంలో (1843-53 Lt. Governor) మొదలైంది.

ఈ 66% భాటక డిమాండు కూడా క్రూరమైనదే ఇది పని చెయ్యలేదు. దానితో ఉత్తరాది శిస్తు నిర్ణాయక అధికారులకు కొత్త నిర్దేశకాలు ఇవ్వాల్సిన అవసరం ఉందని తెలిసింది. ఫలితంగా 1855 లో సహరాన్‌పూర్ నిబంధనలు చేయబడి ప్రభుత్వ రెవెన్యూ డిమాండు భాటకం విలువలో 50% కి పరిమితం చేయబడింది.

దురదృష్టవశాత్తూ శిస్తు నిర్ణాయక అధికారులు ఈ కొత్త నిబంధనలను ఆచరణలో పూర్తిగా విస్మరించారు. వారు 50% భాటకం విలువ కంటే సుభిక్షమైన శక్తివంతమైన ఎస్టేట్ల భాటకంలో భాగమైన అర్థం తీసుకున్నారు గాని వాస్తవ భాటకంలో భాగంగా భావించలేదు. ఈ విధానం వ్యవసాయదారులపై భారమై తీవ్రమైన అసంతృప్తి కలిగించింది. 1857-58 తిరుగుబాటు లో అది ప్రవాహాలా పెల్లుబికింది.

# Structure of the British Raj upto 1857

## * 1857 వరకు భారతదేశంలో బ్రిటిష్ రాజ్ నిర్మాణము *

'కేవలం వ్యాపారుల యొక్క కంపెనీ ప్రభుత్వం అది ఏ దేశమయినా గాని బహుశ అన్ని ప్రభుత్వాల లోకి దుష్టమైనది గా ఉంటుంది'

— ఆడమ్ స్మిత్

వ్యాపారంలో తమ పోటీదారుల్ని తొలగించుకున్న కంపెనీ భారత ఆర్థిక వ్యవస్థను ప్రత్యక్షంగా నియంత్రించేందుకు రాజకీయాధికారం కోసం కృషి చేసి కంపెనీ పాలన స్థాపించింది.

లండను నందు కంపెనీ ప్రభుత్వము:

లండన నందు కంపెనీ పాలనా వ్యవహారాలు 24 మంది డైరెక్టర్లు గల 'కోర్టు ఆఫ్ డైరెక్టర్స్' ద్వారా జరిగేవి. వీరిని ప్రతి ఏటా షేర్-హోల్డర్ల సమూహం అయిన 'కోర్ట్ ఆఫ్ ప్రొప్రయిటర్స్' ఎన్నుకునేది.

ఈ డైరెక్టర్లు తామే సభ్యులుగా ఉండే ఉపసంఘాలు, సంఘాల ద్వారా రోజువారీ

కార్యకలాపాలు నడిపేవారు. కాలక్రమేణా ఈ కంపెనీ అధికారాన్ని విస్తృత సార్వభౌమాధికార హోదాలో తొలుత గుర్తించటం, పర్యవేక్షించటం, నియంత్రించటం చివరకు లక్ష్యించటం, తొలగించటం వంటి పార్లమెంటు చట్టాల ద్వారా చేశారు.

## భారతదేశంలో కంపెనీ ప్రభుత్వం:

ఇండియాలో తొలుత కంపెనీ ఒకే కేంద్రం నుంచి పాలన సాగించాలని యత్నించింది. ప్రెసిడెంటు మరియు కౌన్సిలు, సూరత్ లో కేంద్రంగా, కాస్తా, తర్వాత కెప్టెన్ జనరలు - కౌన్సిలు, బొంబాయి కేంద్రంగా కాస్తా కంపెనీ పాలన నిర్వహించినా కేంద్రీకృత పాలన లో కష్టాలు వల్ల తలెత్తాయని కంపెనీ పాలన మూడు సమాంతరమైన, సమన్వయం గల బొంబాయి, మద్రాసు, కలకత్తా లలో (పాలనావ్యవస్థలు) ఏర్పరచింది.

ఈ ప్రాంతాల్లో కంపెనీ పాలన కంపెనీ సీనియరు సేవకుల్లోంచి నియమించబడ్డ ప్రెసిడెంటు లేదా గవర్నరు మరియు ఒక కౌన్సిలు ద్వారా సాగేది. అధికారికంగా కౌన్సిలూ, ప్రెసిడెంటూ

సమిష్టిగా అధికారాన్ని పొంది ఉన్నా వ్యవహారాలు ప్రెసిడెంట్ కార్యకలాపాలన్ని నిర్వర్తించేవాడు. కౌన్సిలులో మెజారిటీ ప్రకారం నిర్ణయాలు జరిగేవి. ఈ మూడు 'ప్రెసిడెన్సీలు' ఒకదానితో ఒకటి స్వతంత్రంగా ఉంటూ లండనులోని 'కోర్టు ఆఫ్ డైరెక్టర్స్' కి ప్రత్యక్షంగా బాధ్యత వహించేవి.

'గవర్నరు' పదం న్యాయపాలన, సైనికాధికారం సూచించగా 'ప్రెసిడెంటు' పదం కేవలం పౌరపాలన అధికారాన్ని సూచిస్తుంది. గవర్నర్ల స్వతంత్ర్యాధికారాన్ని కంపెనీ ఎప్పటికప్పుడు పర్యవేక్షించేది.

1770 ల ఆరంభంలో కంపెనీ ఆర్థిక ఇబ్బందులకు గురై ఆంగ్ల ప్రభుత్వాన్ని రుణం కోరింది. అప్పటికే ఆంగ్ల ఉత్పత్తిదారులు, వ్యాపారుల నుంచి కంపెనీ ని నియంత్రించాలంటూ ఒత్తిడి అధికమవడంతో ప్రభుత్వం దీన్ని అవకాశం గా ఎంచి 1773 రెగ్యులేటింగ్ చట్టాన్ని చేసింది. దీన్ననుసరించి

(1) కోర్టు ఆఫ్ ప్రొప్రయిటర్ల ప్రభావం తగ్గించబడింది. కోర్టు ఆఫ్ డైరెక్టర్లను ఏడాదికి గాక నాలుగేళ్లకోసారి ఎన్నుకోవాలి

(2) డైరెక్టర్లు ఆంగ్ల ప్రభుత్వానికి భారత రెవెన్యూ వ్యవహారాలను తెలియజెయ్యాలి.

(3) అట్లే సెక్రెటరీ ఆఫ్ స్టేట్ కి భారత పౌర, సైనిక పాలన గూర్చి తెలియజెయ్యాలి.

రెగ్యులేటింగ్ చట్టం, 1773 వలన భారతదేశం లోని కంపెనీ పాలన లో పలు మార్పులు జరిగాయి.

(4) బెంగాలు ప్రభుత్వం గవర్నరు జనరలు - కౌన్సిలు కు నలుగురు సభ్యుల కౌన్సిలు ను ఇవ్వబడింది.
ఈ వ్యవస్థ బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీలను యుద్ధం, శాంతి విషయాల్లో నియంత్రించవచ్చు.

(5) సుప్రీంకోర్టు ను ఒక ప్రధాన న్యాయాధికారుడు, ముగ్గురు అదనపు న్యాయాధికారులతో నియమించేందుకు కొరకు అధికారమిచ్చింది.

ఈ చట్టం లోని లోపాల్ని తొలగించేందుకు కంపెనీ పై పట్టు పెంచేందుకు 1784 లో ఆంగ్ల పార్లమెంటు పిట్స్ ఇండియా చట్టాన్ని చేసింది. దీని ద్వారా

(1) లండను లో ఛాన్సెలర్ ఆఫ్ ఎక్స్చెకర్ అధ్యక్షతన " బోర్డ్ ఆఫ్ కంట్రోల్ "

ఏర్పాటు చేయబడింది.

ఈ బోర్డు కు కంపెనీ వ్యాపారాలపై [illegible] పరిశీలనా హక్కు ఉంటుంది.

భారతదేశం లో ఈ పిట్స్ ఇండియా చట్టం తీసుకొచ్చిన మార్పులు క్రింది విధంగా ఉన్నాయి.

(2) గవర్నరు జనరల్ కౌన్సిలు లోని సభ్యుల సంఖ్య 4 నుంచి 3 కి తగ్గించారు.
ఈ ముగ్గురిలో ఒకరు కంపెనీ భారత దళాలకు కమాండర్-ఇన్-చీఫ్ గా ఉండాలి.

(3) గవర్నరు జనరలు కు ఇతర ప్రెసిడెన్సీల పై నియంత్రణ ని నిర్దుష్టం చేసి మరింత పటిష్టం పరిచారు.

1786 లో చేయబడిన మరొక చట్టం ద్వారా ప్రత్యేక సందర్భాల్లో గవర్నరు జనరలు కు కౌన్సిలు మెజారిటీ ని తోసిపుచ్చేందుకు, కమాండర్ ఇన్ చీఫ్ పదవి చేపట్టేందుకు అధికారం ఇవ్వబడింది. భారత్ లో కంపెనీ పాలన కొనసాగినంత కాలం ఈ విషయం లో మౌలికమైన మార్పులేవీ జరగలేదు.

1793 ఛార్టరు చట్టం ద్వారా గవర్నరు జనరలు కు బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీల పై నియంత్రణ మరింత విస్తృత పర్చబడింది.

<u>1813</u> చార్టర్ చట్టం ద్వారా కంపెనీ వర్తకాధిపత్యాన్ని (చైనా తో వ్యాపారం, టీ/తేయాకు వ్యాపారం తప్ప) తొలగించారు.

<u>1833</u> చార్టర్ చట్టం ద్వారా వర్తకాధిపత్యాన్ని పూర్తిగా తొలగించారు. కంపెనీ తన వ్యాపార కార్యకలాపాల్ని నిల్పివేసి కేవలం భారతీయ భూభాగాల్ని బ్రిటిష్ సార్వభౌముల విశ్వాసపాత్రుడిగా నిర్వహించబడాలి & పరిమితం కావాలని నిర్ణయించారు. ఈ చట్టం ద్వారా

బొంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీల శాసనాధికారాల్ని పరిమితం చేసి గవర్నర్ జనరల్ కౌన్సిల్ లో శాసనాధికారాల్ని కేంద్రీకరించారు.

ఫలితంగా గవర్నర్ జనరల్ కౌన్సిల్ లో కొత్తగా న్యాయసభ్యున్ని నియమించారు.

ఈ న్యాయసభ్యుడు కౌన్సిల్ శాసన విషయాలు చర్చించునప్పుడే ఓటు చేయగలడు.

కంపెనీ అధీన ప్రాంతాల్లో అధికారాల్ని వెల్లడించేందుకు వీలుగా అతన్ని గవర్నర్ జనరల్ ఆఫ్ ఇండియా - కౌన్సిల్ గా పిలవడం మొదలుపెట్టారు.

గవర్నర్ జనరల్ - కౌన్సిల్ బెంగాల్ ప్రభుత్వాన్ని కూడా చూసేది, అయినప్పటికీ కౌన్సిల్ లో ఒకరిని డిప్యూటీ గవర్నర్ ఆఫ్ ప్రెసిడెన్సీగా నియమించాలి.

1853 చార్టరు చట్టం ద్వారా న్యాయ సభ్యుని కి పూర్తి సభ్యత్వ హోదా లభించింది. శాసనాధికారాల కోసం గవర్నరు జనరలు కౌన్సిలు కు మరో ఆరుగుర్ని అదనంగా జోడించారు. అయితే ఈ చట్టం కంపెనీ గడువు మరో 20 సం|| పొడిగించనందువల్ల బ్రిటీష్ పార్లమెంటు పూర్తి బాధ్యతలు స్వీకరించదలుచుకున్నట్లు విశదం ~~అవుతుంది.~~

1765 - 1772 ప్రాంతంలో బెంగాలు లో కంపెనీ ద్వంద్వ పాలన చేసింది. రెవెన్యూ వసూలు 'దివానీ' అధికారం కంపెనీ కి ప్రత్యక్షంగా ఉండేది. డిప్యూటీ సుబేదారు నియమించిన నాయబ్ ద్వారా కంపెనీ 'నిజామత్' లేదా పోలీసు - న్యాయాధికారాన్ని నియంత్రించేది. ఇదే ద్వంద్వపాలన (Dual or Double government). నవాబు కి పాలనా 'బాధ్యత' కంపెనీ కి 'అధికారం' ఉండేవి. ఇది విపరీత కష్టాలకు దారి తీసి విఫలమయ్యింది.

కంపెనీ పాలన లో అది ఆరంభించిన పాశ్చాత్య తరహా న్యాయపాలనా నిర్మాణం ప్రత్యేకమైంది.

(1) 1718 లో అంతకుముందున్న ఫ్యాక్టరీ విధానాన్ని రద్దు చేసి గవర్నరు - కౌన్సిలు

ఏర్పాటు చేసుకునే అధికారాన్ని ప్రవేశపెట్టారు. జడ్జీలుగా ఒక హిందువు, ముస్లిం, పార్శీ, క్రైస్తవుడు ఇలా కంపెనీ (2) అధికార్లు ఉండేవారు. 1726 లో కోర్టు ఆఫ్ డైరెక్టర్లు రాజు అనుమతి పొంది కలకత్తా, బొంబాయి, మద్రాసుల్లో మేయర్స్ కోర్టుల్ని ఏర్పాటు చేశారు. వీటిలో ప్రతిదాన్లో ఒక మేయరు, తొమ్మిది మంది ఆల్డర్‌మెన్‌లు ఉండేవారు. ఇవి ఆ నగర ఉద్యోగులు, అధికారుల ఫిర్యాదుల్ని తగాదాలు తీర్చేవి.

### కంపెనీ న్యాయవ్యవస్థలో మార్పులు (3)

నిర్మాణం వారెన్ హేస్టింగ్స్ 1772 లో రెండంచెల ప్రతిజిల్లాలో సివిల్ న్యాయం కోసం 'దివాని అదాలత్' క్రిమినల్ న్యాయం కోసం 'ఫౌజదారి అదాలత్' లు ఏర్పాటుచేశారు. దివాని అదాలత్ కు కలెక్టరు ఫౌజదారి అదాలత్ కు భారతీయ న్యాయాధిపుడు అధ్యక్షత వహించేవారు. వీటి నుంచి అప్పీళ్లు విచారించేందుకు కలకత్తా నందు సదర్ అదాలత్, సదర్ నిజామత్ అదాలత్ లు ఏర్పాటుచేశారు. వీటిలో

సదర్ అదాలత్ కు ప్రెసిడెంట్ - కౌన్సిల్ అధ్యక్షుల వహించేది.

(4)

1774 లో జిల్లా కోర్టులను 'ఆమిల్స్' అనే భారతీయ అధికారుల ఆధీనంలో ఉంచారు. వారి తీర్పులపై ప్రావిన్షియల్ కౌన్సిల్ కు ముఖ్యమైన విషయాల్లో సదర్ దివానీ అదాలత్ కు అప్పీలు అవకాశం ఉండేది.

(5)

1775 లో సదర్ నిజామత్ అదాలత్ ను ముర్షిదాబాద్ కు బదలాయించి దాన్ని 'నారాయణ్ నాజిమ్' ఆధీనంలో ఉంచారు. ప్రతి జిల్లా లో క్రిమినల్ న్యాయపాలన కు ఫౌజుదారుని నియమించారు.

(6)

1780 లో ఆరు ప్రావిన్షియల్ కౌన్సిల్ న్యాయాధికారాల్ని ఆరు దివానీ అదాలత్ లకు ఇచ్చారు. ఇవి కంపెనీ యొక్క కావెనెంటెడ్[2] ఉద్యోగి చే అధిష్ఠింపబడేవి. దాంతో యూరోపియన్ పర్యవేక్షణలో మన / మండే పాత జిల్లా కోర్టులను పునరుద్ధరించినట్లయ్యింది. 1775[3] ఫౌజుదారీ పద్ధతిని రద్దు చేశారు. ఫౌజుదార్ల అధికారాల్ని[4] జిల్లా కోర్టుల

జడ్జీలను బదలాయించారు. అయితే భారతీయ ప్రాంతీయాధ్యక్షులుగా మాత్రం ఫౌజ్‌దారీ కోర్టుల్లో నేరగాళ్లు (criminals) విచారించబడేవారు.

1774 లో కలకత్తాలో కేవలం ఆంగ్లేయుల కోసమే ఒక సుప్రీం కోర్టును ఏర్పాటు చేశారు. అయితే అది మొత్తం ప్రజలందరికీ తన అధికారపరిధిని చెలాయించడం మొదలు పెట్టింది. దాంతో అది కార్యనిర్వాహక-ప్రభుత్వ ఉన్నతాధికారుల మధ్య ఘర్షణకు దారి తీసింది. 1781 లో ఒక కొత్త చట్టం చేసి ఈ సుప్రీం కోర్టు అధికారపరిధిని స్పష్టంగా నిర్వచించడం లో వివాదం ముగిసింది.

కార్న్‌వాలిస్ కాలంలో ప్రాంతీయాలలో [7] పరిమాణాత్మక పరిణామాలు చోటుచేసుకున్నాయి. 1787 లో జిల్లా కోర్టుల్ని మళ్లీ కలెక్టర్ల కిందకి తెచ్చారు. కలెక్టర్లకిప్పుడు మెజిస్ట్రేటు అధికారాలు, కొన్ని క్రిమినల్ కేసుల్ని విచారించే అధికారాన్ని [8] ఇచ్చారు.

1790 నుంచి సదర్ నిజామత్ అదాలత్ ను ముస్లిం ప్రాంతాధిపతుడు గాక గవర్నరు జనరల్-కౌన్సిల్ అధిష్టించటం మొదలుపెట్టింది. జిల్లా క్రిమినల్ కోర్టులు రద్దుచేయబడి వాటి స్థానంలో నాలుగు సర్క్యూట్ కోర్టులు వెలిశాయి. వీటిని బ్రిటీషువాళ్లు ఇద్దరు

కంపెనీ ఉద్యోగులు అధిష్ఠించేవారు.

(9) 1793 లో ప్రఖ్యాతిగాంచిన 'కార్న్‌వాలిస్ కోడ్' చేశారు. కలెక్టర్ల నుంచి న్యాయ, మెజిస్ట్రేరియల్ అధికారాల్ని జడ్జీలనే కొత్త అధికారులకు బదిలీ చేశారు. వాటికు ప్రావిన్షియల్ సర్క్యూట్ కోర్టులు పునర్వ్యవస్థీకరించబడ్డాయి. కలెక్టర్ల లతో సహా ప్రభుత్వోద్యోగులందర్నీ కోర్టులలో లేదా అధికారిక విధినిర్వహణలో బాధ్యుల్ని చేయడం ద్వారా సమన్యాయపాలన (Rule of Law) (ప్రవేశపెట్ట) సాధించబడింది.

(10) 1831 లో ప్రావిన్షియల్ కోర్టులు మరియు సర్క్యూట్ కోర్టులను రద్దు చేశారు. వాటి విధుల్ని రెవెన్యూ కమీషనర్లకు లేదా జిల్లా జడ్జీలకు జిల్లా కలెక్టర్లకు ఇచ్చారు. భారతీయుల్ని తృప్తి పర్చేందుకు వారిని డిప్యూటీ మేజిస్ట్రేట్లుగా, సబార్డినేట్ జడ్జీలుగా, ముఖ్య (principal) సదర్ అమీన్లు గా నియమించడం మొదలుపెట్టారు.

కంపెనీ పాలనలో సివిలు సర్వీసు నిర్మాణం :

సార్వభౌమాధికార వ్యక్తుల నియమాల ననుసరించి మాదిరి ఆంగ్లేయుల పూర్వపు ఉద్యోగుల వలె గాక నిర్దిష్ట నియమాల్ని అనుసరించే ఉద్యోగ వ్యవస్థ కంపెనీ పాలన ప్రత్యేకత.

కంపెనీ పాలనలో జిల్లా సివిలియన్లు, జడ్జీలు మర్చంట్లు, ఫాక్టర్లు, రైటర్లు లేదా వ్యాపార ఏజెంట్లు పాలనా విధులని నిర్వర్తించేవారు. కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు తమ బంధువుల్ని తమ వారిని సివిల్ సర్వెంట్లుగా నియామకం చేసే వీలుని అనుభవించేవారు. ఈ సివిల్ ఉద్యోగాల్ని అమ్మిన సందర్భాలు కూడా ఉన్నాయి.

వారెన్ హేస్టింగ్స్ అధిక జీతాలు గల పదవుల్ని సృష్టించడం వలన పాలనా వ్యయం పెరిగిందే గాని అది సామర్థ్యాన్ని పెంచడం గాని అవినీతి ని నిర్మూలించడం గాని చేయలేదు.

కార్న్‌వాలీస్ సివిల్ సర్వీసుల్ని ఆధునీకరణ చేసేందుకు చర్యలు తీసుకున్నాడు. ఇతడు వారి జీతాల్ని మరింత పెంచాడు. అయితే వారి ఎంపిక, శిక్షణల్లో మాత్రం వృద్ధి పర్చలేదు.

వెల్లస్లీ మొదటి సారిగా సివిల్ సర్వెంట్ల శిక్షణ పై దృష్టి పెట్టాడు. 1800 సం॥ లో కలకత్తా లో ఫోర్టు విలియం కాలేజీ లో వారికి సాహిత్యం, విజ్ఞాన శాస్త్రం, భారతీయ భాషల్లో శిక్షణనిచ్చేందుకు ఏర్పాటు చేశాడు. అయితే దీనికి కోర్టు ఆఫ్ డైరెక్టర్ల ఆమోదం తెలపకపోవడం తో 1854 వరకు అది

కేవలం బెంగాలు సివిలు సర్వీసుల్లో భాషా ప్రాతిపదికగా
మాత్రమే జరిగింది. కంపెనీ 1806 లో హైలీబరీ
నందు ఈస్టు ఇండియా కాలేజీ ని ఏర్పరచి అందులో
వారి నియమింపబడిన యువ ఉద్యోగులకు 2 ఏళ్ళ శిక్షణ
ని ఏర్పాటు / శిక్షణ కార్యక్రమాన్ని నిర్వహించేది.

కంపెనీ సివిలు ఉద్యోగాలు కు
భారతీయులు నియమింపబడేవారు కాదు. అయితే
1833 చార్టరు చట్టం సివిలుసర్వీసుల్లో ప్రవేశానికి
'వర్ణం' అడ్డుగా ఉండరాదని తెలియజేసింది. అయినప్పటికీ
ఆచరణలో మాత్రం భారతీయులెవ్వరూ ఈ ఉద్యోగాలకి
నియమింపబడలేదు. అయితే విక్టోరియా మహారాణి
'మా పాలితులెవరయినా వారి జాతి, వర్ణ, మతాలతో
నిమిత్తం లేకుండా స్వేచ్ఛగా మా సేవలకు నియమింపబడవచ్చు'
నన్న ప్రకటన కూడా కంపెనీ సివిలు సర్వీసుల్ని
ఆంగ్లేయుల సొత్తుగా ఉంచే విధానాల్ని మార్చివే
వేయలేదు. అయితే భారతీయుల్ని ఆకర్షించ
పరిచేందుకు, భారతీయుల సమానత్వాన్ని
అంగీకరిస్తున్నట్లుగా భారతీయుల్ని కూడా

కంపెనీ జిల్లాలో కలెక్టరు, జిల్లాలో మెజిస్ట్రేటు పదవుల్ని సృష్టించింది.

## రెవెన్యూ వసూళ్ల నిర్వహణం :

1765 లో కంపెనీ కి బెంగాలు, బీహారు, ఒరిస్సా లలో రెవెన్యూ వసూలు లేదా "దివాని" అధికారం లభించింది. అయితే 1772 వరకు ఇద్దరు (1) నాయబ్-దివాన్లే ఈ రెవెన్యూ వసూళ్లు చేసేవారు. వసూలైన రెవెన్యూలో నిర్ణయించిన మొత్తాన్ని కంపెనీ బెంగాలు నవాబు కు పాలనావ్యయం కింద ఇచ్చేది. దీన్నే ద్వంద్వపాలన అన్నారు. ఇది కంపెనీ ఉద్యోగులు, నాయబ్-దివాన్లు డబ్బు దండుకునేలా చేసి అటు కంపెనీ ఇటు ప్రజలు నష్టపోయేలా చేయడం తో 1772 లో వారెన్ హేస్టింగ్స్ ఈ పద్ధతి ని రద్దు చేశాడు.

అతడు కంపెనీ నే మొత్తం (2) పాలనకు బాధ్యురాల్ని చేశాడు, నాయబ్-దివాన్ల పదవుల్ని రద్దు చేశాడు. ట్రెజరీ ని కలకత్తా కి చేర్చాడు. రెవెన్యూ వసూళ్ల గవర్నరు-కౌన్సిలు

ప్రత్యక్ష పర్యవేక్షణలో పెట్టబడ్డాయి. వారు "బోర్డ్ ఆఫ్ రెవెన్యూ" గా ఏర్పడ్డారు.

ప్రతి జిల్లా నందు రెవెన్యూ పాలనని చూసేందుకు ఒక కలెక్టరు, ఒక భారతీయ దివాను నియమించబడ్డారు. అయితే ఈ విధానం వల్ల కూడా జమీందార్లు, రైతులు బాధలు పడటం కంపెనీ నష్టపోవటం జరిగింది.

దీంతో 1773 (3) లో కొత్త ప్రయోగం చేశారు. యూరోపియన్ కలెక్టర్ పదవిని రద్దు చేసి ప్రతి జిల్లాలో రెవెన్యూ పాలనని భారతీయ దివాను కిందే ఉంచారు. ఆరు ప్రొవిన్షియల్ కౌన్సిళ్లు ఏర్పాటు చేయబడ్డాయి. అయితే ఈ మార్పు కూడా పరిస్థితుల్ని మెరుగుపర్చలేదు.

దీంతో కంపెనీ మళ్ళీ వ్యాపిస్తూ నిర్ణయాలకి వచ్చింది. 1781 (4) లో ప్రొవిన్షియల్ కౌన్సిళ్లు రద్దు చేయబడ్డాయి. మొత్తం రెవెన్యూ వ్యవహారాన్ని కలకత్తా నందు కేంద్రీకరించబడ్డాయి. యూరోపియన్ కలెక్టర్లు మళ్ళీ నియమించబడ్డప్పటికీ నామమాత్రంగానే మిగిలారు. ఈ పద్ధతి అధిక కేంద్రీకరణ వలన ఆటుపోట్లు నెదుర్కొంది.

(5) 1786 లో వేలం బద్ధ పద్ధతిని

ప్రవేశపెట్టారు. జిల్లాల్ని క్రమ ఆర్థిక విభాగాలు

గా చేశారు. కలెక్టర్ని రెవెన్యూ నిర్ణయించటానికి,

వసూలు చేయటానికి బాధ్యుణ్ని చేశారు. కలెక్టర్స్

ని నియంత్రించటానికి, వారికి సలహాలివ్వడానికి

ఒక బోర్డు ఆఫ్ రెవెన్యూ ని ఏర్పాటు చేశారు.

(6) 1793 లో శాశ్వత శిస్తు నిర్ణయ పద్ధతి

వచ్చి జమీందార్లు భూమియజమానులుగా గుర్తింపబడటం, అందుకోసం నిర్దిష్ట వార్షిక రెవెన్యూ ని ప్రభుత్వానికి చెల్లించేందుకు బాధ్యత వహించటం చేశారు.

మద్రాసు, బొంబాయి ప్రావిన్సుల్లో రైత్వారీ పద్ధతిలో ; వాయువ్య భారతం లో సీడెడ్, ఆక్రమిత ప్రావిన్సుల్లో మహల్వారి పద్ధతిలో రెవెన్యూ వసూలు జరిగేవి.

పోలీసు వ్యవస్థ నిర్మాణం :

పోలీసు వ్యవస్థని ఏర్పాటు చేసినవాడు కార్న్‌వాలిస్. ఇతడు జమీందార్లని వారి పోలీసు విధుల్నించి తప్పించి 'రెగ్యులర్ పోలీసు ఫోర్స్' ని ఏర్పాటు చేశాడు. ఇందుకోసం ఇతడు [illegible]

# Chapter - 4

## * Socio-Cultural impact of Colonial rule *

### "Q" Christian missionary activities

× భారతదేశం లో క్రైస్తవం క్రీ.శ. మొదటి శతాబ్దంలోనే వచ్చినట్లు తెలుస్తుంది. అయితే క్రీ.శ. 1498 లో వాస్కోడిగామా రాకతో నూతన శకం ఆరంభమయింది. పోర్చుగీసువారు క్రైస్తవ మత వ్యాప్తికి వర్తకానికి సమ ప్రాధాన్యమిచ్చిరి. మలబారు తీరంలో సతి, బాల్యవివాహాల్ని నిషేధించారు. క్రైస్తవం తీసుకోని వారిని అరెస్టు చేసి విచారించేంత దాకా వీరు వెళ్ళడంతో స్థానిక రాజులు, ప్రజల చేత వ్యతిరేకించబడ్డారు. తర్వాత వచ్చిన డచ్, ఫ్రెంచ్ వారు వ్యాపారం, రాజకీయాంశాలే గాని మతాన్ని పట్టించుకోలేదు.

పోర్చుగీసు కొమ్మన కాథలిక్ మిషనరీలు ఫ్రాన్సిస్ జేవియర్, రాబర్ట్-డి-నోబిలి మొదలైన వారు ప్రాథమిక విద్య, ముద్రాక్షరాల్లో చెప్పుకోదగ్గ కృషి చేశారు. ×

# క్రైస్తవ మిషనరీల కార్యకలాపాలు

"ఆధునిక భారతీయ మత, సాంఘిక సంస్కరణలు చాలా వరకు క్రైస్తవం విసిరిన సవాళ్లకు స్పందనగా కలిగినవే"

— రోనాల్డ్ స్కాట్
Ronald. W. Scott

క్రైస్తవం దాన్ని అవలంబించేవారి ద్వారా ప్రత్యక్షంగా, పరోక్షంగా హైందవ మత విమర్శ ద్వారా ఆధునిక భారతీయ సంస్కృతికి ఎంతో తోడ్పడింది. క్రైస్తవ మిషనరీల కార్యకలాపాలు మన దేశంలో సాంఘిక సంస్కరణలకి ఎంతో తోడ్పడ్డాయి.

X [తూర్పు ఇండియా కంపెనీ ఒక వ్యాపార వర్తక సంస్థగా క్రైస్తవ వ్యాప్తిని తన విధిగా భావించి మొదట్లో మతబోధకుల్ని నియమించింది. తర్వాత కంపెనీ ఒక సార్వభౌమాధికారిగా మతప్రచారాన్ని ప్రోత్సహించక మిషనరీలు తన భూభాగాల్లో ఏర్పాటు కాకుండా అడ్డుకుంది.] X

క్రైస్తవ మిషనరీల పట్ల కంపెనీ వైఖరి

17, 18 శతాబ్దాల్లో కంపెనీ డైరెక్టర్లు, భారతదేశంలోని అధికారులు వైరుధ్యమైన శైలిలో ఒకసారి మిషనరీ కార్యకలాపాల్ని ప్రోత్సహించటం, ఒకసారి నియంత్రించటం చేశారు.

18 వ శతాబ్దంలో ముఖ్యంగా వర్తకులు, కంపెనీ అధికారులు మొఘలులకు పోర్చుగీసు వారి కోటలపై ఉన్న ద్వేషాన్ని దృష్టిలో పెట్టుకుని తమ లాభాలకు ముప్పు వాటిల్లి కలుగని భయంతో ప్రెసిడెన్సీ నగరాల్లోకి మిషనరీలు
P.గా రాకుండా అనేక ఆటంకాల్ని విధించారు.

అయితే 19 వ శతాబ్దానికి పరిస్థితులు కొంత మారాయి. కంపెనీ తమ రాజకీయంగా భద్రంగానే ఉన్నానని నిర్ణయానికి రావడంతో మతవ్యాప్తిని నిరోధించలేదు. ఇంగ్లాండులో వచ్చిన ఎవేంజెలికల్ ఉద్యమ ప్రభావం కూడా కంపెనీ పై పడింది. దాంతో కంపెనీ ప్రభుత్వం తన తటస్థ విధానాన్ని విడనాడి 1813 చార్టరు చట్టం ద్వారా భారత్‌లో క్రైస్తవ మిషనరీల పై ఉన్న కంపెనీ విధించిన నిషేధాన్ని ఎత్తివేసింది. ఇంగ్లాండు నుంచి మిషనరీలు రావచ్చు, నివసించవచ్చు, బోధించవచ్చు. 1833 చార్టరు చట్టం మరింత ముందుకు వెళ్లి ప్రపంచంలోని అన్ని మిషనరీలకూ ఈ అవకాశాన్ని కల్పించింది.

Activities [ 18 వ శతాబ్దం చివరి రోజుల్లో వచ్చిన బ్రిటీష్ బాప్టిస్ట్ మిషనరీలు జోషువా మార్ష్‌మన్, విలియం కేరీ, విలియం వర్డ్ లు కలకత్తా లో ప్రవేశం లభించక డేనిష్ స్థావరం "సెరాంపూర్" నందు స్థిరపడ్డారు. వీరు విద్య, ముద్రణాయంత్రం, రామాయణ-భారతాల్ని ఆంగ్లంలోకి అనువదించడం, హిందూ సాంఘిక సంస్కరణల కోసం యత్నించడం చేశారు. ] Activities

1854 లో ఉడ్స్ డిస్పాచ్ భారత క్రైస్తవ మిషనరీల చొరవను పెంచాయి. దీని ద్వారా మిషనరీ పాఠశాలలకు, కాలేజీలకు ప్రభుత్వ నిధుల నుంచి ఆర్థిక మద్దతు లభిస్తుందని అధికార ప్రోత్సాహం అందుతుందని హామీ ఇచ్చారు. (assurance)



క్రైస్తవ మిషనరీల ప్రాథమిక లక్ష్యం భారతీయులను క్రైస్తవులుగా మార్చటం. వారేం చేసినా దాని అంతిమ లక్ష్యం అదే. 5

1) క్రైస్తవ మిషనరీలు - హిందూమతం : మిషనరీలు హిందూమతం లోని విగ్రహారాధన మొ॥ దురాచారాలను ఖండించాయి. తద్వ్యతిరేకంగా క్రైస్తవ మత సూత్రాలను, ఆచారాలను పొగడుతూ చెప్పేవారు. ఇది సంప్రదాయ హిందువుల్లో తీవ్ర ప్రతిఘటనను రేకెత్తించినా నిమ్నకులాలు, గిరిజనులు మొ॥ వారిని గెల్చుకోగలిగింది. మిషనరీలు అంటరానితనం, కులవ్యవస్థ లోని లోపాలను ఎండగట్టడం విద్యావంతులైన భారతీయులను ఆకర్షించింది.

ఈ విమర్శలు పరోక్షంగా హిందూమత సంస్కరణోద్యమాలకు దారి తీశాయి.

2) క్రైస్తవ మిషనరీలు - స్త్రీ సంక్షేమం :

[1] మిషనరీలు హైందవ సమాజం లో స్త్రీల పట్ల గల వివక్షతను తీవ్రంగా దుయ్యబట్టారు.

● స్త్రీ శిశుహత్యలు[2], బాల్య వివాహాలు[3], బహు భార్యత్వం[4], సతి[5], బలవంతపు వైధవ్యం[6], మొ॥ వాటిని

మొదటి విశ్వవిద్యాలయం, మొదటి వైద్య పాఠశాల, 7
మొదటి శిక్షణా కళాశాల స్త్రీల కోసం వెలిశాయి. నాటి
భారతదేశ స్త్రీలకు అవసరమైన టీచర్లు, డాక్టర్లు,
నర్సులు ఈ మూడు అవసరాల్నీ క్రైస్తవ మహిళలతో
నెరవేర్చారు.

1940 నాటికి దేశం మూడు మాత్రమే
మహిళా "colleges" కళాశాలలు దేశంలో ఉన్నాయి. అవి
ఇసబెల్లా థోబర్న్ కళాశాల, లక్నో; ఉమెన్స్ క్రిస్టియన్
కళాశాల, మద్రాసు; ది కిన్నైర్డ్ కళాశాల, లాహోర్.

కళాశాలల్లో వలె వైద్యశాలల్లో కూడా
మిషనరీల సేవ గణనీయమైనదే. 1940 లో 180
ఉన్న మొత్తం మహిళా వైద్యశాలల్లో 96 మిషనరీలవే.
వెల్లూర్, లూధియానా లలో రెండు వైద్య కళాశాలలు
కేవలం మహిళల కోసమే వెలిశాయి. 1916 లో ఢిల్లీ లో
'లేడీ హార్డింజ్ మెడికల్ కాలేజీ' స్థాపించారు.
1947 కి ముందు నర్సు వృత్తి దాదాపు క్రైస్తవుల వృత్తి
గా మాత్రమే ఉండేది.

3) మిథునాలు - కులవ్యవస్థ పై విమర్శ:

కులవ్యవస్థ లోని కాఠిన్యాన్ని, అంటరానితనాన్ని మిథునాలు చూపెట్టాయి. ఆర్థికంగా నిమ్నవర్గాల వారు మతం మార్పిడి ఏ మాత్రం జరిగినా ఈ విమర్శ ప్రధానంగా కుల మత-సాంఘిక సంస్కర్తల దృష్టిని ఈ సమస్యలపై కేంద్రీకరింపచేసింది.

మిథునాలు కథలలో వారి మతమార్పిడి చేసినందుకు యింకా విఫలమై నిమ్నవర్గాలు, అంటరాని వారిపై దృష్టి పెట్టారు. క్రైస్తవం లోనున్న అంటరానివారు సాంఘిక హోదా పెంచుకోవడమే గాక ఎంతమంది విధానాల విషయాలలో ఎదుర్కొనవలసిన అవసరం లేదు. పైగా వారికి మిషనరీ పాఠశాలల్లో విద్య, సాధారణంగా ఉద్యోగం లభించేవి. మతం మార్పిడి వారికి మార్పులేని అంటరానివారికి మధ్య తేడా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇది ఆ వర్గాల్లో చైతన్యానికి కారణమై వారు తమ ఉద్ధరణకు తామే ఉద్యమాలు చేయడానికి కారణమైంది.

4) మిషనరీలు – గిరిజనులు :

మిషనరీలు నిర్లక్ష్యం చేయబడిన దక్షిణ బీహారులోని సంథాలులు, మధ్యప్రదేశ్‌లోని మరియు గోండ్లు, గారో కొండల్లోని అసంఖ్యాక గిరిజన తెగలు ఇలా ఈశాన్య రాష్ట్రాల్లోని పలువురు గిరిజనుల కోసం విస్తృతంగా కృషి చేశారు. ఫలితం గా మతమార్పిడులు బాగానే జరిగాయి.

5) మిషనరీలు – విద్య :

మిషనరీలు విద్య, సాంస్కృతికాభివృద్ధి కి ఎంతో తోడ్పడ్డారు. వారి విద్యాసంస్థలు అవగాహనలో కొత్త చైతన్యాన్ని, సమాజ జీవితం పై ప్రోత్సాహక దృక్పథాన్ని, విలువల పై యువతరానికి ప్రోత్సాహాన్ని అందించాయి. డా॥ విలియం మిల్లర్, మద్రాసు క్రైస్తవ కళాశాల ; సి.యఫ్. ఆండ్రూస్, సెయింట్ స్టీఫెన్ కాలేజి ఇలా మరెందరో వ్యక్తులు దేశవ్యాప్తంగా ఎన్నో విద్యార్థి తరాలను చదివించటమే గాక తమ సేవాతత్పరత చే వారిని ప్రభావితుల్ని చేసి తద్వారా ఆ విద్యార్థులు తమను లాగు దేశసేవ కు అంకితమయ్యేలా చేశారు.

బాప్టిస్టు మిషనరీలైన కేరీ, మార్ష్‌మన్, వర్డ్ మొదలైన వారు శ్రీరాంపూర్ లో గల

విద్యార్థుల కోసం విస్తారంగా కృషి చేశారు. వారు ప్రభుత్వం క్రమంగా ముద్రణాలయాన్ని నెలకొల్పి 26 ప్రాంతీయ భాషల్లో బైబిలు ను ముద్రించారు. అంతేగాక పాఠశాలల కోసం పాఠ్యపుస్తకాల్ని, పలురకాల గ్రంథాల్ని ప్రచురించారు.

సెరాంపూర్ మిషనరీలు 1800 A.D. లో బెంగాలీ భాషలో బెంగాలీ బోధనల కోసం పాఠశాల తెరిచారు. కలకత్తా లో 1810 లో బెనెవలెంట్ సంస్థ స్థాపన కు ఆర్థిక సాయం చేశారు. వీరు 1816 లో భారతీయ పాఠశాలల్ని ప్రోత్సహించేందుకు ఒక సంస్థ నెలకొల్పారు.

మిషనరీలు నిఘంటువుల్ని, వ్యాకరణ గ్రంథాల్ని ముద్రించి భారతీయ భాషలకు ఎనలేని సేవ చేశారు. ఉదాహరణకు బెంగాలీ వ్యాకరణాన్ని కేరీ, ఏట్స్; హిందీ నిఘంటువుని థామ్సన్, ఆడమ్సులు; మలయాళం నిఘంటువు, వ్యాకరణాన్ని బెయిలీ మొ॥ వారు ముద్రించారు. 1850 నాటికి మిషనరీల దేశవ్యాప్తంగా 25 ముద్రణాలయాలున్నాయి.

విద్యాసంస్థల్ని కూడా మిషనరీలు విస్తారంగా ప్రోత్సహించారు. 1850 నాటికి

మిషనరీల విద్యాశాలల్లో 83,700 మంది బాలురు 11

చదువుకుంటున్నారు - ప్రాంతీయ భాషల్లో. ఈ దేశీయ

పాఠశాలలే గాక కొన్ని బోర్డింగ్ స్కూల్సు కూడా ఉండేవి.

వీటిలో మరో 14,000 మంది బాలురు ఆంగ్ల మాధ్యమం

లో చదువుకునేవారు. ఇక బాలికల విషయానికొస్తే

1850 నాటికి దేశీయ పాఠశాలల్లో 11,500 మంది

బోర్డింగ్ స్కూల్సులో 2,450 మంది బాలికలు చదువుకునేవారు.

X 1793 లో చార్లెస్ గ్రాంట్ దేశీయ ప్రజల నైతిక, మత ఉద్ధరణకు లండన్ బిషప్ చే మిషనరీలను పంపి ఉద్యోగాలలో భారతీయ ప్రాంతాల్లో నియమించాలని కోరగా దాన్ని కంపెనీ యాజమాన్యం నిరాకరించింది.

6) మిషనరీలు - సాంఘిక సంక్షేమం & సంస్కరణలు:

(1) భారతీయ సంస్కర్తలు పాశ్చాత్య విజ్ఞానాన్ని ఆహ్వానించి మానవతావాదాన్ని పెంచి సాంప్రదాయ విద్యని వ్యతిరేకించినప్పుడు మిషనరీలు విమర్శలు దోహదం చేశారు.

మిషనరీల సంఘసంస్కరణ మరియు మతమార్పిడికి ప్రాధాన్యమిచ్చారు ఉదా: సతీ

7) మిషనరీలు - పత్రికలు : వార్తా పత్రికల చరిత్ర
వాస్తవంగా 1818 నుండి మొదలైందని చెప్పవచ్చు.
సెరాంపూర్ క్రైస్తవ మిషనరీలు 1818 లో "దిగ్దర్శన్"
అనే మాస పత్రికను ఏప్రిల్ 1818, మే లో Samachar Darpan
"సమాచార్ దర్పణ్" అనే బెంగాలీ వార్తా పత్రికను
స్థాపించారు. 1851 వరకూ సాగిన బెంగాలీ పత్రికల
వారు మతాలు, సంఘ సంస్కరణల, పాశ్చాత్య విజ్ఞాన
వ్యాప్తికి ప్రాధాన్యం కల్పించారు. రాజకీయాల
ప్రమేయం అతి స్వల్పంగా ఉండేది. క్రైస్తవ మత వ్యాప్తి
వారి లక్ష్యం.

అ)

8) మిషనరీలు - ప్రత్యక్ష మత ప్రచారం :
1790 - 1840 ల మధ్య మిషనరీలు
పాశ్చాత్య పద్ధతిలో విద్యాబోధన ద్వారా హిందూ మతంపై
తీవ్రంగా విరుచుకుపడ్డారు. బైబిలు బోధన,
వీధుల్లో గ్రామాల్లో మత బోధనా నిర్వహణ నిత్యకృత్య
-మయ్యింది. ఈ కాలం లోనే మత బోధకులకు తర్ఫీదు ఇచ్చేందుకు, గొప్ప మిషనరీ కళాశాలలు
వెలిశాయి. కలకత్తా దగ్గర బిషప్స్ కాలేజి,
విల్సన్ కాలేజి, S.P.G. కాలేజి → తిరుచినాపల్లి నందు
వాటిలో ముఖ్యమైనవి. 1851 నాటికి దేశంలో

91,000 మంది ప్రొటెస్టెంటు క్రైస్తవులుగా మొత్తం

ఈవి వర్గాల వారూ కలిపి 2 లక్షల మంది క్రైస్తవులు

ఉన్నారు. మిషనరీల మత ప్రచార ఫలితంగా 1881

లో కేవలం 0.7% క్రైస్తవులు మాత్రమే

మొత్తం జనాభా లో ఉండగా 1931 నాటికి

ఆరు మిలియన్ల క్రైస్తవులు నాటి జనాభా లో 2%

వై ఆక్రమించారు.

మిషనరీలు స్కూల్స్, కాలేజీలు

కూడా తమ మత ప్రచారాన్ని కొనసాగించాయి.

అయితే అవి అంతగా ఫలితాన్ని ఇవ్వలేదు. హిందూ

మతం లో కూడా మిషనరీల వ్యతిరేక మత ప్రచార,

మత మార్పిడుల ఫలితంగా మతానికి ముప్పు

వచ్చేంతటి పరిస్థితులు ఎప్పుడూ చోటు చేసుకోలేదు.

→ మిలటరీ కంటోన్మెంటులలో విరివిగా మత ప్రచారం చేసేవి.

9) మిషనరీలు – సాంఘిక చట్టాలు:

1829 లో విలియం బెంటింక్

సతీసహగమనాన్ని నిషేధిస్తూ చేసిన చట్టం మీద

మిషనరీల ప్రచార ప్రభావం ఉంది.

1832 బెంగాల్ నిబంధన కింద

క్రైస్తవులుగా వారు మతం మార్చుకున్నవారికి ఆస్తి

సంక్రమణ అధికార హక్కుల్లో మార్పులుండవని శాసించారు.

1850 లో "Caste Disabilities Removal Act" ద్వారా మతం మార్చుకున్న వారికి, క్రైస్తవం స్వీకరించిన వారికి పౌరహక్కులు ఆస్తిహక్కులు ఏ మార్పు లేకుండా చెందుతాయని శాసనం చేసింది.

ఈ శాసనాల వెనుక మిషనరీల ప్రభావం ఉండడమే గాక ఈ శాసనాల తర్వాత మిషనరీలు తమ కార్యక్రమాల్ని మరింత విశృంఖలంగా సాగించు కొనసాగడాన్ని గమనించవచ్చు.

1857 తిరుగుబాటు తర్వాత మిషనరీల కార్యకలాపాలు పరిమితం చేయబడ్డాయి, నియంత్రించ బడ్డాయి. 19 వ శతాబ్దంలోని భారత పునరుజ్జీవనోద్యమం కూడా క్రైస్తవ మిషనరీల కార్యకలాపాలు సన్నగిల్లడానికి దోహదం చేసింది.

ఏదేమైనప్పటికీ క్రైస్తవ మిషనరీల సేవానిరతి, సేవకు వారు చూపిన అంకితభావం ఆధునిక భారత హిందూమత సంస్కర్తలు, సంస్కరణా సంస్థలకి మిషనరీలను మార్గదర్శకుల్ని చేశాయి.

10.7.03 Official Social reform measures [1828-57] 17

## అధికారిక సాంఘిక సంస్కరణా చర్యలు

ఆంగ్లేయులు మొదట భారతీయ సాంఘిక - మత వ్యవస్థ పట్ల పూర్తి తటస్థంగా వ్యవహరించారు. కానీ తర్వాత కాలం లో ఇంగ్లాండులో బెంథమ్ వాదం[1], మానవతావాదాల[2] ప్రభావం పెరగడం, పాశ్చాత్య విజ్ఞానం చే ప్రభావితులైన ఆధునిక భారతీయ విద్యావంతులు[3] సంస్కరణల కోసం డిమాండు చేయడం మొ|| కారణాలచే ఆంగ్ల కంపెనీ ప్రభుత్వం సాంఘిక సంస్కరణలపై చర్యలు చేపట్టింది. అందులో ముఖ్యమైనవి...

1) సతీ నిషేధం:

మరణానంతరం జీవితం ఉంటుందని చనిపోయిన భర్త కి పరలోక జీవితం లో కూడా తోడు కావాలని భర్త చితి పై బతికి ఉన్న భార్యని సజీవ దహనం చేసే హేయమైన దురాచారమే సతి. ఈ దురాచారం వెనుక మత సమ్మతం కంటే ఆమెకి చెందే ఆస్తి దండుకోవాలనే కాంక్ష బలంగా ఉండేది.

సతి నిషేధక ముసాయిదా

భారతంలో (1) కలకత్తా సుప్రీంకోర్టు, సెరాంపూర్ డేనిషులు, చిన్సురా డచ్చులు, చంద్రనాగర్ ఫ్రెంచివారు తమ ప్రాంతాల్లో సతి ని నిషేధించారు, 18 వ శతాబ్దం చివరి కాలం నాటికి.

అయినా సతి కేసులు ఉధృతం అవుతుంటే ప్రభుత్వం రంగంలోకి దిగింది. 1812 (2) లో భార్యపై విషప్రయోగం, మత్తుమందు ఇవ్వటం తదితరాల ద్వారా ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా సతి చేయటం పై నిషేధం విధించింది. 1815 (3), 1817 (4) లలో మరో రెండు నిబంధనల్ని విడుదల చేసింది. ఫలితంగా సతి చేయటానికి ముందు మేజిస్ట్రేటు కు గాని, ప్రధాన పోలీసు అధికారి గాని తెలియబర్చి వారి నుండి అది స్వచ్ఛందంగా చేస్తున్నదేనని ధృవీకరణ పొందాలి. సతి చేసే స్త్రీ 16 సం॥ లోపు బాలిక, గర్భవతి, పసిపిల్లల తల్లి కారాదు. స్త్రీని బలవంతంగా సతి చేయించటం నేరముగా చేయబడింది.

కార్న్‌వాలీసు, మింటో, లార్డ్ హేస్టింగ్సు పైన చెప్పినట్లు ఈ సతి నిరోధానికి కొన్ని చర్యలు (5) చేసినారు. ఇంతేగాక సతి చేస్తున్నపుడు అక్కడ తప్పనిసరిగా

పోలీసు అధికారులు ఉండాలని వారు బలవంతంగా పెట్టకుండా పర్యవేక్షణ చేస్తారని ప్రభుత్వం ఉత్తర్వు ఇచ్చింది.

అయితే ఈ చర్యల వల్ల సతి ఆగలేదు.

కాని ఇంకా ముందుకు పోవడానికి ప్రభుత్వం జంకి విద్యావంతులు అయితే వారే తెలుసుకుంటారని భావించింది. ఒక్క 1815-17 ల మధ్య బెంగాల్లో 864 కేసులు అందులో భాగంలో 663 కేసులు నమోదయ్యాయి.

సంప్రదాయ భారతీయులు ప్రభుత్వ జోక్యాన్ని గర్హించారు. (రామ్మోహన్ రాయ్ మాత్రం సతి నిషేధానికి అవిరళ కృషి జరిపాడు. సతి శాస్త్ర సమ్మతం కాదని నిరూపించాడు.) 1818, 1820 లలో "A Conference between an Advocate for and an Opponent of the Practice of Burning Widows Alive" అనే రచనని ముద్రించాడు. 1822 లో తన 'సంబంధ కౌముది' లో "Brief Remarks regarding Modern Encroachments on the Ancient Rights of Females" అనే వ్యాసాన్ని ప్రచురించాడు; సతి ని ఒక్క విధానం వ్యతిరేకించాడు.

(6)

(ఈ సమయంలో ప్రభుత్వం 1823

లని లార్డు ఆమ్హర్స్టు చనిపోయిన భర్తతో భార్యని తగులబెట్టటం నేరంగా ప్రకటించాడు. సతి చేయబడ్డ స్త్రీల తరఫువారు ఆమె వ్యక్తిగతంగా మేజిస్ట్రేటు నుండి అనుమతి తెచ్చుకోవాలని శాసనం చేశారు. పైగా సతి చేయబడిన కుటుంబానికి ప్రభుత్వోద్యోగాలు ఉండవని; సతి చేసిన స్త్రీ - ఆమె భర్తల ధనం ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది, అని శాసనం చేశారు.

(అయితే పూర్తి స్థాయిలో 'సతి' ని నిషేధించింది మాత్రం విలియం బెంటింక్.) అతడు పలువురు సైనిక అధికార్లు, నిజామత్ అదాలత్ న్యాయాధిపతులు, ప్రావిన్సుల పోలీసు అధికారులని సంప్రదించి తిరుగుబాటు ప్రమాదం లేదని నిర్ధారించుకొని తన సంస్కరణోద్యమ నేపథ్యంలో డిసెంబరు, 4, 1829 న (7) రెగ్యులేషన్ XVII ద్వారా 'సతి' ని అనగా భార్యని సజీవంగా భర్తతో పాటు దహనం లేదా ఖననం చేయుటాన్ని చట్టవ్యతిరేకంగా, న్యాయస్థానాల చే శిక్షార్హమైన నేరంగా, హత్యగా శాసనం చేశారు.

(*) 1856-57 లో [illegible]

ఈ 1829 రెగ్యులేషన్ మొదట కేవలం బెంగాలు కే చెల్లుతుంది. 1830 లో బొంబాయి, మద్రాసుల్లో ఇలాంటి చట్టాన్నే చేశారు.

అతి సాంప్రదాయ భారతీయులు రాజా రాధాకాంత దేవ్, గోకులనాథ్ మాలిక్, రాంగోపాల్ మాలిక్ మొ|| వారు "సమాచార చంద్రిక" ఆధారంగా పత్రికలు సతీ నిషేధం పై ఆగ్రహించారు. వీరు మొదట గవర్నరునకు తర్వాత ప్రీవీ కౌన్సిలుకు పిటిషన్ సమర్పించారు. అయితే రామ్మోహనరాయ్ వీరికి వ్యతిరేకంగా 1830 లో "The abstract of the Arguments regarding the Burning of Widows considered as a Religious Rite" అనే రచనని విడుదల చేసి ప్రీవీ-కౌన్సిలు నందు కౌంటర్-పిటిషన్ వేసి సతీ దురాచారానికి వేదములు, ఉపనిషత్తుల వల్ల మొ|| గ్రంథములు గాని సమ్మతం తెలుపలేదని రుజువు చేసి గెల్చాడు. దాంతో సతీ దురాచారం శాశ్వతంగా చరమగీతం పాడ-నట్లయ్యింది.

(x) 1856-57 లో కలకత్తా క్రైస్తవ మిషనరీల సమావేశంలో భారత్ లో బాల్య వివాహాలు నిషేధించడం మొ|| ప్రాచీన ఆచారాల నిర్మూలనకై చట్టాలు చేయాలని ప్రభుత్వాన్ని కోరారు.

2) బాలికా శిశు హత్యలు / (స్త్రీ) శిశు హత్యలు :

కథియవార్, రాజ్‌పుటానా, యునైటెడ్ ప్రావిన్స్, మేవార్; పంజాబు లాంటి చోట్ల, ప్రాంతాలు, జాట్ల లో వరకట్న దురాచారం, వారు - తల్లిదండ్రులు పెళ్లి ఖర్చులు భరించలేక ఆడపిల్లల్ని పుట్టగానే చంపే దురాచారం ప్రబలింది.

దీన్ని నిషేధిస్తూ ప్రభుత్వం 1795 లో బెంగాల్ రెగ్యులేషన్ XXI ను, 1804 లో రెగ్యులేషన్ III ను చేసింది. అయినా ఈ అమానుష దురాచారం ఆగలేదు. కేసుల్ని గుర్తించడం లో ఉన్న ఇబ్బందులు, కష్టం కారణం గా ప్రభుత్వ చర్యలు ఫలించలేదు. జోనాథన్ డంకన్ దీని అరికట్టేందుకు విస్తృతంగా కృషి చేశారు.

1870 లో (Act VIII of 1870) ⊗ ఈ విషయం పై ప్రత్యేక శాసనాన్ని చేశారు.

ఆ తరువాత కాలంలో శాసనం ఫలితాల వల్ల, విద్యావంతులైన భారతీయుల ఒత్తిడి వల్ల

ఆధునిక భావాల ప్రాప్తి వల్ల సంప్రదాయబద్ధమైన
సడలింపుల వల్ల మొత్తం మీద ఈ దురాచారం
తగ్గుముఖం పట్టింది.

1870 చట్టం ప్రకారం జననాలను తప్పనిసరిగా రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. ప్రభుత్వం ఈ దురాచారం ప్రబలిన ప్రాంతాల్లో స్త్రీ శిశువుల్ని పుట్టిన తర్వాత కొంత కాలం పర్యవేక్షిస్తుంది / బతికుందీ లేనిదీ గమనిస్తుంది.

3) వితంతు వివాహాలు:

సతి నిషేధం వల్ల దేశంలో వితంతువుల సంఖ్య గణనీయంగా పెరిగింది. అయితే వారు జీవచ్ఛవాల్లా అత్తింటి వారికి పుట్టింటి వారికి చాకిరీ చేస్తూ జీవించేవారు. వారి ఆహార వేషాల్పై నిషేధాలుండేవి. భౌతిక సుఖాలన్నీ బలవంతంగా త్యజించి చాకిరీ & అతిహీనమైన దయనీయ బతుకు బతుకుతున్న వితంతువుల ఉద్ధరణకై పలువురు కృషి చేశారు.

కలకత్తా పత్రికలు, ప్రముఖులు స్త్రీ విద్య వితంతు ఉద్ధరణ కోసం కృషి చేశారు. బెంటింక్ ప్రభుత్వం అధికారులు, పండితుల అభిప్రాయం తెలుసుకొనేందుకు

ఈ విషయం పై విచారణ నిర్వహించింది.
ప్రభుత్వం ఇలా చర్యలు తీసుకుంటున్న ఈ సమయంలో ఈశ్వర చంద్ర విద్యాసాగర వితంతు వివాహాల కోసం ఎన్నో సంపాదకీయాలు, రచనలు రాశారు. వితంతు వివాహాల్ని సమర్థిస్తూ 987 మంది సంతకాలు చేసిన పిటిషన్ ను భారత ప్రభుత్వానికి అందించారు. అయితే దీని కెదురుగా సంప్రదాయ వర్గం వారు 36,763 మంది సంతకాలు చేసిన పిటిషన్ ను సమర్పించారు. సంప్రదాయుల నాయకుడు రాధాకాంత దేబ్ బహిరంగ వాగ్యుద్ధం నిర్వహించగా ఇందులో విద్యాసాగర్ తన శాస్త్ర పారంగత్వం లో వితంతు వివాహాలు శాస్త్ర సమ్మతమేనని నిరూపించారు.

విద్యాసాగర ఈ అంశం పై దాదాపు మొత్తంగా 5191 మంది సంతకాలు చేసిన పిటిషన్ ను భారత శాసనసభ కు సమర్పించాడు.

ప్రభుత్వం 1855 లో వితంతు వివాహాల పై చట్టబద్ధ చేయదాన్ని ఉద్దేశిస్తూ బిల్లు ప్రవేశపెట్టింది. ఈ బిల్లు ను వ్యతిరేకిస్తూ 40 పిటిషన్లు (55,748 మంది సంతకాలతో)

రాగా బిల్లు ను సమర్థిస్తూ 25 వేలమంది (5000 సంతకాలతో) పెట్టారు. చివరకు ప్రభుత్వం 1856 లో "The Hindu Widows Remarriage Act XV" ను చేయడం లో సంస్కర్తలు సాఫల్యపడింది.

విద్యాసాగరుడే తొలి వితంతు వివాహాన్ని జరిపించాడు.

4) బాలహత్యల నిర్మూలన:

భారతదేశం లో బానిసల సంఖ్య 1841 నాటికి 8 నుంచి 9 మిలియన్లు దాకా ఉండేది అయినా. వారి స్థితి దయనీయంగా ఉండేది.

వారెన్ హేస్టింగ్స్ 1774 లో పిల్లల్ని దొంగతనం చేసి వారిని బానిసలు గా అమ్మడాన్ని నిషేధిస్తూ రెగ్యులేషన్ చేశాడు. ఇదంత ప్రయోజనాన్నివ్వలేదు.

కార్న్‌వాలిస్ 1789 లో భారతదేశం నుంచి బానిసల్ని ఎగుమతి చేయడాన్ని నిషేధించాడు. 1790 లో దాదాపు ఇదే నియమాలతో మద్రాసు ప్రభుత్వం కూడా శాసనాన్ని చేసింది. 1811 లో విదేశాల నుంచి బానిసల ను దిగుమతి చేయడాన్ని నిషేధించారు. చార్లెస్ మెట్కాఫ్ ఢిల్లీ లో ఉన్నప్పుడు (1811–14)

ఢిల్లీ-దాని పరిసర ప్రాంతాల్లో బానిసల అమ్మకాన్ని నిషేధించాడు.

1832 లో బానిసల్ని ఒక జిల్లా నుంచి మరొక జిల్లాలోకి రవాణా చెయ్యడం శిక్షార్హమైన నేరంగా చేశారు. అయితే అంతర్గత బానిస వ్యాపారాన్ని మాత్రం ఆపలేదు.

అయితే 1843 చట్టం ద్వారా బానిసత్వాన్ని చట్టబద్ధత లోపింపచేశారు. కోర్టులు సివిలు కోర్టులు బానిసత్వాన్ని Cognizance తీసుకోలేవని చెప్పడంలో పరోక్షంగా నిషేధం విధించినట్లయ్యింది. 1860 లో బానిసత్వం అన్ని రూపాల్లోనూ ఇండియన్ పీనల్ కోడ్, 1860 కింద నేరంగా చేర్చబడింది.

బానిసత్వ నిషేధ విషయంలో భారత ప్రజా ప్రముఖుల్ని మద్దతు అందించింది. మరో విశేషమేమిటంటే ఈ చట్టం వల్ల నష్టపోయిన వారు కూడా ఎట్టి ప్రతిఘటన చూపకపోవడం.

5) క్రూర ఆచారాల నిర్మూలన: ఉత్తర భారతంలో ముఖ్యంగా కలకత్తా ప్రాంతంలో చరక్ పూజా ఉత్సవంలో ప్రజలు కొక్కేనికి ఊయల

ఊగడం వంటి క్రూర ఆచారాలు పాటించేవారు. 1856-57 లో కలకత్తా మిషనరీ సమావేశంలో ప్రభుత్వం ఇట్టి క్రూర ఆచారాల నిర్మూలనకై చర్య తీసుకోవాలని కోరారు. ఫలితంగా 1865 లో సివిల్ బోర్డు ఒక తీర్మానం చేసి మేజిస్ట్రేట్లందరికీ బహిరంగంగా జరిగే కొక్కెపు వేలాడం వంటి ఆత్మహింసను ని అందుకు ప్రోత్సహించేవారిని నిరోధించమని ఆజ్ఞలు జారీ చేశారు.

6) బాల్య వివాహాల నిషేధం : Not in this period

6) బహుభార్యాత్వ నిషేధానికి కృషి:

18, 19 శతాబ్దాల్లో బెంగాలులోని కులీనుల్లో ఈ దురాచారం అధికంగా ఉండేది. ఒకే వ్యక్తి దాదాపు 100 వందల మందిని వివాహం చేసుకోవడం లో స్త్రీలు పుట్టింట్లోనే మిగిలి పోవడమో, అనురాగం లేక నిస్సారంగా బతకడమో జరిగేది.

ఈ దురాచారాన్ని వ్యతిరేకిస్తూ బుర్ద్వాన్ మహారాజు 21వేల మంది కాపీలు ఒ పిటిషన్ సమర్పించాడు. ల్యూటినెంట్ గవర్నరు ఈ

వివాహం పై బాల్య ప్రభావం పడలేదని చెప్పాడు.
అలాగే 1857 తిరుగుబాటు లో ఈ చక్రవర్తులు
సృష్టి చేశారు.

విద్యాసాగర్ ఈ దురాచారాన్ని ప్రతిఘటించడానికి ఉద్యమం చేపట్టి కృషి చేశాడు.
అలాగే బంకించంద్ర చటర్జీ వారు మాత్రం ఈ దురాచారాన్ని చట్టం ద్వారా నిర్మూలించడాన్ని ప్రతిఘటించాడు. బంకిం దృష్టిలో విద్యావ్యాప్తి, ఆర్థిక కారణాల ద్వారా ఈ దురాచారాన్ని నిర్మూలిస్తాయి.

7) శిశుబలి నిర్మూలన:

బెంగాలు ప్రాంతంలో పిల్లలు లేని స్త్రీలు తమకు సంతానం కలిగితే మొదటి కాన్పు అధికంగా పిల్లలు కలిగితే ఒకరి గంగాదేవికి బలి ఇస్తామని మొక్కుకునేవారు.

ఈ దురాచారాన్ని బెంగాలు రెగ్యులేషన్ VI ద్వారా 1802 లో నిషేధించారు.

8) థగ్గుల అణచివేత:

థగ్గులు దేశవ్యాప్తంగా కట్టుదిట్టమైన వ్యవస్థగా ఏర్పడిన బందిపోటు ముఠాలు. వీరిలో హిందూ-ముస్లింలు ఇరువురూ ఉండేవారు. వీరు కాళీ/భవాని/దుర్గ దేవతారాధకులు. అమాయకులైన బాటసారులను చిన్న తాడు సాయంతో ఊపిరి నొక్కి చంపేవారు, ఈ హత్యలను దేవతా బలులుగా తలచేవారు.

థగ్గుల అణచివేత విషయంలో దేశం అంతా ఏకరూపంపై ప్రభుత్వానికి మద్దతునిచ్చింది.

1830 లో విలియం బెంటింక్ థగ్గుల అణచివేతకై విలియం స్లీమెన్ ను ప్రత్యేకాధికారిగా నియమించాడు. ప్రభుత్వం సంస్థానాధీశుల సహకారం కూడా తీసుకుంది. స్లీమెన్ (1500) 3000 లకు పైగా థగ్గులను పట్టుకొని వారికి మరణశిక్ష, యావజ్జీవ కారాగారము విధించారు. 1837 నాటికి థగ్గులు ఒక వ్యవస్థ గా అంతరించారు..

9) నరబలుల నిషేధం:

నరబలులు ఒరిస్సాలోని ఖోండుల్లోను, మద్రాసు ప్రెసిడెన్సీలోని కొన్ని భాగాల్లోను ఆచారంగా ఉండేది.. నరబలుల ద్వారా భూసారం పెరుగుతుందని నమ్మేవారు. నరబలుల నిర్మూలన భాగంలో

కంపెనీ ప్రభుత్వం చేపట్టిన మహాల్వారీ చర్య. 1836 లో రస్సెల్ అనే అధికారి మద్రాసు ప్రభుత్వ దృష్టికి ఈ విషయాన్ని తెచ్చాడు. ప్రభుత్వం ఇది పరిగణనలోనికి తీసుకొని వాలంటరీగా మానుకొమ్మని ప్రోత్సహించింది.

అయినప్పటికీ విశాఖపట్నంకి కలెక్టరుగా ఉన్న అర్బుత్‌నాట్; గంజాం మెజిస్ట్రేటు బన్నెర్‌మన్; పర్వత సర్వే శాఖకి కెప్టెన్ మిల్లర్ మొదలైనవారు ఈ దురాచార నిర్మూలనకి కృషి చేశారు.

చివరికి మొదటి లార్డ్ హార్డింజ్ కాలంలో ప్రభుత్వం నరబలుల నిషేధ శాసనం చేసింది. అయితే ఈ దురాచారాన్ని ఆచరణలో నిర్మూలించింది మాత్రం క్యాంప్‌బెల్ కృషి మాత్రమే. 1847 - 54 ల మధ్య నరబలుల నిర్మూలన కోసమే ప్రత్యేకంగా అధికారుల్ని నియమించడం మంచి ఫలితాల్ని ఇచ్చింది.

విలియం బెంటింక్ బెంగాలు లో సాగర ద్వీపం లో ప్రత్యేక సందర్భాల్లో

పిల్లల్ని బలి ఇచ్చే మూఢాచారానికి స్వస్తి చెప్పాలనిపించి గా నిషేధాన్ని జారీ చేశాడు.

10) వారసత్వపు హక్కు పరిరక్షణ:

1850 లో ప్రభుత్వం "Caste Disabilities Removal Act" ను చేసింది. దీని ప్రకారం మతం మార్చుకున్న వ్యక్తి మునుపటిలా గానే తన ఆస్తి వారసత్వ హక్కును కలిగి ఉంటాడు.

ఈ చట్టం ద్వారా భారతీయులకు పౌర హక్కులు లౌకిక ప్రాతిపదికన అందరికీ అందే అవకాశం లభించింది. అయితే ఇది మతమార్పిడిని ప్రోత్సహించేందుకు ప్రభుత్వం చేసిన కుట్ర అని పలువురు హిందువులు తీవ్రంగా విమర్శించారు.

ముఖ్యమైన ఈ సంస్కరణలతో పాటు 1833 లో బోర్డ్ ఆఫ్ కంట్రోలు ప్రెసిడెంటు యాత్రా పన్ను (Pilgrim tax) యాత్రలపై పన్ను రద్దుకు, దేవాలయ సంస్థల ప్రభుత్వ నియంత్రణ నుంచి తొలగించేందుకు మొదట ఆదేశాలు ఇవ్వడం లార్డ్ ఆక్లాండ్

వారికి మేలు చేయడం జరిగాయి.

~~ఈ~~ విధంగా కంపెనీ పాలనలో

హిందూ సంస్కరణల కోసం ఆచరణాత్మక కృషి జరిగి

భారత సమాజానికి ఎంతో మేలు జరిగింది.

(x) బహుశా ఈ వ్యవసాయ వ్యాపారీకరణ తోటల పెంపకం విషయంలో ఉత్కృష్ట స్థితిని పొందిందని చెప్పవచ్చు. తేయాకు, కాఫీ, రబ్బరు, నీలిమందు తోటలు దాదాపుగా పూర్తి ఎగుమతుల కోసమే పండించేవారు.

Imp. example question: Bring out the pattern of Commercialization of agriculture in the 19th century. Was it a forced process for the vast majority of poorer peasants? 35

వ్యవసాయం వ్యాపారీకరణ

Ans: బ్రిటీషువారు & మూడు దశలు

పాలించిన విదేశీయులందరూ మన దేశంలో మన ఆర్థిక వ్యవస్థలో ఇమిడి పోవడం చేత ఎట్టి మార్పులూ సంభవించలేదు. కాని బ్రిటీషువారు మన ఆర్థిక విధానాన్ని వారి ఆర్థిక అవసరాలకు లోబడి ఉండేలా చేసి అనేక మార్పులకు కారణమయ్యారు. ఆ మార్పుల్లో ముఖ్యమయినవి చేతివృత్తులు నాశనమవడం, గ్రామ స్వయం సంపూర్ణత దెబ్బతినడం, వ్యవసాయం వ్యాపారీకరణ పొందడం, గ్రామాలు అప్పులపాలవడం మొదలయినవి.

బ్రిటిష్ వలస పాలనా కాలంలోని 3 దశలు - ~~[illegible]~~ వర్తక యుగం (1757-1813),

స్వేచ్ఛా వాణిజ్య యుగం (1813-1860),

ఫైనాన్స్ సామ్రాజ్యవాద యుగం (1860-1947) లేదా

వర్తక దశ

స్వేచ్ఛా వ్యాపార దశ

మూలధన పెట్టుబడి దశ లలో ఈ

ఈ వ్యవసాయ వ్యాపారీకరణ అన్నది రెండవ దశ అయిన వాణిజ్య వ్యాపార యుగ ఫలితమని చెప్పవచ్చు. ఈ యుగంలో భారతదేశాన్ని ఇంగ్లాండు ఆర్థిక వ్యవస్థకి లోబడి ఉండే ఆర్థిక భాగస్వామిగా మార్చి వారికవసరమైన ముడిసరుకులు ఎగుమతి చేసేందుకు; వారి తయారైన వస్తువులకు మార్కెట్లుగా ఉండేందుకు మన దేశాన్ని వాడుకున్నారు. ఈ ముడిసరుకుల ఉత్పత్తిలో భాగంగానే వ్యవసాయ వ్యాపారీకరణ జరిగింది.

19 వ శతాబ్దం ముందు వరకూ మన దేశంలో వ్యవసాయం ఒక వ్యాపార విధానంగా కాక ఒక జీవన విధానంగా ఉండేది. అయితే ఆంగ్ల ఆర్థిక విధానాల కారణంగా 19 వ శతాబ్దంలో వ్యవసాయం వ్యాపార విధానాలచే ప్రభావితమైంది. అంటే కొన్ని రకాల పంటల్ని గ్రామ వాడకం కోసం గాక దేశ విదేశ మార్కెట్లలో అమ్మకం కోసం పండించటం మొదలైంది. ఏ పంట వేయాలి, ఎంత మేర వేయాలి మొ॥ అన్నీ 'అమ్ముడుపోవడం' అనే అంశాన్ని బట్టి మాత్రమే నిర్ణయించే ఈ నూతన స్థితినే 'వ్యవసాయ వ్యాపారీకరణ'గా చెప్తారు.

వ్యవసాయ వ్యాపారీకరణ ఫలితంగా

రైతులు కొన్ని ప్రత్యేకమైన పంటల్ని మాత్రమే పండించే 37
పద్ధతి వచ్చింది. మునుపటి లా ఒకే గ్రామంలో వివిధ
రకాల పంటల్ని పండించటం పోయింది. ఒక గ్రామం లేదా గ్రా
కొన్ని గ్రామాల సమూహం మొత్తంలో ఆ భూమికి
సరిపడు ఒకే వాణిజ్య పంట పండించటం మొదలయ్యింది.

ఆహార పంటల్ని పండించటం

ఆహారపు వాటికి బదులుగా వాణిజ్య పంటలైన
పత్తి, జొన్న, వేరుశెనగ, నూనె గింజలు, చెరకు, పొగాకు,
నీలిమందు, ఓపియం మొ॥ పండించటం మొదలైంది.
వీటితో పాటు విస్తృత మార్కెట్టు అవసరాల కోసం పంటల్లో
వరి, సుగంధ ద్రవ్యాలు, మసాలా దినుసులు, పళ్లు,
కూరగాయలు పెద్ద ఎత్తున పండించటం మొదలు
పెట్టారు. ఈ విధంగా వేరే రకాల పంటల్లో మార్పు
రావడం ; అంతకు ముందు చిన్న మొత్తాల్లో పండించే
వాటిని వ్యాపారం కోసం పెద్ద ఎత్తున పండించటం
వ్యవసాయ వ్యాపారీకరణ ఫలితమే. (x)

వ్యవసాయ వ్యాపారీకరణ
కు దారి తీసిన కారణాలు గా ఆంగ్ల ఆర్థిక
విధానాలని చెప్పాలి.

1) భారతదేశం దిగుమతి చేసుకున్న (చేయించిన)

సరుకులను చెల్లించాలి ; కంపెనీ వాటాదార్ల లాభాలకు బ్రిటన్ ఈ దేశంలో వినియోగించిన పెట్టుబడి మీద వడ్డీని, లాభాలను కూడా భారతదేశం చెల్లించాలి. ఇందుకోసం భారత ఎగుమతులు చేయడం అవసరం. అయితే ఆ ఎగుమతులు ముడిపదార్థాలా వస్తువులా, తయారైన వస్తువులు కావటం ఇంగ్లండుకు ఇష్టం లేదు. అందువల్ల దీనికి తన దేశం మార్కెట్టు కాకుండా నిరోధించేందుకు భారత ఎగుమతుల్ని పత్తి, జనపనార, పట్టు, నూనెగింజలు, గోధుమ, తేయాకు, నీలిమందు వంటి ముడిపదార్థాలు, వాణిజ్యపంటలలో నింపేసింది.

2) 19 వ శతాబ్దంలో పారిశ్రామిక విప్లవ ఫలితంగా ఇంగ్లాండు ప్రపంచంలోనే ఉన్నత పారిశ్రామికీకరణ చెందిన దేశమయ్యింది. ఫలితంగా ఆ దేశం లోని పరిశ్రమలకు ముడి సరుకులు ఎక్కువగా అవసరం అయ్యాయి. ఈ దశలో ఇంగ్లాండు భారత్ ను తనకు ముడిసరుకులు సరఫరా చేసే దేశంగా తను తయారు చేసిన వస్తువులకు ఏ అడ్డూ లేని స్వేచ్ఛా మార్కెట్టు గా వాడుకోవడం మొదలు పెట్టింది. ఇందువల్ల భారతదేశ ప్రభుత్వం ఇంగ్లాండు లాగే

వీటి నుండు ను ఎగుమతి చేసింది.

ఈ ఎగుమతుల్లో ముడి సరుకులతో పాటు ఆహార ధాన్యాలు ఉండటం గమనించదగింది.

కారణాలు

5) వాణిజ్యీకరణ ఫలితంగా ఇంగ్లాండులో లేక నుండి రైతులు కూడా కార్మికులుగా మారటంతో వారందరి ఆహార అవసరాలు తీర్చే బాధ్యత-బరువు కూడా భారతదేశం మీద పడింది.

## ఫలితాలు - ప్రభావం

వ్యవసాయ వాణిజ్యీకరణ మన ఆర్థికవ్యవస్థ మీద, మన ప్రజల మీద చాలా విస్తృత ప్రభావం చూపింది.

1) వాణిజ్యీకరణ వల్ల ఆహార ధాన్యాల పండించటం తగ్గి వాణిజ్య పంటలకు ప్రాధాన్యత ఇవ్వటం చేత, పండించిన ఆహార ధాన్యాల్లో కూడా గణనీయంగా ఇంగ్లాండు ప్రజలకై ఎగుమతులు చేసేయడంతో మన రైతులు తిండి లేక కరువుల పాలయ్యారు. 19 వ శతాబ్దంలో వచ్చిన అనేక తీవ్ర క్షామాలకు ఇదొక ముఖ్య కారణం.

2) గ్రామ మార్కెట్లకు పరిమితమైన రైతు ఇప్పుడిక ప్రపంచ మార్కెట్ల ఒత్తిడులకు లోను కావాల్సి వచ్చింది. ప్రపంచ మార్కెట్ల ఒడిదుడుకులకు

ఎదురు నిలవాల్సి వచ్చింది.

3) అంతవరకూ మన దేశంలో ఉన్న గ్రామ స్వరాజ్యం సంపూర్ణత విచ్ఛిన్నమయ్యింది. నాటి గ్రామాల్లో ఆహార - చిన్న పరిశ్రమలు రైతుల & వృత్తుల రైతులు వారికి ఆహార ఉత్పత్తులు అందిస్తు గడిపేవారు. ఈ గ్రామీణ సమతౌల్యం, సంపూర్ణత్వం నూతన భూమి విధానం చే బలహీన పడి. వ్యవసాయ వ్యాపారీకరణ వలన పూర్తిగా విచ్ఛిన్నమయ్యింది.

4) భారత రైతు ఇక మీదట అంతర్జాతీయ పోటీని ఎదుర్కోవాలి. అమెరికా & చెందిన పెద్ద వ్యవసాయ ట్రస్టులు, యూరోప్, ఆస్ట్రేలియా, అర్జెంటీనా, కెనడా నాటి ఆధునిక శాస్త్ర పరిజ్ఞానం, యంత్రాల సాయంతో పెద్ద ఎత్తున ఉత్పత్తులు చేసేవారు. మన రైతు మాత్రం చిన్న భూకమతం లో ఎద్దులు, పురాతన నాగలి సాయంతోనే సాగు చేసే స్థితి లో ఉండేవాడు. అయినా ఈ అసమాన పోటీ తప్పేది కాదు.

5) పండించేది వాణిజ్య పంటలు కాబట్టి తన ఉత్పత్తుల్ని అమ్ముకోవడం కూడా

* 1929-30లో సంభవించిన ప్రపంచ ఆర్థిక మాంద్యం వల్ల వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పడిపోయాయి

8. గమనించ దగిన పరిణామమేమంటే, ఈ నూతన పరిస్థితిని ఎదుర్కోవడానికి భారత రైతులు, సాగుభూమి విస్తరణగానీ, అధిక పంటలు దిగుబడికిగానీ దిగక, ఆహార ధాన్యాలు, పశువులకోసం మేత, ఇతర సంప్రదాయత పంటలకు బదులుగా వాణిజ్య పంటలను పండించటం మొదలుపెట్టారు. శీతోష్ణస్థితి, భూసారం, నేలల రకాలను బట్టి దేశ భిన్న భాగాలలో అనుకూలమైన పంటలను పండించసాగారు. దీని ననుసరించి, బొంబాయి ప్రెసిడెన్సీలోని దక్షిణ జిల్లాలో మిడి ప్రత్తిని, బెంగాల్‌లో జనుము, నీలిమందును, బీహార్‌లో నల్లమందును, అస్సాములో తేయాకును, పంజాబ్ కాల్వ ప్రాంతాల్లో గోధుమ, ప్రత్తిని పండించడం మొదలైంది.

ఈ విధంగా ఏర్పడ్డ పంటల ప్రాంతీయ ప్రత్యేకీకరణ (Regional specialisation of crops) వ్యవసాయ వ్యాపారీకరణ ఫలితాల్లో అత్యంత ప్రాధాన్యతను పొందింది.

10. ఆహార ధాన్యాల అవసరాలు, నాణ్యతను దృష్టిలో పెట్టుకుంటే, వీటి పంట భూముల విస్తీర్ణంలో పెరుగుదల స్వల్పం. నిజానికి మొత్తం విత్తిన మొత్తం భూములలో ఆహార ధాన్యాల విస్తీర్ణం శాతం 1901-02 నాటికి 85 ఉంటే 1939-40 నాటికి 80.7 కు తగ్గింది. అయితే ఇదే కాలంలో వాణిజ్య పంటల విస్తీర్ణం దాదాపు 84% పెరిగింది. అయితే ఈ మార్పు ఆహార ధాన్యాల అవసరం తగ్గటంవల్ల కాదు, వాణిజ్య పంటలకు పెరుగుతున్న మార్కెట్ గిరాకీయే కారణం. అట్లే 1895-96 నుంచి 1945-46 వరకు సాగిన అర్ధ శతాబ్ది కాలంలో వాణిజ్య పంటల ఉత్పత్తి 85 శాతం పెరిగితే, ఆహార పంటల ఉత్పత్తి 7 శాతం తగ్గింది. వాణిజ్య పంటల ఉత్పత్తి ప్రశంసనీయంగా పెరిగినా వీటి భూముల విస్తీర్ణం మాత్రం మొత్తం పంట భూములలో 18% వరకే పరిమితమైంది. రైతులు ఈ కాలంలో వాణిజ్య పంటల సాగుకై తమ భూములలో మేలు రకం, నీటి వసతి గల వాటిని ఉపయోగించటం వల్ల అధికోత్పత్తిని సాధించగల్గారు. ఈ కారణంగా ఎకరం సరాసరి ఉత్పత్తిలో కూడా ఆహార పంటల కంటే వాణిజ్య

పంటలు అగ్రగామిగా ఉండటం జరిగింది. ఇలా ప్రజల ముఖ్యమైన అత్యావశ్యకమైన ఆహార ధాన్యాల ఉత్పత్తి 1901-02 లో 4.8 కోట్ల టన్నుల నుండి 1946-47 లో 4.73 కోట్ల టన్నులకు పడిపోయింది.

~~11. అనేక రకాలు, పెట్టుబడి ధనం గల భూస్వాములు~~

11. భారత వ్యవసాయ వాణిజ్యీకరణ వల్ల ప్రధానంగా లాభపడింది విదేశీ వాణిజ్య పెద్దలు, విదేశీ వాణిజ్య సంస్థలే. ఎందువల్లనంటే 19వ శతాబ్దం మధ్య కాలం నాటికి భారతదేశ విదేశీ వాణిజ్యం, ఓడలు, భీమా కంపెనీలు మొ|| పూర్తిగా విదేశీ సంస్థల ఆధీనంలో ఉండేవి. ఆ విధంగా వాణిజ్యీకరణ వల్ల వచ్చిన లాభాలు విదేశాలకు తరలిపోయేవి.

12. విదేశీ సంస్థల తరువాత వాణిజ్యీకరణం వల్ల అత్యధికంగా లాభపడినవారు వలస ప్రభుత్వం సృష్టించిన వడ్డీ వ్యాపారస్థులు, వర్తకులు, ఇతర మధ్యవర్తులు. వాణిజ్య పంటల వ్యవసాయం ఖర్చుతో కూడుకున్నది. అంతే కాకుండా బ్రిటిష్ పాలనలో అత్యధికంగా ఉండే భూమిశిస్తును నగదు రూపంలో చెల్లించవలసి వచ్చేది. బీదవాడైన భారత రైతు అప్పుకోసం ఎంత వడ్డీకైనా వీరిని ఆశ్రయించవలసి వచ్చేది. వీరు అదనుగా చూసుకొని వీరు పంట పండిన వెంటనే మార్కెట్ ధరకన్నా తక్కువ ధరకు రైతుల పంటను కాజేసేవారు. ఆ విధంగా రైతు పండించిన పంటపై పెట్టుబడిని చెల్లించి, వాణిజ్యీకరణం వల్ల వచ్చే లాభాలను ఈ మధ్యవర్తులే ~~[illegible]~~ మింగేవారు.

13. భారతదేశంలో వాణిజ్య పంటల అభివృద్ధి వల్ల, పత్తిని పండించే దక్కను పీఠభూమి, ఆంధ్రలో కృష్ణా గోదావరి, తమిళనాడులో కావేరి, పంజాబు వంటి ప్రాంతాల్లో సంపన్న రైతువర్గం ఆవిర్భవించింది. 19వ శతాబ్దం అంతాన ప్రభుత్వం నిర్మించిన నీటి పారుదల ప్రాజెక్టుల వల్ల కూడా వీరు అత్యధికంగా లాభపడ్డారు. అయితే ఈ సంపన్న వర్గమైన భూస్వాములు రైతులను పన్ను వసూళ్లలో పీడించేవారే కాని, వ్యవసాయంలో పెట్టుబడి పెట్టి అభివృద్ధి చేయటం ద్వారా లాభాలను పొందాలని ఆలోచించేవారు కాదు. అందువల్ల వాణిజ్యీకరణ వలన వచ్చింది నిజమైన అభివృద్ధి కాదు. పైపెచ్చు ఇది ప్రాంతాల మధ్య, రైతుల మధ్య ఆదాయ సంపాదనలో అసమానతలను సృష్టించింది.

ఇతర వివరాలు 19 NOV 1988 లో వచ్చిన చూడు - P-164 of vol 7 (Modern India).

# కొన్ని ముఖ్య వాణిజ్య పంటలు వాటి వ్యాప్తి

## 1) నీలిమందు :

18 వ శతాబ్దంలో ఇది గుజరాతు లాహోర పశ్చిమ భాగాల్లో పండించబడేది. కల్తీ రంగు వల్ల ఇక్కడ ఈ పంట విఫలం కావడంతో 19 వ శతాబ్దంలో ఆంగ్ల తోటల యజమానుల ద్వారా ఈ పంట బెంగాలు, బీహారులలో పండించబడేది. రైతుల చేత ఈ పంట ని నిర్బంధంగా పండించేవారు. తోటల యజమానులకు ప్రభుత్వ మద్దతు కూడా ఉండడం కారణం. 1860 నాటికి బీహారు లో నీలిమందు ఉత్పత్తి స్థాయి లో 58,000 maunds ఉండింది. 1894-95 లో 3.5 మిలియన్ల విలువ గల నీలిమందు ఎగుమతి చేయబడింది.

## 2) తేయాకు :

1835 లో అస్సాం ప్రభుత్వం తేయాకు తోటల్ని చేపట్టింది. 1850 లో 1876 ఎకరాల్లో ఉన్న తేయాకు సాగు 1871 నాటికి 31,303 ఎకరాలైంది. 1896 లో 4,33,133 ఎకరాల్లో తేయాకు సాగు జరిగేది. అస్సాంలోనే గాక బెంగాలు, హిమాచల్ ప్రదేశ్, పంజాబ్, నీలగిరి (→ దక్షిణ భాగంలో) లలో కూడా తేయాకు సాగు చేసేవారు. నీలగిరి చైనా రకం తేయాకు కు ప్రసిద్ధి.

3) కాఫీ :

1830 నుండి వ్యవస్థీకరించబడిన కాఫీ తోట / పద్ధతి ప్రకారం కాఫీ సాగు మొదలయ్యింది. కాఫీ పంట కూర్గు, వైనాడు, నీలగిరి, ట్రావెన్కూరు, మైసూరు వంటి ప్రాంతాల్లో పండించేవారు. 1860, 1870 ప్రాంతాల్లో కాఫీ పంట విస్తీర్ణం పదింతలు పెరిగాయి. అస్సాం తోటల్లో కంటే కాఫీ తోటల్లో కూలీల పరిస్థితి కొంత మెరుగ్గా ఉండేది.

4) చెఱకు :

చెఱకు పంట ప్రధానంగా బెంగాలు, బీహారు, యునైటెడ్ ప్రావిన్సుల్లో, దక్షిణ భారతంలో పండేది. చెఱకు ఉత్పత్తుల్లో సాధించిన ప్రగతి 1936-37 లలో నమోదైన పంచదార ఉత్పత్తి → 12,50,000 టన్నుల ద్వారా గమనించవచ్చు. కోయంబత్తూరు లోని కేన్ బ్రీడింగ్ స్టేషన్, కాన్పూర్ లోని పంచదార సాంకేతిక సంస్థ (Institute of Sugar Tech) ఈ పంట కు ప్రోత్సాహాన్ని ఇచ్చాయి.

12.7

| Year | Place | చనిపోయినవారు | సహాయం |
|---|---|---|---|
| 1769-70 | బెంగాలు | మూడోవంతు మంది | లేదు |
| 1784 | మొత్తం ఉ.భా. | — | — |
| 1803 | వాయువ్యం | — | శిస్తు↓, రద్దోన్నులు ఇవ్వడం మొ. |
| 1837 | గంగాతీర ఉత్తరాన | — | పబ్లిక్ వర్క్స్ ద్వారా పని, పల్లెలు etc. బలహీనుల్ని సమాజం దయాదాక్షి |
| 1860-61 | వాయువ్య ప్రావిన్సు ఢిల్లీ-ఆగ్రా | 2 లక్షలు | పేదల ఇళ్ళకే ఉపాధి [illegible] వాడడం, [illegible] వేయడం తాత్కాలికంగా చేసింది. స్మిత్ |
| 1865-66 | బెంగాలు, బీహారు, ఒరిస్సా, మద్రాసు | ఒక్క ఒరిస్సాలోనే 1.3 మిలియన్లు | చాలా అలక్ష్యంగా చాలాచాల, కాంప్ బెల్ కమిటీ |

~~[illegible]~~ లోపాలుగా వ్యవహరించబడి వ్యవసాయ ఆధునీకరణను జరగనవ్వలేదు. తమ అవసరాలు పోను, వీరి వద్ద మార్కెట్లలో అమ్మకానికి, పండించిన పంటలలో కొద్ది భాగం మాత్రమే మిగిలేది. ఈ కారణంగా విదేశీ మార్కెట్లలో తమ ఉత్పత్తులకేర్పడ్డ హెచ్చు ధరలు, గిరాకీ వల్ల వీరు లాభాన్ని పొందలేకపోయారు. తరచుగా తాము సేద్యం చేసే భూముల యాజమాన్య హక్కు వీరికి లేకపోవడంవల్ల కూడా వీరు ఆ భూములకు సంబంధించిన విషయాలలో ఎటువంటి సాంకేతిక పరమైన [illegible] మార్పులను చేపట్టలేకపోయారు. అయితే రైతు యజమానుల విషయంలో కూడా, జరగాల్సిన వ్యవసాయక అభివృద్ధి సాధ్యం కాలేదు. కారణం మార్పులను చేపట్టడానికి అవసరమైన ఆర్థిక స్తోమత, వనరులు వీరివద్ద లేకపోవడమే. ఫలితంగా వ్యవసాయక ఉత్పత్తులకు గిరాకీ పెరుగుతున్నా, ఉత్పత్తి మాత్రం అధికం కాలేదు. 1890-1947 మధ్యకాలంలో భారత వ్యవసాయం స్తబ్దత దశలో ఉన్నదని డేనియల్ థార్నర్ సూచించిన మాటల్లో ఎంతో సత్యం ఉన్నది.

[illegible] పే.నెం. 50(a)

12.7.03

# క్షామాలు

## ముఖ్య క్షామాలు - నివారణా చర్యలు & ఉపశమనం

దోపిడీయే ధ్యేయంగా పెట్టుకున్న పరాయి పాలనలో క్షామాలు సంభవించడం వింతేమీ కాదు. 11 నుంచి 17 వ శతాబ్దాల మధ్య 14 ప్రాంతీయ కరువులు మాత్రమే రాగా కంపెనీ పాలించిన ఒక్క శతాబ్దంలోనే (1765-1858) 12 క్షామాలు, 4 తీవ్ర కరువులు రావడం ఇందుకు నిదర్శనం. తర్వాత సార్వభౌమ పాలనలో కరువుల తరచుదనం పెరిగి 1860-1908 ల మధ్య కేవలం అర్ధ శతాబ్ద కాలంలో 20 కరువులు వచ్చాయి. వీటిలో ముఖ్యమైనవి క్రింద గమనించవచ్చు.

### కంపెనీ పాలనలో క్షామాలు :-

భారతదేశ చరిత్రలో

**1769-70 లలో (బెంగాలు)**

నందు తీవ్ర క్షామం వచ్చి, ప్రజలను తీవ్ర కడగండ్లకు గురిచేసి ప్రావిన్సు జనాభాలో (అంటే దాదాపు 3.3 మిలియన్ల) మూడోవంతు మందిని పొట్టన బెట్టుకుంది. వాస్తవంగా ఏ విధమైన ఉపశమన చర్యలూ చేపట్టబడలేదు. పైపెచ్చు కంపెనీ ఉద్యోగులు ధాన్యాన్ని రైతుల వద్ద తక్కువ కు కొని ఎక్కువ ధరకు

అప్పట్లో విపరీత లాభాలు గడించారు.

1781-82 లో మద్రాసు నందు కరువు వచ్చింది.

1784 లో మొత్తం ఉత్తరభారతం (హిందుస్థాన్ (ఢిల్లీ, అవధ్, పంజాబ్ ప్రాంతాలలో) లో కరువు సంభవించింది.

1792 లో హైదరాబాద్, బొంబాయి దక్షిణ మహారాష్ట్ర, గుజరాత్, రాజపుటానా మద్రాసు ప్రాంతాలలో కరువు చాలా ప్రాంతాల్లో పీడించింది. ప్రభుత్వం కరువు నుండి బతికిన వారికి ఉపశమన చర్యలు ఆరంభించింది.

ఈ కాలంలో ప్రభుత్వ నివారణా చర్యల గురించి వ్యాఖ్యానిస్తూ 1880 కరువు కమిషన్ ఇలా వ్రాసింది

66

1803 లో వాయువ్య ప్రావిన్సుల్లో, అవధ్ లో కరువు వచ్చింది. ప్రభుత్వం ఉపశమనాలైన భూమిశిస్తు తగ్గించటం; భూస్వాములకు రుణాలు, లోన్లు ఇవ్వటం; బెనారస్, అలహాబాదు, కాన్పూరు, ఘాజీపూర్లలోకి దిగుమతైన ఆహార ధాన్యాల పై (bounty)

1833 లో సంభవించిన గుంటూరు కరువు కరాళనృత్యం చేసింది. ఆ ప్రాంతంలోని మొత్తం 5 లక్షల జనాభా లో 2 లక్షల మంది కరువుకి బలయ్యారంటే తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

1837 లో ఉత్తర భారతం లో
దాదాపు 8 లక్షల మంది మరణించారు.
గంగా నది ఉత్తరాన తీవ్ర కరువు వచ్చింది. అనేక కేంద్రాల్లో ప్రభుత్వం పబ్లిక్ వర్క్స్ మొదలు పెట్టి రహదారులను (తా) చేయగల వారికి పని కల్పించింది. అయితే వృద్ధులు, బలహీనుల్ని మాత్రం సమాజ దయాదాక్షిణ్యాలకి వదిలి వేసింది. ప్రభుత్వ చర్యలు అసంతృప్తిగా నుండి విపరీత ప్రాణనష్టం జరిగి వేలాదిగా తిరుగుబాట్లకి దారి తీసింది.

కంపెనీ పాలన లో కరువుల నివారణకి గాని ఉపశమనాలకి గాని ఎలాంటి సాధారణ విధానాలకి అసలు ఏ కృషీ జరగలేదు. అయితే

ప్రాతినిధ్యరహిత ప్రభుత్వాలు, జిల్లా అధికారులు కరువు ప్రాంతాల్లో ఉపశమనానికి పలు ప్రయోగాత్మక చర్యలు చేపట్టారు. ప్రభుత్వ ఆధ్వర్యంలో ధాన్యం నిల్వ చేయటం, క్రమబిల్లులపై హుండీలు వేయడం, మొ॥.

సార్వభౌమత్వం పాలన లో కరువులు
— ప్రభుత్వ చర్యలు :-

కంపెనీ నుండి సార్వభౌమాధికారం బదిలీ కావడం, 19 వ శతాబ్దంలోని ఆర్థిక మార్పులు, రైల్వేలు - తంతి తపాలా ద్వారా రవాణా సమాచార సౌకర్యాలు పెరగడం, సముద్రాంతర వర్తకం వృద్ధి చెందడం, మొ॥ కారణాలచే ఈ కాలంలో కరువు సమస్య యొక్క సాధారణ స్వభావం మారిపోయింది. ప్రభుత్వం కూడా తన బాధ్యతని గుర్తించింది. సాగు కు నీటిపారుదల సౌకర్యాలు కల్పించడం, ధనసాయ చట్టాలు చేయడం, నివారణా చర్యలు చేపట్టడం, లేదా ఒక "కరువు ఉపశమన విధానం" ను కూడా

రూపొందించడం మొ॥ చర్యలు తీసుకుంది ప్రభుత్వం. అయితే ఈలు కారణాం వారి దోపిడీ ఆర్థిక విధానం లాంటి వ్యవస్థీకృతమైన ఉండటం చేత కరువులు తప్పలేదు.

1860-61 లలో వాయువ్య ప్రాంతమ్ముల ముఖ్యంగా ఢిల్లీ & ఆగ్రా & మధ్య ప్రాంతాలలో కరువు సంభవించింది. 1857 తిరుగుబాటు ను మద్దతునిచ్చారని తీవ్రశిక్ష ను శిక్షగా వేయడం, తిరుగుబాటు కాలంలోనే నిల్వధాన్యం నాశనం కావడం, తగిన వర్షాలు లేకపోవడం తో ప్రజలు కరువునెదుర్కోవడానికి ఏ మాత్రం సిద్ధంగా లేరు. కాని ప్రభుత్వం మాత్రం ధరలు పెరగకుండా, కూలీలకు పనుల వేతనాలు ఇచ్చేందుకు ఏ చర్యలూ తీసుకోలేదు. పేదలు కరువు నిండిన తమ గ్రామాల్ని వదిలి పరిసర ప్రాంతాల్లో కి వలస పోయారు. అయినా ఈ కరువు వల్ల 2 లక్షల మంది మరణించారు.

అయితే ప్రభుత్వం చేపట్టిన కొద్ది చర్యల్లో పేదల కోసం ఉపశమన స్థావరాలుగా వాడటం ఈ కరువుతో మొదలయ్యింది. కరువు కారణాలు, విస్తీర్ణం, తీవ్రత, ఉపశమన చర్యలు సూచించడం కోసం అధ్యయనం చేసి

ఒక విచారణా కమిషన్ ను వేయడం కూడా జరి
గింది. ఈ బెయిర్డ్ స్మిత్ కమిషన్ నివేదిక
మాత్రం ఒక సాధారణ కరువు నివారణా విధానానికి
దారి తీయలేదు.

1865-66 లో ఒరిస్సా, మద్రాసు, ఉత్తర బెంగాలు, బీహారు లలో పెద్ద కరువు వచ్చింది. ఒక్క ఒరిస్సాలోనే 1.3 మిలియన్ల మంది మరణించి ఇది 'ఒరిస్సా కరువు' గా పిలువబడింది.

ప్రభుత్వ చర్యలు చాలా ఆలస్యంగా పైగా చాలీచాలనివి గా అవ్యవస్థంగా ఉన్నాయి. [illegible] ఈ ఒరిస్సా వైపరీత్యం భారత క్షామ చరిత్రలో గొప్ప మలుపు. ఈ క్షామం తర్వాతనే "కాంప్‌బెల్ కమిటీ" నియామకం జరిగింది. ఈ కమిటీ నివేదిక క్షామ నివారణా విధాన రూపకల్పనకు పునాదులు వేసింది. అసహాయులు, బలహీనుల బాధ్యత సంఘం మీద వదిలి వేయడం గాక ప్రభుత్వమే చేపట్టాలని నిర్ణయించారు. ప్రభుత్వం రైల్వేలు, కాల్వల నిర్మాణానికి ఋణం తీసుకోవాలని కోరబడింది. నివారించదగ్గ మృత్యువులు సంభవించకుండా జిల్లా అధికారులు బాధ్యులు చేయబడ్డారు.

1868-70 లో ఉత్తర, మధ్య భారతాల్లో తీవ్ర క్షామం వచ్చింది.

దారుణంగా ప్రభావితమైన ప్రాంతాలు రాజపుటానా, మధ్య ఇండియా.

వాయువ్య ప్రావిన్సులో నివారించబడ్డ కొంతవరకు జిల్లా అధికారుల్లో కొత్త బాధ్యత చేశారు. ఏమైనా ప్రభుత్వ ఉపశమన చర్యలు కరువు తీవ్రతలో పోల్చితే చాలా తక్కువై మరణాలు అధికంగా సంభవించాయి.

1873-74 లో బెంగాలు, బీహారులో వచ్చిన కరువు ప్రత్యేకమైనది. ఇక్కడ కరువు నివారణ చాలా తీవ్రంగా కృషిచేసి స్థానిక ప్రభుత్వ మూలాన ఆహార విధానం వల్ల దారుణం తప్పిపోయింది. సకాలంలో దిగుమతులు రావడం, కూలీల వేతనాల్లో ఉదారంగా వ్యవహరించడం మొ॥ కరువు బారి నుంచి కాపాడాయి. ధాన్యాలకు అప్పులు ఇవ్వడం, జమిందారులకు ఆవు కాలువల రక్షణకై ధనం ఇవ్వడం మొ॥.

1876-78 లో సంభవించిన తీవ్రత్వం కరువు చరిత్రలో భయంకరమైనది. ఈ కరువు మద్రాసు, బొంబాయి, ఉత్తర ప్రదేశ్, పంజాబులను ప్రభావితం చేసింది. మొత్తం 2,57,000 చ॥ మైళ్ల మేర, 58 మిలియన్ల మంది ప్రజలు దీని గురయ్యారు. ఒక్క సంవత్సరంలోనే

5 మిలియన్ల మంది చనిపోయినట్లు R. C. దత్ అంచనా వేశారు. ఈ విధంగా ప్రభావితమైన ప్రజల సంఖ్య, ప్రాంతం, కాలం, తీవ్రతల దృష్ట్యా ఈ కరువు మిక్కిలి పెద్దది.

ప్రభుత్వం విస్తృతం మునుపటిలా నివారించదగ్గ మృత్యువుల్ని నివారించేందుకు కృషి చేయడానికి సంసిద్ధంగా లేదు. ఈ సందర్భంగా 1901 లో ఫెమైన్ కమిషన్ నివేదిక

"వ్యయం లో పరిమితి లేకుండా ప్రాణాల్ని రక్షించే పని ప్రభుత్వ శక్తికి మించినట్టిది" అని వ్యాఖ్యానించింది. ప్రభుత్వ ఈ వైఖరి వల్ల క్షామ తీవ్రత మరింత అధికమయ్యింది.

1880 లో లిట్టన్ (Litton) ప్రభుత్వం "రిచర్డ్ స్ట్రాచీ" కమిషన్ ను నియమించింది. ఈ కమిషన్ నివేదిక లో తొలి అధ్యాయం నివారణా చర్యలు చెప్పగా రెండవది ఉపశమన చర్యల గురించి చెప్పాయి. ఇక తర్వాత అధ్యాయాలు కరువు నిజంగా సంభవించినప్పుడు తీసుకో

సాధారణంగా మొదలించింది. సాధారణ పరిస్థితుల్లో భారతదేశానికి గాను "క్షామ నిధి" ఏర్పాటై నూతన వనరుల్ని ప్రోత్సహించడం మొదలు పెట్టింది. చివరికి 'క్షామ నివారణం – ఇన్సూరెన్సు' కింద ప్రతి బడ్జెట్టు లో రూ. 15 మిలియన్ల నిధుల్ని కేటాయించాలని నిర్ణయించడమైంది. <u>1883</u> లో <u>ప్రొవిజనల్ ఫామైన్ కోడ్</u> ను ప్రకటించారు. ఇది తరువాత పలు ప్రావిన్షియల్ ఫామైన్ కోడ లకు ఆదర్శమైంది. 1880 – 1896 కాలంలో పలు చిన్నచిన్న కరువులు ఈ ప్రావిన్షియల్ కోడ్ లను పరీక్షించడానికి, పునస్సమీక్షించడానికి అవకాశం కల్పించాయి.

1884 లో దక్షిణ పంజాబులో, 1884-85 లలో మద్రాసులో, 1886-87 లలో సెంట్రల్ ప్రావిన్సుల్లో, 1888-89 లలో ఉత్తర బీహారులో ఒరిస్సా, గంజాంలలో ; 1890 లో కుమావన్, గర్వాల్ ప్రాంతంలో 1890-92 లలో మద్రాసు, బొంబాయి, బెంగాల్లో కరువులు వచ్చాయి.

<u>1896-97</u> లో మొత్తం తీవ్ర క్షామం దాదాపు ప్రతి ప్రావిన్సు ను తీవ్రతలు వేరైనప్పటికీ కబళించింది. దాదాపు 34 మిలియన్ల మంది

ప్రభావితులయ్యారు.

ఉపశమన చర్యలు విస్తారంగా తీసుకున్నారు, చాలా మంది వారి గృహాల్లోనే ఉపశమనం పొందారు. ఉపశమనానికి మొత్తం రూ. 7.27 కోట్లు ఖర్చయ్యింది. ఈ సందర్భంగా ప్రభుత్వం వేసిన లియాల్ కమిషన్ చాలా వరకు స్ట్రాచీ కమిషన్ నివేదికతో సమ్మతిం చాలా flexibility పరిస్థితులకు అనుగుణంగా కొన్ని మార్పుల్ని సూచించింది.

క్రీ.శ. 1899-1900 లలో తిరిగి 200 ఏళ్లలో గొప్పదైన కరువు సంభవించింది. ఇది 4,00,000 చ. మైళ్ల భూభాగాన్ని 60 మిలియన్ల మంది ప్రజల్ని ప్రభావితం చేసింది. దానితో కరువు కూడా వచ్చి పశు సంపద నాశనమై పోయింది.

ప్రారంభంలో ప్రభుత్వం నిర్లక్ష్యం చేసింది. తర్వాత ఉపశమన కేంద్రాలు తెరిచినా అంటువ్యాధి ప్రజలు ఒకేసారి వచ్చి పడటంతో అవి అస్తవ్యస్తమై పోయాయి. ఉపశమన ఖర్చు రూ. 10 కోట్లు దాటింది.

కర్జన్ ప్రభుత్వం మెక్డొనెల్ కమిషన్ ను నియమించింది. ఈ కమిషన్ సూచనలు:

1) ఇంతవరకూ లేనటువంటి సూత్రాన్ని ఆమోదించి అన్ని తప్పనిసరి మార్పుల్ని చేసింది / సూచించింది.

2) 'నైతిక ప్రవాహం' ఉండడం యొక్క ఆవశ్యకతను నొక్కి చెప్పింది.

3) విత్తనాలు, ఎరువులు, మొదలైన వాటికి బాకీలు ఇవ్వడంతో దానికి అప్పులు త్వరగా ఇవ్వాలి.

4) ఉపకరణ చర్యలు విస్తారంగా చేపట్టాల్సిన చోట ప్రావిన్సులలో ఫైనాన్స్ కమిషనరును నియమించాలి.

5) అనధికారిక సహాయాన్ని ప్రోత్సహించాలి.

6) గ్రామాల్లో పెద్ద పబ్లిక్ వర్క్స్ ని ప్రోత్సహించడం.

7) రవాణా సౌకర్యాలు మెరుగుపర్చడం

8) వ్యవసాయ బ్యాంకుల్ని తెరవడం

9) నీటిపారుదలా సౌకర్యాల్ని వృద్ధి పరచడం, వ్యవసాయ పద్ధతుల్ని మెరుగుపర్చడం మొదలైనవి.

ఈ నివేదిక సూచనలు చాలా వరకు ఆమోదించబడ్డాయి. కర్జన్ ఇంతకు ముందు పలు చర్యలు తీసుకుని కరువుని ఎదుర్కొనుటకు కృషి చేశాడు.

1901 – 1941 ల మధ్య అనేక చోట్ల కరువులు వచ్చాయి. ఇవి ప్రధానంగా ప్రాంతీయ స్థాయివి.

అయితే 1906-07 లలో బొంబాయి ప్రెసిడెన్సీలోని దక్షిణ జిల్లాల్లో, 1907-8 లలో యునైటెడ్ ప్రావిన్సు ఆగ్రా, అవధ్ లలో వచ్చిన కరువులు మాత్రం తీవ్రమైనవి.

1942-43 లో సంభవించిన

బెంగాలు క్షామం మాత్రం భయోద్వేగం. ఇప్పటికీ మరువలేని దీనగాథ. 1938 నుంచి వరుసగా పంటలు విఫలమవడం, రెండవ ప్రపంచయుద్ధం సృష్టించిన పరిస్థితులు దీనికి ప్రధాన కారణాలు. యుద్ధం వల్ల బర్మా నుండి బియ్యం దిగుమతులు నిలిచిపోవడం, బెంగాల్లోని ధాన్య రవాణా నిల్చిపోవడం కరువుకు దారి తీశాయి. ప్రభుత్వం అవలంబించిన నిరాకరణ విధానం (Denial policy), వ్యాపారులు-వర్తకుల చర్యలు కరువుకి దోహదం చేశాయి. K.P. చటోపాధ్యాయ గారి లెక్కల ప్రకారం దాదాపు 3.5 మిలియన్ల మంది చనిపోయారు. ఈ క్షామం "దేవుని చర్యగా కంటే మనిషి మానవకృత్యం గానే కన్పిస్తుంది". ప్రకృతి, యుద్ధం సృష్టించిన పరిస్థితుల్లో

మనిషి స్వార్థానికి వాడుకున్నాడు.

ఉపశమన చర్యలు స్వల్పంగానూ అరకొరగానూ ఉన్నాయి. ఉపశమన చర్యలు చేపట్టాలి అనడం; కరువును ప్రభుత్వం క్షామంగా ప్రకటించక పోవడం; దురదృష్టవశాత్తూ యుద్ధ ప్రచారంలో భాగమైన "కరువు లేదు" (no shortage) అనే విధానం లో కలిసి విలయ తాండవం సృష్టించింది ఈ క్షామం. పైగా కేంద్ర ప్రభుత్వం దూరంగా వ్యవహరించి ఉపశమన చర్యలు బెంగాలు ప్రాంతీయ ప్రభుత్వమే భరించాలని చెప్పింది.

లిన్‌లిత్‌గో నుంచి వేవెల్ గవర్నరు జనరలుగా బాధ్యతలు స్వీకరించాక పరిస్థితి మెరుగుపడింది. వేవెల్ యుద్ధ ప్రాతిపదికన ఉపశమన చర్యలు చేపట్టాడు.

ఈ కరువు కాటకాల భీతిక ఉండబట్టే స్వతంత్ర భారతం ఆహార ధాన్యాల్లో స్వయం ప్రతిపత్తిని ధ్యేయంగా పెట్టుకుంది. హరిత విప్లవం ఫలితంగా ఆ ఆశయం ఆచరణలో అమలుపరచగలిగింది.

# Chapter - 1.

## Punjab as major power in resistance to British :

### భారతదేశంలో సిక్కు సామ్రాజ్యం

విదేశీ పాలనను ప్రతిఘటించిన వారిలో సిక్కులు ముఖ్యులు. రంజిత్ సింగ్ బ్రిటీషు సైనికాధిక్యతను గుర్తించి వారితో తన సామ్రాజ్యాన్ని కాపాడుకుంటూ ఉండేందుకు 1809 లో "అమృతసర్ ఒప్పందం" చేసుకున్నాడు. కానీ రంజిత్ మరణానంతరము (1839) సిక్కు రాజ్యంలో అరాచకం ప్రబలింది. రంజిత్ కాలంలో 40,000 ఉన్న సైన్యం అతడు మరణించిన తర్వాత 5 ఏళ్ళకి మూడింతలైంది. సైనికులు సొంత పంచాయతీలు ఏర్పరచుకొని సివిలు అధికారంలో పనిచేయకుండా సొంత నిర్ణయాలు తీసుకునేవారు. చివరకు సైన్యమే రాజులను తయారుచేసే (king makers) స్థాయికి వెళ్ళింది. 1839-43 ల మధ్య ఖరక్ సింగ్, నౌనిహాల్ సింగ్, షేర్ సింగ్ లు రాజులై మరణించారు. 1843 లో పసివాడైన 'దిలీప్ సింగ్' ని రాజు చేసి తల్లి 'రాణి జిందాన్' సంరక్షకురాలిగా రాజ్య బాధ్యతలు చేపట్టింది. తర్వాత ఆమె

పెట్టి తమ బలం నిరూపించుకోవాల్సి ఉవ్విళ్లూరుతున్నారు.

పి.ఇ. రాబర్ట్స్, పెర్సివల్ స్పియర్ యుద్ధ కారణాన్ని శిక్కులకి ఆపాదించారు.

“ రాణికి శిక్కు ని ఉన్మాదులతో యుద్ధానికి ప్రోత్సాహం లేక భద్రత కి ఆశ కల్పించింది. అయితే శిక్కు తన మిలిటరీ/ అంతర్యుద్ధ లోకి శక్తి ని పెంచుకున్న తర్వాత పెట్టించటం శిక్కులు సార్వభౌములుగా ఆవిష్కరించటం జరుగుతుంది, లేదా పోరాటంలో చెడి అరాచకమై/ నాశనమౌతుంది. అప్పుడు ఉన్మాదులతో రాణి చేసుకోవచ్చు.... శిక్కు యుద్ధం యొక్క ఈ ముఖ్య లక్ష్యం సదా స్మరణ లో ఉంచుకోవాలి.”

— పి.ఇ. రాబర్ట్స్ చేసిన ఈ వ్యాఖ్య పంజాబు యుద్ధాన్ని శిక్కుల్ని తెల్పుతుంది.

ఇదే తరుణంలో స్థానిక గవర్నరు-జనరలు లార్డు హార్డింజ్ కంపెనీ సైనిక బలం పెంపొందించటం చర్యలు చేపట్టాడు. మరోవైపు 1843 లో లాంఛనంగా కంపెనీ పాలనగా

నియమించబడిన బ్రాడ్‌ఫుట్ లాంటివారు చర్యలు సిక్కుల్ని రెచ్చగొట్టసాగాయి. ఆంగ్లేయుల సైనిక సన్నాహాలు పంజాబ్లో అరాచక పరిస్థితిని గాంచి దాడి చేయమని సిక్కులు ప్రేరించి ఈ యుద్ధం వారి నేల మీద జరగాలనుకున్నారు.

సిక్కు సేనలు, హరీక్, కసూర్ ల మధ్య సట్లెజ్ నది దాటి సర్ హ్యూగాఫ్ నాయకత్వాన గల ఆంగ్ల సైన్యం పై విరుచుకుపడింది. గవర్నరు జనరలు హార్డింజ్ యుద్ధ రంగాన చేరాడు. 'ముడ్కి', 'ఫిరోజ్‌షా', 'బుద్దీవాల్', 'అలీవాల్' అనే 4 ప్రాంతాల్లో యుద్ధాలు జరిగాయి. అయితే చివరిది నిర్ణయాత్మక యుద్ధం మాత్రం "సోబ్రాన్" లో 1846 ఫిబ్రవరి లో జరిగింది.

లాల్‌సింగ్ ముందుగానే శత్రువులకి సైన్య రహస్యాలు అందించటం, తేజ్‌సింగ్ కావాలని మధ్యలో పారిపోవటం, గులాబ్‌సింగ్ ఈ పోరు యుద్ధం జరుగుతుండగానే రాజీ సంప్రదింపులు చేయటం - ఇలా నాయకుల మోసం వలన సిక్కు సైనికులు

సిక్కులు ఓడించబడ్డారు.

"ఖల్సా సేనలు ఒక ఉత్తమసైన్యం లా ఒక జనరల్ గా కాదు ఒక సర్వోన్నత నియంత్రణాధికారం లేని ఉత్తమసైన్యం లా పోరాడాయి"

అని పి.ఇ. రాబర్ట్సు వ్రాసి ఉన్నారు.

ఫి.20. ఆంగ్ల సేనలు సట్లెజ్ నది దాటి లాహోరు ను ఆక్రమించి ఒప్పందాన్ని నిర్దేశించారు.

లాహోరు ఒప్పందం, 1846 లోని

ముఖ్యాంశాలు :

1) సట్లెజ్ నది & దక్షిణ ప్రాంతాల పై మహారాజు లేదా, లేదా వారసుల అధికారాన్ని వదులుకున్నాడు.

2) బియాస్ - సట్లెజ్ ల మధ్యనున్న మొత్తం ప్రాంతం, జలంధర్ దోఆబ్ మీద మహారాజు కంపెనీ & బ్రిటిష్ సార్వభౌమత్వం కల్పించారు.

3) కంపెనీ విధించిన రూ. $1\frac{1}{2}$ కోట్లు చెల్లించలేక దానికి బదులు కోటి విలువ చేసే ప్రాంతాన్ని కాశ్మీరు, హజారా లతో సహా; మిగిలిన 50 లక్షల ను ఒప్పందం కుదిరిన వెంటనే చెల్లించేందుకు అంగీకారం ఒప్పుకొంది.

4) సైన్యాన్ని తగ్గించటం 20,000 పదాతిదళం, 12,000 అశ్వికదళం మాత్రమే ఉండేట్లు ఒప్పందం.

5) ఏ ఇతర యూరోపియన్స్ లేదా అమెరికన్ జాతి వారికి కంపెనీ అనుమతి లేకుండా ఉద్యోగం ఇవ్వడం జరగదు.

6) ఆంగ్ల సేనలు లాహోరు నుంచి స్వేచ్ఛగా ప్రయాణించవచ్చు.

7) దలీప్ సింగ్ మహారాజుగా, రాణి జిందాన్ సంరక్షకురాలిగా, లాల్‌సింగ్ వజీరుగా గుర్తింపబడ్డారు.

8) హెన్రీ లారెన్సు ఆంగ్ల రెసిడెంటుగా లాహోరులో నియమించబడ్డాడు. ఇతడు లాహోరు అంతరంగిక పాలనలో జోక్యం చేసుకోడు.

1846 లోని మరో భైరోవాల్ ఒప్పందం ద్వారా సిక్కు సైన్య పునర్వ్యవస్థీకరణ మొదలైనవి ప్రజల రక్షణార్థం 1846 చివర వరకు ఆంగ్లసైన్యం పంజాబులోనే ఉండేట్లు, దాని ఖర్చులు లాహోరు దర్బారు భరించేట్లు అంగీకారం కుదిరింది.

పంజాబు ను ప్రత్యక్షంగా ఆక్రమించు లేక పోవటానికి కొన్ని కారణాలు ఉన్నాయి.

1) హార్డింజ్ ప్రయోగపూర్వకంగానే ఆక్రమణను విరోధించాడని (experimental forbearance) చెబుతారు.

2) శిఖ్ఖు ఓడింపబడిందేగాని పూర్తిగా నాశనం కాలేదు. పైగా వారందరూ అవమాన భారంతో రగులుతున్నారు. పంజాబులో ఫిరంగులు ఆయుధాల ప్రయోగం వచ్చు. అందువల్ల గెరిల్లా యుద్ధానికి కూడా అవకాశాలున్నాయి.

3) కంపెనీ ధనాగారం లోటు గా ఉంది.

4) రాబోయేది వేసవి కాలం, ఆక్రమణకు అననుకూలం.

5) ఆఫ్ఘన్ కు బ్రిటిష్ సామ్రాజ్యానికి మధ్య ఒక హిందూ రాజ్యం బఫర్ గా ఉండటం మంచిదని తలవడం

6) కొత్త రాజ్యాన్ని నిర్వహించడానికి (ఎక్కువ ఖర్చు) ద్రవ్యపరంగా లాభదాయకం కాకపోవడం

7) మొత్తం రాజ్యాన్ని ఆక్రమించేంత శక్తి ఆంగ్ల సేనల్లో లేదేమోనన్న అనుమానం

8) చిరకాలం మిత్రునిగా ఉన్న రంజిత్ సింగ్ పై గల గౌరవం.

## లాహోరు సంధి తర్వాత ఆక్రమణలు

రాణి జిందను గులాబ్ సింగ్ ల అధికారం ఇష్టంలేక అధిక లాల్ సింగ్ తిరుగుబాటు చేయించాడు. దాన్ని ఆంగ్లేయులు గట్టిగా అణిచివేసి లాల్ సింగ్ ను బహిష్కరించారు.

ఈ సందర్భంగా వారు మొండిగా భైరోవల్ సంధి, 1846 కుదుర్చుకున్నారు.

దీని ప్రకారం

1) దలీప్ సింగ్ ల మైనారిటీ తీరే వరకు ఆంగ్ల సైన్యం పంజాబులోనే ఉంటుంది.

2) ఆంగ్ల సైన్య పోషణ కు లాహోరు దర్బారు ఏటా రూ. 22 లక్షలు ఇచ్చేందుకు ఒప్పుకొంది.

3) సంరక్షకురాలిగా ఉన్న రాణి జిందాన్ ను (ఆంగ్ల అధికారులను ఎదిరించగా) తొలగించి ఆమె కు పింఛను ఇచ్చారు.

4) లాహోరు పాలన ను ఒక "కౌన్సిల్ ఆఫ్ రీజెన్సీ" కి బదలాయించారు. ఇది ఆంగ్ల రెసిడెంటు మార్గదర్శకం లో నడుస్తుంది.

ఈ సంధి తో పంజాబు ల ఆంగ్లేయులే వాస్తవ పాలకులు అయ్యారు.

తమ నేల చేసుకున్నారు. క్రమంగా ఈ ఆవేశం ఇతర పంజాబు ప్రాంతాలకు కూడా ప్రాకింది. జాతీయ తిరుగుబాటు గా ఎదిగింది.

మహారాజా పాలకుడు ఛత్తర సింగ్, అతని కొడుకు షేర సింగ్ లు కూడా ముల్తాన్ పక్షాన చేరారు. పెషావర్ నిచ్చి ఆఫ్ఘను రాజు స్నేహాన్ని, సాయాన్ని సంపాదించారు. సిక్కు సైనికులంతా మొదటి యుద్ధంలో నాయకుల మోసం వల్లే ఓడామని తమ సామర్థ్యం మీద నమ్మకంతో ఉన్నారు. తమ అంతరంగిక పాలనలో ఆంగ్ల ఆధిపత్యాన్ని వారెంతో కాలం సహించే స్థితిలో లేరు.

అయితే డల్హౌసి మాత్రం వెంటనే దాడికి దిగక "వేచి చూసే" విధానాన్ని అవలంబించాడు. తద్వారా తిరుగుబాటు ఉధృతి పెరుగుతుంది. అప్పుడు నేరాన్ని లాహోరు దర్బారు ~~మొత్తం~~ మీదకి నెట్టివేయొచ్చు. అంతేగాక పంజాబు మొత్తాన్ని శాశ్వతంగా కలిపేసుకోవచ్చు.

తిరుగుబాటు ని పెరగనిచ్చిన తర్వాత ఆంగ్ల సేనలు లార్డ్ గోఫ్ నాయకత్వంలో రావి నది దాటి రామనగర్ వద్ద యుద్ధం చేశాయి. ముల్తాన్

1849 లో లొంగిపోయింది. సిక్కులు మొదట వారు తర్వాత "చిలియన్‌వాలా" ప్రాంతంలో ఓడిపోయారు. చివరిది, నిర్ణయాత్మకమైనది అయిన యుద్ధం "గుజరాత్" లో జరిగింది. దీంతో మొత్తం పంజాబు ఆంగ్లేయుల స్వాధీనమైంది.

నామమాత్రపు రాజు ద్వారా పాలన చెల్లుబాటు డల్హౌసీ ఒప్పుకోలేదు. రాజ్యాక్రమణ విధానమునకు తోడు ఆ ప్రాంతంలో శాంతి నెలకొనదని చెప్పి అతడు పంజాబును ఆక్రమించాడు.

మహారాజా దలీప్ సింగ్ కు సాలుకు £ 50,000 ల పింఛను ఏర్పాటు చేసి చదువుల కోసం ఇంగ్లాండు పంపించి వేశారు. పంజాబు పాలనా బాధ్యత ను ఒక 'బోర్డ్ ఆఫ్ కమీషనర్స్' కు అప్పగించారు.

పలు విమర్శలకు, ప్రశంసలకు గురి అయ్యింది. కొందరు సమర్థించగా మరికొందరు వ్యతిరేకించారు.

"1846 లోని సోబ్రాన్ విజయం లార్డు హార్డింజ్ కు ఆక్రమణకై హక్కు నిచ్చింది. 1849 లోని గుజరాతు విజయం లార్డు డల్హౌసీ ని ఆ హక్కు ని పొందేలా ఒత్తిడి చేసింది"

— విలియం హంటర్.

అయితే మేజర్ ఇవాన్స్ బెల్ మాత్రం పంజాబు ఆక్రమణ జాగ్రత్తగా ఉండాల్సింది, మానుకో వలసింది అని అభిప్రాయపడ్డాడు.

Short (Imp)

"పంజాబు ఆక్రమణ ఆక్రమణ కాదు. అది నమ్మకాన్ని పవిత్రంగా వమ్ము చేయడమే"

అది ఇవాన్స్ బెల్ చేసిన వ్యాఖ్య లో ఎంతో నిజం ఉంది. (1) భైరోవల్ సంధి (1846 డిసెంబరు) జరిగిన నాటి నుంచి ఆస్థి

రెసిడెంట్ పంజాబు లో అంతరంగిక పాలకుడిగా ఉన్నాడు. అతడే మహారాజు పేరు మీదుగా అన్ని సైనిక, పౌర (civil) మరియు పాలనా (administration) అధికారాలను చెలాయించాడు. ఒడంబడిక చేసింది ~~సిక్కు~~ సైన్యమే గాని మహారాజా చేత కౌన్సిల్ ఆఫ్ రీజెన్సీ గాని కాదు. మహారాజు యొక్క రీజెంటు గా ఫ్రెడెరిక్ కర్రీ, లాహోరులోని బ్రిటిష్ రెసిడెంటు, మూల్రాజ్ యొక్క లేదా సిక్కు సైన్యం యొక్క ఒడంబడిక ను అణచివేయాల్సిన గురుతర బాధ్యత, అప్పటిసరి విధి కలిగియున్నాడు. ఒడంబడిక కు మహారాజు ఏ విధంగాను ~~బాధ్యుడు~~ ~~చేయుటకు~~ ~~కాబట్టి~~ బాధ్యుడు కాడు కాబట్టి ~~ఆ~~ కారణం మీద అతన్నుంచి అతని రాజ్యాన్ని లాక్కోవడం ప్రత్యక్షంగా, కట్టుబడినట్లు అన్యాయం గా కనబడుతుంది.] ఇంగ్లీషు

ఇంగ్లీషు కంపెనీ తన

రెసిడెంట్ ద్వారా మైనరు గా ఉన్న మహారాజు కు సంరక్షకురాలి గా వ్యవహరిస్తున్నది. ఇటువంటి

పరిస్థితి లో కంపెనీ తన రక్షణలో ఉన్న మహారాజు రాజ్యాన్ని తన స్థాయి, పదవి, కర్తవ్యం విస్మరించి కబళించివేయడం తప్పకుండా విశ్వాసఘాతుక చర్యయే అవుతుంది.

(4) లాహోరు రాజ్యం పై దాని ప్రభుత్వంలో అలజడులు పై అవకాశాల దృష్ట్యా ఆక్రమణలో ప్రత్యక్షంగా యుద్ధం లో ఉన్నట్లు లేదా వెళ్ళిపోయినట్లుగా భావిస్తున్నానని డల్హౌసీ చేసిన ప్రకటన లాహోరు లోని ఆంగ్ల రెసిడెంటు, పంజాబు పాలకుడు అయిన ఫ్రెడరిక్ కర్రీ ని తీవ్ర అయోమయానికి గురి చేసింది. డల్హౌసీ మాత్రం పెద్ద ఆట కోసం ఎత్తులు వేసేందుకు సిద్ధపడి ఏదో ఒక నెపంతో పంజాబు ను ఆక్రమించుకోవాలని బలంగా భావించడం లో తలచి దానికే పట్టుబట్టాడు. ఫలితంగా పంజాబు ఆంగ్ల భూభాగం లో భాగం అయ్యింది.

డల్హౌసి సంధుల్ని ఉల్లంఘించాడు, పవిత్రమైన నమ్మకాన్ని దుర్వినియోగం చేశాడు. ఒక స్థిరమైన, కీలకమైన సంస్కరణను భారతదేశ ఉత్తర సరిహద్దు వరకూ చేసేందుకు ఉపయోగబడిన మహోత్తర అవకాశాన్ని ఆసి పుచ్చాడు.

ఎంత హేయమో అంత అవివేకమైన అయిన పంజాబు ఆక్రమణ మన సరిహద్దును బలహీనపర్చింది, మన సైనిక శక్తిని చెదరగొట్టింది, అంతేగాక సామ్రాజ్యం పై అధిక భారాన్ని మోపింది.

— ఇవాన్స్ బెల్

దలీప్ సింగ్ చిన్న బాలుడు, అతని మైనారిటీ 1854 నాటికి గాని తీరదు. మనం అతని ప్రకటించబడిన సంరక్షకులం. మనం అతని రాజ్యంలో చివరి సారిగా ప్రవేశించినపుడు మనం వచ్చింది తిరుగుబాటుదార్లని శిక్షించేందుకు, రాజ్యాంగబద్ధ అధికారాన్ని సాయుధులై వ్యతిరేకించేవారిని మట్టుపెట్టేందుకేనని ప్రకటించాము. అతని రాజ్యాన్ని ఆరో నెల్లోగా మొత్తంగా ఆక్రమించుకుని మనం మన ప్రతిజ్ఞని నిలబెట్టుకున్నాం. 1849 మార్చి లో పంజాబు

రాజ్యం ముగించబడింది. మన రక్షణ పొందుతున్న 
బాలుడికి సింహాసనం ఏర్పాటు చేశాం. ఆ రాజ్య సంపదనూ ప్రసిద్ధ
కోహినూరు వజ్రం లాగ సహా మన రాణికి అర్పించాం.

అంటే మనం మన రక్షణలో
ఉన్న బాలుడి తరఫు మొత్తం భూమి లాక్కోవడం
ద్వారా రక్షించాం ② ఇకనుంచి ఆచారం కాదిది /
అంగీకరించి దలీప్ సింగ్ రక్షణా బాధ్యతను చేపట్టిన
తర్వాత అతని పాలితుల తప్పుకి అతన్ని శిక్షించటం
హాస్యాస్పదమైనది. మనకి అతనికి ఉన్న సంబంధాన్ని
బట్టి తిరుగుబాటును అణచివేయడం ద్వారా మనం
కేవలం అతని పట్ల మనకున్న విధిని నిర్వర్తించినట్లు
అవుతుంది. అలాంటి అతని పాలితుల తిరుగుబాటు
ఏది కూడా మనకు అతనికి వ్యతిరేకంగా ఎలాంటి
హక్కు ఇవ్వదు. తె.అ. p. 85, 86 చదువు.

— (Ludlow) లడ్లో

[illegible] ఆక్రమణకే ఉద్దేశించి తెలివిగా
ప్రవర్తించుదామనుకున్నాడు. అందుకే తిరుగుబాటు ముల్తాను
లో ప్రారంభం కాగానే దాన్ని అణచివేయక "వేచి చూసే
విధానాన్ని" అవలంబించాడు. తద్వారా తిరుగుబాటు ఉధృతి
పెరుగుతుంది. అప్పుడు తిరుగుబాటును అణచివేయ

తెరపోయిందన్న నేరాన్ని లాహోర్ దర్బార్ మీదికి నెట్టి వేసి] [లాహోర్ దర్బార్ కి చేతకాలేదు గాబట్టి కంపెనీ ప్రభుత్వ ఆక్రమణ ని సమర్థించుకోవచ్చుని డల్హౌసీ తలుచాడు. కానీ లాహోర్ దర్బార్ లో విలువ చేస్తున్నది కంపెనీ రెసిడెంటే! కాబట్టి లా. ద. వైఫల్యం అంటే కంపెనీ వైఫల్యమే! కంపెనీ వైఫల్యాన్ని సాకుగా చూపి ఆ కంపెనీయే తిరుగుబాటు ని అణిచివేసి తన భూభాగం లోకి పంజాబు ని కలిపేసుకోవడం పూర్తిగా వరస్పదం, అంతకు మించి కొట్టవచ్చినట్లు కన్పించే అన్యాయం]

Maratha Confedaracy as major power in resistance to British :

బస్సీన్ సంధి - ప్రాముఖ్యత (1802)

రెండవ బాజీరావు 1802 డిసెంబరు లో బస్సీన్ ను పారిపోయి ఆంగ్లేయులతో 'సైన్య సహకార ఒప్పందాన్ని' కుదుర్చుకున్నాడు.

సంధి లోని ముఖ్యాంశాలు :

తన రాజ్యం లో కంపెనీ సైన్యాన్ని శాశ్వతంగా నిల్పడానికి అంగీకరించాడు.

1) కంపెనీ నుండి ఒక శాశ్వత రెగ్యులర్ స్థానిక కాల్బలాన్ని, కొంత యూరోపియన్ ఫిరంగిదళాన్ని, మరియు యుద్ధ సామాగ్రిని శాశ్వతంగా తన రాజ్యంలో నిల్పటానికి పేష్వా అంగీకరించాడు.

2) ఈ సైనిక పోషణార్థం సాలుకు రూ. 26 లక్షల ఆదాయాన్ని ఇచ్చే భూభాగాన్ని శాశ్వతంగా కంపెనీ కి ఇచ్చేందుకు పేష్వా అంగీకరించాడు. ఇవి గుజరాత్, తపతి & దక్షిణ భాగాలు, నర్మద-తపతి మధ్య భాగాలు, తుంగభద్ర సమీపంలో కొన్ని ప్రాంతాలు ఇచ్చివేశాడు.

3) సూరత్ నగరాన్ని కూడా ఇచ్చివేశాడు.

4) నిజాం భూభాగాలపై తనకున్న చౌత్ అధికారాన్ని పీష్వా కంపెనీ కి బదలాయించాడు, ఆ అధికారాన్ని శాశ్వతంగా వదులుకున్నాడు.

గైక్వాడ్ కు వ్యతిరేకంగా ఆయుధ ప్రయోగం చేయనని అంగీకరించాడు.

5) తనకూ నిజాం, గైక్వాడ్ లకూ మధ్య ఏవైనా విభేదాలు తలెత్తినపుడు కంపెనీ నిర్ణయంతోనే పరిష్కరించుకునేందుకు అంగీకరించాడు.

6) ఆంగ్లేయులకు విరోధులైన ఏ యూరోపు జాతి ఉద్యోగాని కి వారిని తన కొలువులో (సేవ)కు నియమించనని అంగీకరించాడు.

7) భవిష్యత్తులో ఏ అధికారంలోనైనా ఎవరితోనైనా ఒప్పందం కుదుర్చుకోవడం, లేదా వారితో ఆలోచన జరపటం గాని కంపెనీ కి ముందుగా తెలియజేసి కంపెనీ తో పరస్పర సమాలోచన కుదిరిన తర్వాతే చేసేటట్లు ఒప్పుకున్నాడు.

భారతదేశంలో ఆంగ్ల ఆధిపత్యాన్ని స్థాపించే విషయంలో బస్సీన సంధి ప్రాముఖ్యతను పలువురు పలు విధాలుగా వ్యాఖ్యానించారు.

నాటి బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ప్రెసిడెంటు లార్డ్ కేజిల్ రీగ్ తన "అబ్జర్వేషన్స్ ఆన్ ద ట్రీటీ ఆఫ్ బస్సీన్" లో ఈ సంధి లోని రాజకీయ విధాన చతురతని విమర్శించి వెల్లెస్లీ తన అధికారపరిధి కి మించి ప్రవర్తించాడని అభిప్రాయపడ్డాడు. ఈ విధానం కేవలం గా ప్రమాదమైనది, సున్నితమైనది అని రీగ్ భావించాడు. 'ఒక బలహీనమైన అసంతృప్తుడైన, అవిధేయుడైన పీష్వా ద్వారా మరాఠా రాజ్యాన్ని పాలించాలనుకోవడం నిరాశ పర్చే యత్నమే' నని చెప్పాడు. ఈ సంధి ఆంగ్లేయులని అంతులేని, సంక్లిష్టమైన మరాఠా రాజ్య కల్లోలాలలోకి లాగి వేస్తుందని రీగ్ సందేహపడ్డాడు.

అయితే వెల్లెస్లీ మాత్రం ఈ సంధి ద్వారా ఆంగ్లేయులకి భారద్దేశంలో

మధ్య వివాదాల్లో కంపెనీయే మధ్యవర్తి

అయ్యింది.

ఈ సంధి లోని ఒక క్లాజ్ ప్రకారం

పేష్వా & నిజాం & మధ్య గల ఏ గొడవల్లో

కంపెనీ మధ్యవర్తిత్వం అంగీకరించబడింది. దాంతో

నిజాం మీద అనవసర అధికారాలు పేష్వా కంపెనీకి

(5) దఖలు పర్చినట్లయ్యింది/ ఇచ్చినట్లయ్యింది.

హైదరాబాదు రాజ్యం నిర్మూల్యంగా కంపెనీ రక్షణాలకి

లోబడాల్సి వెల్లెస్లీ మరో ఆశయం కూడా ఈ

సంధి ద్వారా నెరవేరింది.

బస్సైన్ సంధి మరాఠాలలో గానీ,

ఇతర భారత శక్తులలో గానీ, లేదా విదేశీయులలో

గానీ యుద్ధం సంభవించినట్లయితే బ్రిటిషువారికి

(6) అనుకూల వ్యూహాత్మక భౌగోళిక స్థానాన్ని అందించింది. (X) కంపెనీ

సహాకార సైన్యాలు (subsidiary troops)

నాలుగు భారతీయ శక్తుల రాజధానుల్లో నిల్వబడి ఉన్నాయి

— మైసూరు, హైదరాబాదు, లక్నో, పూనా.

ఈ నాలుగు సైనిక కేంద్రాల నుంచి కంపెనీ

సేనలు ఏ ప్రాంతానికైనా సులువుగా వెళ్లి యుద్ధం 
చేయగలవు.

* బస్సీన్ సంధి భారతదేశంలో ఆంగ్ల సార్వభౌమత్వాన్ని స్థాపించలేదు, అయితే ఈ సంధి ఆ దిశగా వేసిన ముఖ్యమైన అడుగు / ఆ దిశలో ఒక ముఖ్యమైన మైలురాయి. (X) అందుకే సిడ్నీ ఓవెన్ (Sidney Owen)

“బస్సీన్ సంధి దాని ప్రత్యక్ష, పరోక్ష చర్యల వల్ల కంపెనీకి భారత సామ్రాజ్యాన్ని అందించింది” అని అన్నారు.

* అయితే ఇది వాస్తవ రాజకీయ విషయాన్ని అతిశయించి చెప్పటం అవుతుంది.

1) యూరో / ఫ్రెంచి శత్రువుల కి అవకాశం లేకుండా చేసింది.
2) పైసా ఖర్చు లేకుండా కంపెనీ సైన్యం ↑
3) పీష్వా సైన్యం కూడా కంపెనీ వైపే
4) నిజాం పై పీష్వా అధికారాలన్నీ కంపెనీ పరం
5) మరాఠా / దేశీ రాజు / విదేశీ యుద్ధాలప్పుడు కంపెనీ కి ఫ్రీ. ప్రాంతం
6) "పీష్వా" .. అందువల్ల మొత్తం మరాఠా సమాఖ్య కంపెనీ పై ఆధారపడి ఉండే స్థితి కి దిగజార్చు..

# బస్సీన సంధి - పలు వ్యాఖ్యలు

"పీష్వా తన స్వాతంత్ర్యాన్ని తన రక్షణ కోసం త్యాగం చేశాడు"

— R.C. మజుందార్

భారతదేశంలో ఆంగ్ల ఆధిపత్య స్థాపనలో బస్సీన సంధి గొప్ప మలుపు.

"ఈ సంధి నిస్సందేహంగా పశ్చిమ భారతంలో మన ముఖాన్ని మార్చిన గొప్ప ముందడుగు. ఇది ఆంగ్లేయుల బాధ్యతల్ని ఒక్కసారిగా మూడింతలు చేసింది"

— డీన్ హట్టన్
(Dean Hutton)

మరాఠా సామ్రాజ్యానికి అధికారిక నేత అయిన పీష్వాలతో నిర్దిష్ట సంబంధాలు కంపెనీకి ఈ సంధి ద్వారా ఏర్పడ్డాయి. 2's ఆర్థర్ల,

"కంపెనీ అయితే భారతదేశంలో అతిపెద్ద or అతిగొప్ప శక్తి ని

నియంత్రించటమో లేదా దానిలో విరోధాలు కలిగి ఉండటమో చేస్తుంది”

— మజుందార్.

అయితే ఈ సంధి ప్రాముఖ్యాన్ని ఓవెన్ చెప్పినట్లు

“ఈ సంధి దాని ప్రత్యక్ష పరోక్ష చర్యల ద్వారా కంపెనీ కి భారత్ సామ్రాజ్యాన్ని అందించింది”

అని అనేకమంది చెప్పనవసరం లేదు. 1803 నాటికి భారతదేశంలో ఆంగ్ల సార్వభౌమత్వం (రా) ఆధిపత్యం ముందుగానే నిర్ణయింపబడిన స్థితిలో ఎంతమాత్రం (certainly) లేదు. ఆ స్థితి ని సంపూర్ణంగా ఏర్పరిచేందుకు ఇంకా ఎంతో చేయవలసి ఉంది.

బస్సీన్ సంధిలోని బలహీనతల్ని కాసల్ రీగ విమర్శించాడు.

‘బలహీనుడు, లేదా ఆయుధుడైన పేష్వా ద్వారా మరాఠా రాజ్యాన్ని పాలింప చూడటం నిరుపయోగమని’

రీగ వ్యాఖ్యానించాడు. ముఖ్యంగా

క

సంధి లో పేష్వా తన వివాదాలన్నింటిలో కంపెనీని మధ్యవర్తిగా అంగీకరించాల్సి అధీనంగా తను సాధించాడు. దీని ద్వారా (ఆ) సంధి యొక్క ఈ వైఖరి వల్ల 'ఆంగ్లేయులు అటువంటి, క్లిష్టమైన కల్లోల ప్రాంతంగా ఉన్న మరాఠా రాజ్య వివాదాల్లోకి లాగబడుతుందని' లేక సరిగానే అంచనా వేశాడని మజుందార్ అభిప్రాయపడ్డారు.

ఈ సంధి తర్వాత మరాఠాలతో కల్లోల్లం ఉంటుందనే భావాలను సమర్థించుకోవటానికి ఏ కారణమూ లేదని వెల్లెస్లీ తప్పుగా అంచనా వేశాడు. అయితే ఒకవేళ యుద్ధం వచ్చినప్పటికీ ఈ సంధి ద్వారా ఆంగ్లేయులు పొందిన ప్రయోజనాల ద్వారా వారి శత్రువుల్ని విజయవంతంగా గెలవ వచ్చుని వెల్లెస్లీ భావించాడు.

'ఈ సంధి ఒక నిష్ప్రయోజకుడితో (Cipher) చేసుకున్న సంధి'

అని ఆరథర్ వెల్లెస్లీ అన్నమాట నిజమే. ఈ సంధి ఇతర మరాఠా రాజుల మనోభావాలను దెబ్బతీసింది. ఈ సంధి వారికి

జాతీయ స్వాతంత్ర్యాన్ని పూర్తిగా స్వాధీనపర్చినట్లు 95
గా తోచింది. ఈ సమయంలో వారి విభేదాలు
మరిచి ఆంగ్లేయులని ఎదుర్కోటానికి యత్నించారు.
అప్పటికి పీష్వా తన తప్పు కి పశ్చాత్తాప పడి తరిగి
మరాఠా రాజ్య తిరుగుబాటు కి రహస్యంగా ప్రోత్సహించాడు.
దౌలత్ రావ సింధియా, బీరారు కి చెందిన రఘుజీ భోంస్లే
-II ఒక్కసారి గా ఇప్పటి యశ్వంత రావ్ హోల్కర్
ను కూడా తమ పక్షానికి తెచ్చుకొనే (ప)యత్నం చేశారు.
అయితే ఈ క్లిష్ట సమయంలో కూడా వారు ఐక్యత
చూపలేదు. హోల్కరు పరిస్థితుల్ని పట్టి చూద్దామని
ఆలస్యంగా యుద్ధంలో చేరగా గైక్వాడ్ తటస్థంగా
ఉండిపోయాడు.

వెల్లస్లీ ఊహించినట్లు గానే బస్సీన్ సంధి
మరాఠా సమైక్యతాన్ని ఎదుర్కోటానికి విజయం పొందటానికి
అత్యంత శక్తివంతమైన సాధనాన్ని అందించింది.

Q. This Anglo - Maratha War covering nearly 9 years from the murder of Narayan Rao to the Treaty of Salbye emphatically discloses the vitality of the Maratha nation which had not been exhausted either by the disaster of Panipat or the death of their great Peshwa Madhavrao's. Comment in about 200 words.

Ans: మొదటి ఆంగ్లో యుద్ధము మరాఠా సమ్మేళనాన్ని బలహీనపర్చలేదనడంలో ఎట్టి సందేహము లేదు. ఈ యుద్ధంలో మహారాష్ట్రులు పోగొట్టుకున్న ప్రాంతాలు చాలా వరకు రాబట్టుకోవడంలో ప్రముఖ పాత్ర వహించిన పీష్వా మాధవరావు క్రీ.శ. 1772 లో అకాల మరణం పొందడం మహారాష్ట్రులకు పానిపట్టు యుద్ధ ఓటమి కంటే గొప్ప లోటు అని చెప్పడము తప్పు కాదు. అయినప్పటికీ మహారాష్ట్రుల ప్రాబల్యం మాత్రం తగ్గిపోలేదు. వారిలో ఇంకా జీవం ఉంది.

క్రీ.శ. 1770 ప్రాంతంలో మహారాష్ట్రులు ఉత్తర భారతంలో తిరిగి పూర్తి సామర్థ్యంతో విజృంభించ సాగారు. అసహాయుడైన మొగలు చక్రవర్తి రెండవ షా ఆలం ను తమ నియంత్రణలోకి తెచ్చుకున్నారు. తమకు కొన్ని ప్రత్యేక సదుపాయాలు, బహుమానాలు అందించాలన్న షరతుతో షా ఆలం కు తిరిగి రాజధాని లో రక్షణ కల్పిస్తామని అంగీకారం కుదుర్చుకున్నారు. మరాఠాల ఈ ఉత్సాహాన్ని, శక్తి ని కట్టడి చేసేందుకు గాను 1773 సెప్టెంబరు లో వారెన్ హేస్టింగ్స్ వారితో "బెనారస్ ఒప్పందం" చేసుకున్నాడు.

1789 లో మహాదాజీ సింధియా ఢిల్లీ లో తన నియంత్రణ ఏర్పరిచాడు. భారతదేశం లో సామ్రాజ్యవిస్తరణ కై యత్నాలు చేస్తున్న ఆంగ్లేయులని ఎదిరించగల సత్తువ మరాఠాల్లో ఉంది. 1773 లో నారాయణరావు ని హత్య చేయించి తానే పీష్వా అవుదామనుకున్న రఘునాథరావు (రఘోబా) కు నానాఫడ్నవీస్ సమూహం చే తిరుగుబాటు ఎదురైంది. వారు నారాయణరావు కొడుకు రెండవ మాధవరావు ని

ఢిప్యూ చేశారు. దాంతో రఘోబా ఆంగ్లేయుల సాయం

అడిగాడు. ~~ఇదే~~ మొదటి ఆంగ్ల-మరాఠా యుద్ధానికి

కారణమైంది. రఘోబా ఆంగ్లేయులకు సాల్‌సెట్టి, బస్సీన్ లతో పాటు సూరత్, బ్రోచ్‌ల

ఆదాయాలు ఇవ్వడానికి అంగీకరించాడు.

కల్నల్ కీటింగ్స్ ఆధ్వర్యంలో బొంబాయి గవర్నర్ రఘోబాకి సాయంగా సైన్యం పంపాడు.
గుజరాత్ లో ఈ సైన్యం రఘోబా సైన్యంతో కలిసింది.
ఇట్టి 'ఉమ్మడి' సైన్యాన్ని సైతం పీష్వా సైన్యం
శిడకే నెల్లల్లో లో 1775 మే నెలలో గుజరాత్
లోని "అరసు" ప్రాంతంలో ఓడించింది. ~~ఈ~~
విజయం మరాఠాల ప్రాబల్యాన్ని పెంచింది.

పరాభవం పొందిన ఆంగ్లేయులు
ప్రతీకారం తీర్చుకునేందుకు కల్నల్ లెస్లీ ఆధ్వర్యంలో
బెంగాల్ నుండి సైన్యాన్ని వారెన్ హేస్టింగ్స్ బొంబాయి
ప్రభుత్వానికి సాయంగా పంపాడు. ఇంకో ఆంగ్ల సైన్యం
బొంబాయి నుంచి రఘోబా నాయకత్వాన పూనా
తరలి వెళ్లింది. ~~ఈ~~ రెండు కూడా ఈ సేనలు
"తెలెగాంవ్" వద్ద మహారాష్ట్రులు

ప్రతిఘటించి ఓడించి బలవంతంగా "వాడ్గాంవ్" సంధి కి ఒప్పుకునేట్లుగా చేశారు. ఈ సంధి ప్రకారం ఆంగ్లేయుల స్వాధీనంలో ఉన్న సాల్సెట్టి, థానా, గుజరాత్ లోని ప్రాంతాలను ఆంగ్లేయులు మహారాష్ట్రులకు తిరిగి ఇచ్చివేయాలి. రఘోబా పీష్వా కి స్వాధీనం రావాలి. ఈ సంధి ఆంగ్లేయులకి చాలా అవమానాలు తెచ్చింది.

కల్నల్ కాక్ బర్న్ 1779 జనవరి లో మరాఠా సైన్యాన్ని (Telegaon) తెలెగాంవ్ వద్ద ఎదుర్కొని ఓటమి పొందాడు. ఆంగ్లేయులు బలవంతంగా (Wadgaon) వడ్గాంవ్ వద్ద అవమానకరమైన సంధి కి అంగీకరించాల్సి వచ్చింది. ఈ సంధి ప్రకారం 1773 నుండి బొంబాయి ప్రభుత్వం ఆక్రమించుకున్న ప్రాంతాల్ని (1) పీష్వా కి స్వాధీనం చేయాలి. బెంగాలు నుండి వస్తున్న (2) సేనల్ని వెనక్కి పంపివేయాలి. (3) బ్రోచ్ ఆదాయాల్లో కొంత సింధియా పొందుతాడు.

ఈ సంధి మరాఠాల ప్రాభవం

అందుకే మాలేదని రుజువు చేస్తుంది.

ఈ సమయంలోనే బ్రిటీషువారు హేస్టింగ్స్ కల్నల్ గాడ్డార్డ్ నాయకత్వంలో సేనల్ని పంపగా వారు మధ్యభారతాన్ని దాటి వచ్చి అహ్మదాబాదు, బస్సీన్ లను ఆక్రమించారు. అంతేగాక ఆక్రమణకై వారు చేసిన ప్రయత్నాలను మరాఠాలు 1781 లో విజయవంతంగా త్రిప్పికొట్టారు. మహాదజీ సింధే ఆంగ్లసేనల్ని 1781 లో 'బారఘాట్' వద్ద ఘోరంగా ఓడించెను. అంతేకాక అప్పటికే మాహదాజీ గ్వాలియర్ కోటను స్వాధీనపరుచుకోవడం వల్ల, సింధియా ఉత్తర భారతంలో తన ప్రాబల్యం ఉండాలని తలచి ఆంగ్లేయులతో సంధి ప్రయత్నాలు మొదలు పెట్టాడు. ఫలితంగా 1782 మే 17 న సాల్బాయి సంధి కుదిరింది.

(1) ఆంగ్లేయులకు సాల్సెట్టి దక్కింది. (2) రెండవ మాధవరావు పీష్వాగా గుర్తించబడ్డాడు. (3) రఘోబాకు పింఛను ఏర్పాటు చేశారు. (4) యమునకు పశ్చిమాన ఉన్న

భూభాగాన్ని సంధియం సంపాదించాడు.

ఈ సంధి వల్ల ఆంగ్లేయులు పొందిన భౌతిక సంపద అంత గొప్పదేమీ కాదు. ఈ విధంగా నారాయణరావు హత్య నుండి సాల్బాయి సంధి వరకు తొమ్మిదేళ్ళ పాటు సాగిన ఆంగ్లో-మరాఠా యుద్ధం పానిపట్టు వైఫల్యం ద్వారా గాని మాధవరావు పీష్వా మృత్యువు వల్ల గాని మరాఠాల శక్తి సామర్థ్యాలు అంతరించలేదని నిరూపిస్తుంది.

అయితే ఆంగ్లేయుల్ని మరాఠాలు ఈ యుద్ధంలో పూర్తిగా ఓడించలేక పోయారన్నది గమనించాలి. ఆంగ్లేయులు అహ్మదాబాదు, బస్సేన లను ఆక్రమించడం, గ్వాలియర్ కోట ని ముట్టడించడం, సాల్బాయి సంధి ద్వారా వారు తమకున్న సాల్సెట్టి ని పొందటం మరాఠాలు అజేయులు కారని తెల్పుతుంది | ఓటమి ఎరుగని వీరులేమీ కారని తెల్పుతుంది.

Q4. The British "fought the First Maratha War in a period when their fortunes were at the lowest ebb". Comment in about 200 words. 103

Ans:- బ్రిటీషువారు మొదటి మరాఠా యుద్ధం చేస్తున్న కాలంలో అనగా వారెన్ హేస్టింగ్స్ గవర్నరు జనరలుగా ఉన్న 1778 - 82 ల మధ్యకాలంలో ప్రపంచవ్యాప్తంగా చాలా గడ్డు పరిస్థితులెదుర్కొన్నారు. వారు ఆ సమయంలో (1) అమెరికా కాలనీలతో యుద్ధం చేస్తున్నారు. వారి సమస్యలు మరింత జటిలం చేస్తూ నాటి యూరోపు (2) రాజ్యాలైన ఫ్రాన్సు, స్పెయిన్, హాలెండ్ లు అమెరికా కాలనీల తరఫున ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొన్నాయి. ఇది చాలదన్నట్లు (3) రష్యా, డెన్మార్క్, స్వీడన్ లు సాయుధంగా తటస్థత వహించాయి. ఈ కూటమి కూడా బ్రిటన్ కు వ్యతిరేకంగానే ఉన్నది.

వెస్టిండీస్ లో బ్రిటన్ కు చెందిన (4) ద్వీపాల్లో చాలా వాటిని శత్రువులు ఆక్రమించుకున్నారు. మధ్యధరాలో 'మినార్కా' (Minorca) ఆక్రమించబడింది.

భారతదేశం లో కూడా బ్రిటీషువారి పరిస్థితి గొప్పగా ఏమీ లేదు. అనేక మంది శత్రువుల నుండి ఒకేసారి దాడులను ఎదుర్కోవాల్సి ఉంది.

మూడవ పానిపట్టు యుద్ధంలో ఓటమి పాలైన (5) మరాఠాలనుంచి ముప్పు తప్పిందనుకున్న ఆంగ్లేయులకు చుక్కెదురైంది. మరాఠాల్లో ప్రముఖుడైన మల్హార్ రావ్ హోల్కర్ తో పాటు ఇతర సమర్థులు రాజకీయ(ల) స్థానంలో మరాఠా అధికారాన్ని పునఃప్రతిష్ఠించారు. 1764 నాటికి ఉత్తర భారతదేశంలో మరాఠాలు తిరిగి బలపడుతున్నారు. మహాదాజీ సింధియా తదితర నాయకుల సాయంతో మాళ్వా, బుందేల్ఖండ్ లను స్వాధీనపర్చుకున్నారు. అప్పటికి మొగల్ చక్రవర్తి రెండవ షా ఆలం ను ఢిల్లీ మరాఠాలు తమ నియంత్రణలోనికి తెచ్చుకుని తమ ప్రాబల్యాన్ని పునఃస్థాపించారు. ఇందుకు షా ఆలం మరాఠాలకు 40 లక్షల రూపాయలు; కోరా, అలహాబాదు జిల్లాలను బహుమానంగా ఇచ్చెను. (The imperial action exposed Awadh to Maratha raids and uncovered the flank of the Company) మొగలు చక్రవర్తి ఈ చర్య (6) అవధ్ ను మరాఠాల దాడులకు తెరిచి పెట్టినట్లయ్యింది. ఇది కంపెనీ రక్షణ పార్శ్వ ను తొలగించటం వంటిది.

ఇంతకన్నా కష్టమైన పరిస్థితి బహుశ ఆంగ్లేయులకు ఎదురై ఉండకపోవచ్చు. తమ మిత్రదేశం అయోధ్య వైపునుంచి చొరబడటం ఇటు బెంగాలదేశంలో తప్పించుకునేందుకు మరాఠాలు లోపలికి ప్రవేశించి స్థావరాలను విజృంభించటం వారికి ప్రమాద గర్హనీయమే. (To permit the Maratha hordes to occupy the districts was to surrender the outworks of Bengal to the enemy.)

మరాఠాలు వెంటనే "రోహిల్‌ఖండ్" మీద దాడి చేశారు. ఈ సందర్భం నుంచే 1774 లో జరిగిన రోహిల్లాయుద్ధం జనించింది. <u>రోహిల్లా</u>(7) వ్యవహారం లో <u>వారెన్ హేస్టింగ్స్ చర్యలు</u> <u>ఆంగ్లేయులకు చెడ్డపేరు తెసుకొచ్చాయి.</u> ఈ విధంగా ఆంగ్లేయులు మొదటి మరాఠా యుద్ధాన్ని

వారి అదృష్టం ఏ మాత్రం కలిసిరాని క్లిష్ట పరిస్థితుల్లో చేశారని తెలుస్తుంది.

X [అయితే 1772 లో మాధవరావు పేష్వా మరణం, మరాఠా సమ్మేళనంలో చెలరేగిన అంతర్గత కలహాలు మాత్రం భారతదేశంలో ఆంగ్లేయుల ప్రాబల్యం పెరిగేందుకు, స్థిరపడేందుకు సంభవించిన వారి పాలిటి అదృష్ట ఘటనలు గా తోయక మానవు.] X

# సైన్య సహకార పద్ధతి

"క్లైవ్, వారెన హేస్టింగ్సు చేతుల్లో సైన్య సహకార పద్ధతి కంపెనీ ప్రాంతాల్ని కాపాడుకొనుటకు ఆత్మరక్షణా సాధనంగా వాడబడింది. అయితే వెల్లస్లీ చేతిలో మాత్రం అది ఒక ఆక్రమణా సాధనంగా స్వతంత్ర రాజ్యాల్ని బ్రిటిష్ నియంత్రణాలలోకి తెచ్చేందుకు వాడబడింది."

— పెర్సివల్ స్పియర్

సై. స. ప. ముఖ్యంగా రెండు ప్రయోజనాలకై ఉద్దేశించబడింది.

1) భారతదేశంలో ఆంగ్ల ఆధిపత్యాన్ని నెలకొల్పడానికి
2) భారతదేశాన్ని నెపోలియన్ ఉపద్రవం నుంచి తప్పించడానికి

ఈ పద్ధతి కంపెనీ ప్రాంతాల్ని విస్తరించడంలో ముఖ్యపాత్ర వహించింది. ఎన్నో కొత్త ప్రాంతాలు కంపెనీ ఆధిపత్యంలో చేరాయి.

ఆల్ఫ్రెడ్ లియాల్ కంపెనీ

భారతీయ యుద్ధక్షేత్రంలో ప్రవేశించడంలో

4 దశల్లో సాగించారు ·

1) స్వయం పూర్వకంగా స్వేచ్ఛగా ఉన్న భారతీయ పాలకులకి ఆది సహాయార్థం యుద్ధాలప్పుడు సైన్య సహాయం చేయడం

ఉదా: 1768 లో నిజాం తో చేసుకున్న ఒప్పందం.

2) తమ లో సాధారణ ఆసక్తి కల్గి ఉన్న భారతీయ పాలకుని సహాయంతో కంపెనీ సేనతో యుద్ధాన్ని చేయడం

ఉదా: కార్న్ వాలీస్ 3 వ మైసూరు యుద్ధమున నిజాం, మరాఠాలతో కలిసి త్రైపాక్షిక కూటమి ఏర్పరిచాడు.

3) ఈ దశలో భారతీయ భాగస్వామి సైనికుల్ని గాక కేవలం ధనాన్ని అందిస్తాడు. కంపెనీ సైన్యాన్ని తయారు చేయటం, శిక్షణ ఇవ్వటం, ఆంగ్ల అధికారుల పర్యవేక్షణలో ఆయుధాలతో కూడిన సైన్యాన్ని భారతీయ పాలకులకి డబ్బు తీసుకుని అందించటం చేసేవారు.

ఉదా: హైదరాబాదులో 1798 లో చేసుకున్న ఒప్పందం.

4) చివరి దశ, తర్వాతి పేరుబడ్డ ఆదుల

కంపెనీయే భారతీయ పాలకుల భూముల నాపైన బాధ్యతని స్వీకరించి అందుకోసం కొంత సహకార సైన్యాన్ని ఆ రాజ్యంలో ఉంచుతుంది. ఈ సైన్య పోషణకు గాను ఆ రాజ్యం డబ్బు గాక కొంత ప్రాంతాన్ని శాశ్వతంగా కంపెనీ కి ఇవ్వాలి. ఆ భూముల నుండి వచ్చే ఆదాయం తో ఈ సైన్యాన్ని కంపెనీ పోషిస్తుంది.

ఉదా: 1800 లో నిజాం తో చేసుకున్న ఒప్పందం.

సై.స.ప. ని వెల్లెస్లీ ఏమీ కనుగొనలేదు. ఈ పద్ధతి అంతకు ముందు ఎప్పటినుంచో ఉంది. దాని వృద్ధి పరిణామమంతా కొత్తదైనది. రెనడే మాటల్లో చెప్పాలంటే...

“ సై.స.ప. ఆలోచన అప్పటికి 100 సం॥ క్రితమే మరాఠా నాయకులు ఢిల్లీ సార్వభౌముని వద్ద నుండి చౌత్, సర్దేశ్‌ముఖి లను సంపాదించుకున్నట్టి దానికి వ్యవస్థీకృతమైన రూపమిచ్చి చేసిన పునరుత్పత్తి మాత్రమే” అని చెప్పారు. ఫ్రెంచి సేనాని డూప్లెక్స్ యూరోపు సేనను భారతీయ పాలకుల ఖర్చుమీద వారికి కిరాయిగా

పంపిణీల్లో తెలుస్తుంది. ఇదే పద్ధతిని ఆంగ్లేయులు కూడా అవలంబించారు. క్లైవ్ ద్వంద్వ పాలన గవర్నర్ జనరలు దీన్ని ఇదే విధంగా అవలంబించినవారే.

వెల్లస్లీ చేసిన ప్రత్యేక సేవ ఏమిటంటే అతడు సై.స.ప. ని బాగా వృద్ధి చేసి విస్తృత పరిచాడు, పైగా దీన్ని దాదాపు అన్ని భారతీయ రాజ్యాలకు ప్రయోగించి చూశాడు.

కంపెనీ చేసిన ఒప్పందాలు సై.స.ప.

సంధి <u>1765</u> లో <u>అయోధ్య</u> / అవధ Oudh నవాబుతో జరిగింది. దీని ద్వారా అవధ సరిహద్దుల్ని రక్షించే బాధ్యతను కంపెనీ వహించింది. అందుకయ్యే ఖర్చులు మాత్రం అవధ భరిస్తుంది. లక్నో లో ఒక బ్రిటిష్ రెసిడెంట్ కూడా నియమించబడ్డాడు. కర్ణాటక రాజ్యం పట్ల విదేశీ సంబంధాలు స్వతంత్రంగా కలిగి ఉండరాదన్న నిబంధనని అనుసరించి <u>1787</u> లో కార్న్‌వాలిస్ <u>కర్ణాటక ప్రభువుతో</u> చేసుకున్న ఒప్పందంలో పొందుపరిచాడు. (Nawab of Carnatic)

అప్పట్లో సర్ జాన్ షోర్ <u>అవధ నవాబుతో</u> <u>1798</u> లో చేసుకున్న సంధిలో నవాబు ఇతర యూరోపు జాతీయులతో ఎట్టి సంబంధాలు కలిగి ఉండరాదని

వారిని ఉద్యోగములో తీసుకోరాదు తన రాజ్యంలోకి రానీయరాదని నిబంధన విధించాడు. సైన్య పోషణార్థం భూమిని ఇవ్వడం లేదా వడ్డీ వేతనబద్ధ క్రమ అంశమే! సైన్య పోషణార్థం కంపెనీ కోరే మొత్తాలు చాలా ఎక్కువగా ఉండి భారతీయ రాజ్యాలు సకాలంలో చెల్లించలేక బకాయిలు కూడా పడేవి. అందువల్లే వెల్లెస్లీ సైన్యపోషణకై కొంత భూభాగాన్ని కంపెనీ యొక్క పూర్తి సార్వభౌమత్వం లోనికి అధీనపర్చాలని సంప్రదింపులు చేశాడు.

## సైన్య సహకార పద్ధతిలోని ముఖ్యాంశాలు:

1) భారతీయ రాజ్యం తన విదేశీ వ్యవహారాల్ని కంపెనీకి అధీనమున్నది వల్ల యుద్ధాలు చేయరాదు. అది ఇతర రాజ్యాలతో కంపెనీ ద్వారా మాత్రమే సంప్రదింపులు చేయగలదు.

2) పెద్ద రాజ్యాలయితే వారి భూభాగాల్లో ప్రజల ధన భద్రతల రక్షణార్థం కంపెనీ సైనికులు బ్రిటిష్ అధికారుల పర్యవేక్షణలో ఉంచబడ్డప్పుడు కొంత భూభాగాన్ని కంపెనీ సార్వభౌమత్వానికి ఇచ్చివేయాలి ఈ సేనల పోషణార్థం ఇచ్చివేయాలి. అదే చిన్న రాజ్యాలయితే కంపెనీకి కొంత ధనాన్ని [కప్పం / tribute గా]

చెల్లించాలి.

3) రాష్ట్రం దాని రాజధానిలో బ్రిటిష్ రెసిడెంటు ను అంగీకరించాలి. అతని ఖర్చును కూడా భరించాలి.

4) కంపెనీ ని సంప్రదించకుండా యూరోపియన్ జాతి వారిని రాజ్యం లోని ఉద్యోగులుగా నియమించరాదు.

5) కంపెనీ రాజ్య అంతరంగిక పాలన లో జోక్యం చేసుకోరాదు.

6) అన్ని రకాలైన విదేశీ శత్రువుల నుండి కంపెనీ రాజ్యాన్ని రక్షించాలి.

7) ఇతర స్వదేశీ పాలకులతో ఉత్పన్నమైన తగాదాలను అవసరమైతే మధ్యవర్తిత్వము వహించి పరిష్కరించుతురు.

8) అవసరమైన మిగిలిన యూరోపు జాతి వారు అప్పటికే కొలువులో ఉన్నచో వారందరిని తొలగించాలి.

9) ఈ విధానములో చేరిన పాలకుల అంతరంగిక పాలన భద్రతలను, విదేశీ దాడుల నుండి రక్షణను రెంటినీ కంపెనీయే కల్పిస్తుంది. అయితే అంతరంగిక పాలనా వ్యవహారము లందు మాత్రము కంపెనీ జోక్యము ఉండదు.

CRUX

## సైన్య సహకార పద్ధతి వలన నష్టాలు :-

సై. స. ప. భారత పాలకుల్ని నిర్వీర్యం చేసింది. భారత ప్రజలకి దారుణంగా పరిణమించింది.

1) భారత రాజ్యం నిరాయుధీకరణ ను కోరింది విదేశీ సంబంధాల్ని ఆపెరి స్వాధీన పర్చుడం లో లొంబడి ఉండే స్థితిని కోరింది అవి స్వాతంత్ర్యాన్ని కోల్పోయినట్లయింది.

"భారత రాజులు తమ స్వాతంత్ర్యాన్ని, జాతీయ స్వభావాన్ని - ఒక ప్రభుత్వాన్ని గౌరవించేందుకు కారణభూతమైన అన్నాలిటినీ త్యాగం చేసి రక్షణ ని భద్రతని కొనుక్కొన్నారు" అని థామస్ మన్రో అన్న విషయం అవాస్తవం కాదు.

2) బ్రిటిష్ రెసిడెంట్లు భారత పాలకుల రోజువారీ పాలన లో విపరీతంగా జోక్యం చేసుకోవడంలో సాధారణ పాలనా నిర్వహణ అనిశ్చితమైన స్థితి దాపురించేది. అందుకే,

'సైన్య సహకార పద్ధతి ప్రతిచోటా ప్రతి స్థాయిలో అమలు జరగాలి, అది రక్షణాబాధ్యతలు లేకున్న ప్రతి ప్రభుత్వాన్ని నాశనం చేస్తుందని చెప్పడంలో నాకే అనుమానమూ లేదని'

థామస్ మన్రో అనగలిగాడు.

3) సై. స. ప. ప్రతి బలహీనమైన, ఆనాటివేళలో గురిచేసి పాలకుల్ని సమర్థించి ప్రజలకు దుష్ట పాలన నుంచి విముక్తి పొందేందుకు వేరే మార్గం లేకుండా చేసింది.

"దుష్ట ప్రభుత్వాలకి భారతదేశంలో సాధారణ ప్రతిక్రియలు రాజభవనంలో రహస్య విప్లవాలు; హింసాత్మకమైన తిరుగుబాటు; లేదా విదేశీయుల ఆక్రమణ. కాని బ్రిటీషు దళాలు ఈ రాజ్యాల్లో ఉండడం వలన అన్ని సహజమార్గాలు నాశనం చేయబడ్డాయి. సింహాసనం మీదనున్న రాజు ఏ విధమైన అంతరంగిక, బహిరంగ శత్రువు నుండి రక్షించబడటం ద్వారా

" బయట నుంచి చేసే
సులువైన, ప్రత్యక్ష ఆక్రమణ అనేది మన దేశానికి
మన దేశ బాల్య యుగాలకి లా ఉన్నంత, చేసే
నిరాయుధీకరణ (సహకార సైన్యం నియమం లా) కన్నా
ఎక్కువ ఘనత ను అందిస్తుంది."

— థామస మన్రో

5) రక్షణా బాధ్యతల నుంచి విముక్తమవడం చేత (అంతర్గత, బహిర్గత శత్రువులనుంచి కంపెనీ కాపాడు తుంది కాబట్టి) భారత పాలకులు విలాసాల్లో కాలం గడుపుతూ ప్రభుత్వాన్ని పట్టించుకునే వారే కాదు. బాధ్యత లేకుండా రక్షణ కల్పించబడటం వలన అది అరాచక పాలన & రాజకీయ విలువల క్షీణతకి దారి తీసి తర్వాతి కాలం లో డల్హౌసి "దుష్పరి పాలనా నెపం" లో అనేక రాజ్యాల్ని కబళించి వేయడానికి కారణం అయ్యింది.

6) కంపెనీ తో సైన్య సహకార పద్ధతి & అంగీకరించిన పాలకుడు డబ్బు ఆదా చేసేందుకు గాను తన పూర్వ సైన్యాన్ని రద్దు చేసేవాడు. ఇది వేల మంది, నిరుద్యోగులుగా మారిపోవడానికి & కారణం
సైనికుల్ని

ఉన్నారు. ఇలాంటి నిరుద్యోగులైన సైనికులు పిండారీలు గా మారి / సంఘ విద్రోహక శక్తులు గా మారి (ప్ర)జా జీవితాన్ని దుర్భరం చేశారు.

7) సై.స.ప. లో ఆంగ్ల సైన్యాధికారులు నియమించ బడుటలో మన సైన్యాధికారులు ఉద్యోగాలు కోల్పోయి ఆత్మగౌరవంతో తమ జీవనాన్ని సాగించేక సాధించే అవకాశం సన్నగిల్లి వారిలో పోరాడే మనస్తత్వాలు, క్రమంగా యుద్ధ నైపుణ్యాలు క్షీణించాయి.

## సైన్య సహకార విధానం లో చేరిన పాలకులు:

1) హైదరాబాదు నిజాం: లో 1798, 1800 లలో సై.స.ప. సంధులు కుదుర్చుకున్నారు. ఫలితంగా నిజాం తన కలుపుకున్న ప్రాంత అధికారులను లొంగించెను. ఆంగ్ల సహాయక సేనల పోషణార్థం దత్త మండలాలుగా పిలువబడు కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురములను బ్రిటిష వారికి ఇచ్చెను.

2) అయోధ్య నవాబు లో 1801 లో సంధి కుదిరింది. ఫలితంగా సాదత్ అలీ నాటి నవాబు గోరఖ్‌పూర్, రోహిల్‌ఖండ్, గంగా-యమునా అంతర్వేది ని ఆంగ్ల సైన్య పోషణార్థం ధారాదత్తం చేశాడు.

మైసూరు నందు టిప్పు సుల్తాన మరణానంతరం
ఆంగ్లేయులచే నిలబెట్టిన కృష్ణరాజ ఒడయారచే పాలనా
పాలకుల తో 1799 లో సై.స.ప. ఒప్పందం
కుదిరింది.

తంజావూరు రాజు తో 1799 అక్టోబరు లో,
పీష్వాతో 1801 డిసెంబరులో ; భోంస్లే రాజా
బీరారు రాజు తో 1803 Dec ;
సింధియాతో 1804 Feb ;
గైక్వాడ్ తో 1805 లో వీరేగాక
రాజపుత్ర రాజ్యాలైన జోధ్‌పూర్, జైపూర్,
మఛేరి, బుంది, ఇంకా భరత్‌పూర్ పాలకులు
కూడా సై.స.ప. కు అంగీకరించారు.

19.7.03



# * రాజ్య సంక్రమణ సిద్ధాంతము *

కరడు గట్టిన సామ్రాజ్యవాది అయిన డల్హౌసి కి మొగలు సార్వభౌమత్వం పరదా మాటున పాలన సాగించడం కష్టం గా తోచింది. 'ఉపరాజ మధ్యవర్తుల శక్తుల' వలన ప్రజలు కష్టనష్టాలు పడుతున్నారని చెప్పి భారతీయ రాజ్యాల ఆక్రమణని ప్రత్యక్షంగా బ్రిటీషు పాలన లోకి తేవడం ధ్యేయంగా పెట్టుకున్నాడు. అందుకు గాను యుద్ధం లో మునిగేకుండా శాంతియుత ఆక్రమణలు చేయు సంకల్పించి 'రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని' విస్తృతంగా వాడాడు.

అయితే డల్హౌసి ఏమీ రా.సం.సి ని కనిపెట్టలేదు. 1834 లోనే కంపెనీ సహజ వారసులు లేనప్పుడు దత్తత చేసుకొనేందుకు కంపెనీ అనుమతి తీసుకోవాలని స్పష్టం చేసింది. పైగా "అనుమతి ఇవ్వడం హక్కు కాదు అరుదుగా జరగాలి, ఏదో నియమం గా ఇవ్వరాదు, ప్రత్యేకమైన మేలు - గుర్తింపు గౌరవం గా మాత్రమే అనుమతి కి అంగీకరించాలి" అని గాని కంపెనీ

నిర్దేశించింది: 1841 లో మాతృదేశ అధికారులు ఒక స్పష్టమైన ప్రత్యక్ష విధానం ఉండాలని నిర్ణయించుకొని గవర్నర్-జనరల్ కు ఈ విధంగా నిర్దేశించింది.

"ఒక స్పష్టమైన ప్రత్యక్ష విధానంగా న్యాయమైన, గౌరవమైన రాజ్య ఆక్రమణలను వదలిపెట్టరాదు, అలాగే న్యాయబద్ధమైన వారసత్వ హక్కులను గౌరవించాలి."

(to persevere in the one clear and direct course of abandoning no just and honourable accession of territory or revenue while all existing claims of right are at the same time scrupulously respected.)

ఈ విధానాన్ని అమలుపరచడంలో భాగంగానే 1839 లో మాండవి రాజ్యాన్ని, 1840 లో కొలాబా, జలౌన్ రాజ్యాలను, తిరిగి 1842 లో సూరత్ నవాబు పదవి రద్దు చేయబడ్డాయి, ఇవన్నీ ఆంగ్లరాజ్యంలో కలిపి వేయబడ్డాయి.

డల్హౌసీ నాటి హిందూ రాజ్యాలు

3 రకాలుగా విభజించాడు.

1) సామంతులు కాని రాజ్యాలు ; బయటివారికి ఎన్నడూ ఎప్పుడూ ఏ సార్వభౌమ అధికారానికి లోబడని రాజ్యాలు.

2) ఢిల్లీ చక్రవర్తి లేదా పీష్వాలకు బదులుగా ఆంగ్ల ప్రభుత్వ సార్వభౌమత్వానికి లోబడి ఉన్న హిందూ రాజులు, ఆంగ్ల ప్రభుత్వ సామంతులు.

3) ఆంగ్ల ప్రభుత్వం 'సనద్'ల ద్వారా సృష్టించిన లేదా పునరుద్ధరించిన హిందూ అధికారాలు, రాజ్యాలు.

1854 లో డల్హౌసీ చేసిన తీర్మానాన్ని అనుసరిస్తే, మొదటి రకం రాజ్యాల దత్తతల్లో మనకే పాత్ర లేదు. రెండవ రకం రాజ్యాలు దత్తతకు మన ముందస్తు అనుమతి పొందాలి. సాధారణంగా మనం అనుమతి ఇవ్వకూడదు

దానికి లభించిన అవకాశాల్ని పసిగట్టి పెట్టడానికి

నిర్దిష్టం చేయడానికి వ్యూహాత్మకంగా కట్టుబడి ఉంది.

ఈ అవకాశాలు లోబడి ఉన్న రాజ్యాలకి వారసుల్లేక

సంక్రమించడం వల్లగానీ లేదా, వారసత్వం కంపెనీ

అనుమతి ఇవ్వక గాని చెల్లుబాటు గాని దత్తత

స్వీకారం వల్లగానీ రావచ్చు"

శ్రీ డల్హౌసి రా. సం. సి. ని

రాజ్యాల ఆక్రమణకి ఉపయోగించదలుచుకున్నట్లు చెప్పకనే

చెప్పాడు.

డల్హౌసి ఈ రా. సం. సి. ద్వారా

chronology

సజైస సతారా (1848) జైత్పూర్, సంబల్పూర్ (1849)

భుఝ భగత్ (1850) ఉదయపూర్ (1852) ఝాన్సీ (1853)

నా మరియు నాగపూర్ (1854) లను ఆక్రమించాడు.

సతారా: రా. సం. సి. ద్వారా డల్హౌసి

ఆక్రమించిన తొలి రాజ్యం సతారా. 1848 లో

సతారా రాజు అప్పాసాహెబ్ సవంత వారసుడు

లేకుండా మరణించాడు. కానీ మరణానికి ముందు

రోజుల ముందే కంపెనీ అనుమతి

మొండిగుండా బసవ్వ పుత్రుని గా దత్తత చేసుకున్నాడు.

అయితే సతారా ఒక ఉదాహరణ

ఆంగ్లేయులు సృష్టించిన రాజ్యం. 1818 లో పీష్వా పతనానంతరం హేస్టింగ్స్ ప్రభువు సతారా ను శివాజీ వారసులలో ఒకరికి కట్టబెట్టాడు. అయితే 1839 లో ద్రోహచింతన నేరంతో అతన్ని దించి అతని సోదరుడు అప్పా సాహెబ్ ను గద్దె కట్టబెట్టారు. ఇతడు కూడా వారసుడు లేకుండా మరణించాడు, కంపెనీ అనుమతి లేకుండా దత్తత చేసుకున్న దత్తత చెల్లదు. అందువల్ల డల్హౌసీ సతారా ను 1848 లో ఆంగ్ల సామ్రాజ్యంలో విలీనం చేశాడు. అతని చర్యని కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్, హౌస్ ఆఫ్ కామన్స్ కూడా ఆమోదించాయి.

అయితే జోసఫ్ హ్యూం

సతారా ఆక్రమణ ని 'స్వార్థం మీద బలం గెలుపు' గా వర్ణించారు.

అలాగే ఆర్నాల్డ్ మాటల్లో సతారా ఆక్రమణ 'గొప్పదైన లేదా న్యాయబద్ధం కాని బహుమానం.'

సాధారణ చట్టం మరియు భారత్

తె.వి. 8.భా.దే.చ. p.148

సంప్రదాయాన్ని బట్టి ఒక సిద్ధాంతం రాజ్యమైన ఫలానా లాంటి రాజ్యాన్ని సార్వభౌమాధికార అనుమతి తీసుకోండా (చేసుకున్న) దత్త వారసుని వారసత్వంగా వెళ్లతారు అనే విషయం పై మేము సంప్రదిస్తూ ఉన్నాము. అలాంటి అనుమతిని ఇవ్వాల్సిన కట్టుబాట్లేవీ కంపెనీ పై లేవు. పైగా మనం అనుసరించాల్సిన సాధారణ ఆసక్తుల దృష్ట్యా అట్టి అనుమతిని ఇవ్వక పోవడమే ఉత్తమం'

ది కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్

చెప్పుకున్నప్పటికీ సతారా ను ఆక్రమించటం సమర్థించారని చెప్పడం తప్పులేదంటూ V. D. Mahajan అభిప్రాయపడ్డారు. 1819 లో కంపెనీ మరాఠాలతో వారిని ఒప్పుకొనేందుకు ఒక సంధి కుదుర్చుకుంది. ఆ సంధి రెండు సమాన / అధికారాల మధ్య సమానత్వ ప్రాతిపదికన జరిగింది. అందువలన ఎలాంటి

వివరాలు కూడా డల్హౌసీ చర్యను సమర్థించలేవు.

సంబల్‌పూర్: రాజా నారాయణ్ సింగ్ ఎలాంటి దత్తత లేకుండా మరణించడంతో 1849 లో దీన్ని కంపెనీ ఆక్రమించింది.

ఝాన్సీ: ఝాన్సీ రాజు పేష్వా/మరాఠీ పేష్వా సామంతుడు. బాజీరావు II ఓటమి తర్వాత హేస్టింగ్స్ ప్రభువు 1818 లో ఝాన్సీ పాలకుడు రావ్ రామచంద్ ను ఆయన ఆయన వారసుల్ని ఆ ప్రాంతానికి వారసత్వ పాలకులుగా లోబడి ఉండే సహాయం చేసే ప్రాతిపదిక పై ఒప్పందం కుదుర్చుకున్నాడు. 1835 లో ఆయన మరణంతో మేనమామ రఘునాథరావ్ వారసుడిగా గుర్తింపబడ్డాడు. 1838 లో ఆయన మరణం తర్వాత రాజకుటుంబానికి చెందిన గంగాధరరావు వారసుడిగా గుర్తింపబడ్డాడు. 1853 లో మగ సంతానం లేకుండా గంగాధరరావు మరణించగా కంపెనీ దత్త కుమారుని వారసత్వాన్ని తిరస్కరించి ఝాన్సీ ని ఆక్రమించుకున్నది.

నాగపూర్: 1817 లో హేస్టింగ్స్ భోంస్లే వంశానికి చెందిన చిన్ని బాలుణ్ని వారసుడిగా గుర్తించాడు. 1830 వరకు రిచర్డ్ జెంకిన్స్, బ్రిటిష్ రెసిడెంట్

ఆధునిక సామ్రాజ్యవాద ధోరణులు

నడిపించారు ----- లేదా బొంబాయి - మద్రాసు;

Lee Warner

బొంబాయి - కలకత్తా ల మధ్య సమాచార

మార్గాల మధ్యగా నిల్చిన ప్రాంతాలు'

అని వ్యాఖ్యానించాడు.

* రాజ్య సంక్రమణ సిద్ధాంతం పై ఒక అంచనా *

1) భారతదేశంలో దత్తతకు హిందూ సాంప్రదాయ వ్యక్తిగత ఎప్పటికప్పుడు భారతీయులు వారసత్వం గాక వారి సంప్రదాయాలు ఆచారాలు ఉల్లంఘించి ఎలా గౌరవిస్తారని ప్రశ్న ఇచ్చారు. దత్తత లేకుండానే సంప్రదాయ వారసుని నిర్ణయించడం ఎంతగానో గౌరవిస్తారు. మొగలులు, పీష్వాల కింద వారసత్వ సుంకం లేదా నజరానా చెల్లించడం ద్వారా దత్తత కు సార్వభౌముని గుర్తింపు లభించేది. డల్హౌసి తెలియక పురాతన సంప్రదాయాలను పునరుద్ధరించి దాన్ని తన సామ్రాజ్య విస్తరణ కు వినియోగించాడు. ఇది చార్లెస్ I వ్యక్తిగత పాలనలో పన్నుల విధింపు మాదిరిగా ఒక భూస్వామ్య బాధ్యతను పునరుద్ధరించి

తమ రాజ్యాల ఆక్రమణకు కారణం 'రా. సం. సి.' లేదా 'చెల్లుబాటు' 'రాజ్య చెల్లుబాటు సిద్ధాంతం' కాక కంపెనీకి అన్ని దేశాలు చెల్లిపోవటం' చేయటమని నమ్మారు.

"కారణమేదయినా కాని, స్థానిక పాలకులందరూ అన్ని స్వదేశీ సంస్థానాలు ముప్పులో పడ్డాయని నిస్సందేహంగా నమ్మారు"

— పి. ఇ. రాబర్ట్స్

వారి నమ్మకం డల్హౌసి చర్యల ద్వారా నిజం కాబోయింది. వాస్తవానికి 'రా. సం. సి.' ప్రతి బలవంతుడిదే రాజ్యమనే 'మాత్స్యన్యాయం' పై ఆధారపడిందే!

1857 తిరుగుబాటుకు రా. సం. సి. ని అన్యాయంగా నిర్దాక్షిణ్యంగా ప్రయోగించడం ఒక ముఖ్య కారణం.

సతారా ఆంగ్లో-సతారా రాజు సంధి ప్రకారం - - -

Read ఆ. భా. దే. చరిత్ర M.A. తె. అ.

P. 148

① 'అసహాయ మధ్యవర్తుల్ని లాలించేందుకు'
కాంటాక్టులా గా సామ్రాజ్యవిస్తరణకు

② డల్హౌసీ ఏమీ సృష్టించలేదు. 1834 లోనే కంపెనీయే...

③ 1839 లో మాండవి 1840 లో కొలంబా, జతౌన
1841లో సూరత్ రా. సం. సి. క్రింద విలీనం

④ "డల్హౌసి ఆక్రమించగలిగితే ఆక్రమించివేయుడమే...'
— Innes ఇన్నస్

⑤ రక్షిత > ఆధారిత eg: కరౌలి

⑥ Dalhousie 3 types

⑦ వ్యక్తిగత ఆస్తి - రాజ్య సింహాసనం

⑧ సతారా (1848), జైత్‌పూర్, సంబల్‌పూర్ (1849), భగత్ 1850
ఉదయపూర్ (1852) ఝాన్సీ (1853) నాగపూర్ (1854)

సతారా
సంబల్‌పూర్
ఝాన్సీ
నాగపూర్

⑨ ఇవి విమర్శ

① సంప్రదాయాల్ని గౌరవించలేదు.
② ఆధారిత Vs. రక్షిత : ఇంపీరియల్ ప్రాముఖ్యానం లేదు
③ సామ్రాజ్యవాద ఆశయాలతో.. లీ వార్నర్
④ ఇవ్వి వారికి తిరిగి ఇచ్చేసారు.

--- నీతులు చెల్లిపోవటం
--- దుష్టులా పద్ధయిది P.E. Roberts
--- మత్స్యన్యాయం

2) ఆంగ్లేయుల దౌత్య నైపుణ్యం అనివార్యమైంది. భారతీయ పాలకులు ఏ మాత్రం విశ్వాసం లేకపోయినప్పటికీ వారు వెంటనే తమ దౌత్యనీతిలో భారతీయ పాలకుల రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసి తమ గెలుపును భద్రపరుచుకునే వారు.

ఆంగ్లేయులు ఎప్పుడైనా వాస్తవ చర్యలు ప్రారంభించబోయే ముందు ఆయా పక్షాల్ని తమ వైపు తిప్పుకొని సహాయక ఒడంబడిక చేసే దౌత్య విధానాన్ని అవలంబించారు.

హైదర్ దాడులనరికట్టుటకు నిజాం, మహారాష్ట్రులతో కలిసి ఆంగ్లేయులు మిత్ర కూటమి నేర్పరిచారు. ఈ కూటమి ని హైదర్ విచ్ఛిన్నం చేసినా యుద్ధం మధ్యలో నిజాం ను హైదర్ నుండి తమ వైపు తిప్పుకొని తమ దౌత్య నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

3) ఆంగ్లేయుల నౌకా సామర్థ్యం వారి విజయాలకి ముఖ్య కారణం. వారి సముద్ర శక్తి వారికి భద్రత తో కూడిన ప్రవేశ, బయలు మార్గాల్ని అందించింది. వారి సరుకుల్ని తరలించడానికి; తీరం మీదనుంచి భూభాగాల్పైకి దాడి చేయడానికి; ఇతర యూరోపియన్ల వారి ముఖ్యంగా ఫ్రెంచివారి సాయం భారతీయ పాలకులకి అందకుండా నిరోధించడానికి ఆంగ్లేయుల సముద్రాధిపత్యం తోడ్పడింది. దక్కను లోను, కర్ణాటకం లోను ఆంగ్ల ఆధిపత్యం (ఫ్రెంచి వారిని లొంగదీసి) నౌకా బలం వల్లనే సాధ్యపడింది.

కష్ట కాలంలో తప్పించుకోవటానికి; అదనం వనరుల్ని - పెద్ద సహాయాన్ని దగ్గర ఆంగ్ల స్థావరాలనుంచి తోడా మాతృదేశం నుంచి పొందడానికి వారి నౌకాబలం తోడ్పడింది. సిరాజుద్దౌలా కలకత్తా గెల్చుకున్నప్పుడు ఇంగ్లీషు వారు 'ఫుల్టా' నందు తలదాచుకోడం, (సముద్రం దగ్గర్లోని ప్రాంతం ఫుల్టా) ఫుల్టా నందు వారికి నౌకాబలం వల్ల పూర్తి రక్షణ లో

మద్రాసు నుంచి సింహళం వెళ్ళిపోయి తలదాచు
కోవడం మనం గమనించవచ్చు.

4) Add these points to previous notes

భారత సేనకు ఆంగ్ల సేనవంటి ఘనమైన, వైవిధ్యమైన అనుభవం వారు ఇతర దేశాల యుద్ధాల్లో పాల్గొనడం ద్వారా సంపాదించిన అనుభవజ్ఞానం లాంటివి లేదు.

5) ఈస్టిండియా కంపెనీ సేవకుల లాగే క్రమశిక్షణ అద్భుతమైంది.

" వారు వారిలో సహజమైన ఆంగ్ల బెట్టును, ఆంగ్ల వర్తకధోరణిని, ఆంగ్ల దేశభక్తిని అన్నిటికీ మించి శక్తివంతమైన వ్యక్తిగతలాలసత్వాన్ని వ్యక్తిత్వాన్ని (individualism) ని కలిగి ఉండేవారు."

6) ఆంగ్లేయులకు విస్తృత వనరులు సులభంగా లభించేవి. బెంగాలు ఆక్రమణ వారికి భారతదేశంలో అత్యంత సంపన్న ప్రాంతాన్ని

ప్రారంభించింది. వీరులు సంపాదించిన లెక్కన దేశాన్ని వారు సులభంగా ఓడించగలిగారు. 

7) దక్షిణాది ప్రాంతం వారు ఉత్తరాదివారిలా భారత పాలకులకు ఆంగ్లేయులకు బలంగా పోరాటాలు చెయ్యడంలో సాయం చేసేవారు కరువయ్యారు.

8) ఆంగ్ల సామ్రాజ్యవాద ఆర్థిక విధానాలు భారత ప్రజలకు వెంటనే అర్థం కాలేదు.

వారు ఆర్థిక విషయాలపై మాత్రమే దృష్టి కేంద్రీకరించి ప్రజల సామాజిక-మత విషయాల్లో జోక్యం చేసుకొంటున్న ప్రజాగ్రహాన్ని గుర్తించలేదు.

భారతదేశంలో ఆంగ్లేయులు సాధించిన సామ్రాజ్య విస్తరణ కేవలం పాలకుల మధ్య గొడవగానే మిగిలింది కాని ఏ స్థాయిలు కూడా సామాన్య ప్రజలు తమ హక్కులు విదేశీయుల చేతుల్లోకి వెళుతున్నట్లు స్పృహతో పోరాడవలసిన అవసరం ఉందని గుర్తించలేదు. సామ్రాజ్య విస్తరణ పాలకుల గొడవగానే మిగలడం ఆంగ్లేయుల విజయాలకెంతో దోహదం చేసింది.

# * జాతీయోద్యమం లో స్త్రీలు *

" ~~ఈ~~ అహింసా సమరంలో స్త్రీల పాత్ర పురుషుల కన్నా విస్తృతంగా ఉండాలి. ఆడవాళ్ళను బలహీనులనడం వారిని అగౌరవపర్చడమే. ఇది పురుషుడు స్త్రీకి చేసిన అన్యాయం. బలమంటే పశుబలమని అర్థమైతే నిస్సందేహంగా స్త్రీ పురుషులకన్నా పశుత్వంలో తక్కువే. బలమంటే నైతిక శక్తి అయితే అప్పుడు స్త్రీయే పురుషులకన్నా ఎంతో మేలు. ఆమెలో ఎక్కువ స్ఫురణ, త్యాగబుద్ధి, శక్తి, ధైర్యం ఉన్నాయి. ఆమె లేకుండా పురుషుని ఉనికే సాధ్యం కాదు. అహింసే మన మనుగడకు మార్గదర్శకమై ప్రాయమైననాడు భవిష్యత్తు స్త్రీదే"

అని జాతిపిత <u>గాంధీజీ</u> స్వయంగా ప్రపంచంలోనే విలక్షణమైన రీతిలో అహింసా మార్గంలో సాగిన మన జాతీయోద్యమ విజయానికి స్త్రీ పాత్ర ప్రధానమైనదని చాటిచెప్పి స్త్రీలని ప్రోత్సహించారు.

## దేశచరిత్రలో సగమైన

మహిళలు సంప్రదాయ సంకెళ్ల తెంచుకొని ఉత్సాహంగా
జాతీయోద్యమంలో పాల్గొనడం వల్లనే ఉద్యమం
వాస్తవంగా ప్రజా ఉద్యమమై విజయం పొంద
గలిగిందనడం నిస్సందేహమైన విషయం.

జాతీయోద్యమంలో ఆది నుండి

(1) స్త్రీలు పాలుపంచుకోవడం కన్పిస్తుంది. 1889 లో బొంబాయి
కాంగ్రెస్ సభకు పది మంది స్త్రీలు హాజరయ్యారు.
అప్పుడు వారు నిష్క్రియ ప్రేక్షకులుగానే ఉన్నా, అదే
వారిని సంప్రదాయ ధన్యవాదములు తెలిపే ప్రసంగానికి
ప్రోత్సహించారు.

(2) స్వర్ణకుమారీదేవి, రవీంద్రుని సోదరి

భారత స్త్రీలలో స్వావలంబన, స్వదేశీయుల భావాన్ని
రగుల్కొల్పింది. 1886 లో ఆమె "శక్తి సమితి"
ని స్థాపించి వితంతువులకు విద్య నేర్పించి వారి స్వావలంబనకు
అటు స్త్రీ విద్యావ్యాప్తికి తద్వారా స్త్రీలలో జాతీయతా
భావ వ్యాప్తికి తోడ్పడింది. అలాగే వార్షిక
మహిళా శిల్ప మేళాలు నిర్వహించి స్త్రీల వస్తువులకు

మార్కెట్ కల్పించింది. భవిష్యత్తులో జాతీయోద్యమం బలపడిన తర్వాత ఈ ప్రోత్సాహంవలన , స్వదేశీయుల దాని ముఖ్యలక్ష్యాలవ్వడం గమనించదగినది.

<u>మన జాతీయోద్యమంలో ఒక ఘట్టం</u>

అనగా <u>వందేమాతరం (3) ఉద్యమం</u> లోనే <u>బెంగాలు విభజనకు వ్యతిరేకంగా పెద్ద సంఖ్యలో మహిళలు పాల్గొన్నారు.</u> <u>ముస్లిం మహిళలు సైతం పరదా వదిలిపెట్టి మొట్టమొదటి సారిగా ఊరేగింపులు, పికెటింగ్‌లలో పాల్గొనడం విశేషం.</u> (x) పట్టణప్రాంత మధ్యతరగతి స్త్రీలు కూడా ఉత్సాహంగా ఈ ఉద్యమ సమయంలోనే <u>సరళాదేవి ఘోషల్</u> <u>స్త్రీలని విప్లవకారుల జాతీయవాదుల ప్రోత్సహించింది.</u> ఆమె జి.ఐ.పి. రైల్వే కార్మికుల సమ్మెని సమర్థించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉపన్యసించింది. <u>స్త్రీలకి కత్తి తిప్పడం, లాఠీ ప్రయోగాలు శిక్షణ నిచ్చేది. 'వందే మాతరం' నినాదాన్ని ప్రచారం చేసింది.</u> బెంగాలు విభజన వెంటనే జరగబోయే మత ఘర్షణల్ని ఎదుర్కోనేందుకు స్త్రీలలో ఆత్మరక్షణా సంస్థని ఏర్పరచింది.

<u>విదేశీయురాలైనప్పటికీ మన</u>

<u>దేశప్రజలు-సంస్కృతిపై అభిమానంతో మనదేశ రాజకీయాల్లో చొరవ చూపిన మహిళ (4) అనిబిసెంటు.</u>

పత్రిక ను నడిపింది - బెర్లిన్ నుంచి. అలాగే పారిస్ నుంచి కామా స్వయంగా 'వందేమాతరం' పత్రికను నడిపింది. ఈమె 1907 లో స్టుట్‌గార్ట్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు కాంగ్రెసు కు హాజరై

"ఈ పతాకం భారత స్వాతంత్ర్యానిది. అది జనించింది, గట్టిగా పట్టుకోండి. ఇది ఇప్పటికే అమర వీరులైన భారత యువకుల రక్తం తో పవిత్ర మయ్యింది. మీరంతా లేచి నిల్చి ఈ పతాకానికి వందనం చేయండి"

అని కామా పిలుపు నిచ్చింది.

చెప్పాలంటే ఎందరో మహిళలు విప్లవ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. బెంగాలు లో ఉగ్రవాద జాతీయోద్యమం లో యువతులు విరివిగా పాల్గొన్నారు, ముఖ్యంగా సూర్యసేన్ నాయకత్వంలో. ఈ యువతులు విప్లవకారులకి ఆశ్రయం కల్పించటం, సమాచారాలు చేరవేయటం చేసేవారు. సాయుధపోరాటాలు కూడా చేసేవారు. ముఖ్యమైన నాటి

విప్లవ నాయికలుగా ఒక గొప్ప పేరొందిన మరణించిన (ప్రీతిలతా వాడేకర్), అరెస్టు కాబడి సూర్యసేన్ తో పాటు ఆయుధాగార దాడిలో పాల్గొన్న కారాగార శిక్ష పొందిన (కల్పనా దత్) లను పేర్కొనాలి.

శాంతి ఘోష్, సునీతి చౌదరి లనే ఇద్దరు స్కూలు బాలికలు కొమిల్లా ప్రాంతానికి చెందినవారు. వీరు జిల్లా మేజిస్ట్రేటు ను 1931 డిసెంబరులో కాల్చి చంపారు. బీనా దాస్ గవర్నరు వద్ద నుండి తన పట్టభద్ర పట్టా పుచ్చుకుంటూ (1932 ఫిబ్రవరి) అతన్ని కాల్చింది.

(c) పంజాబు లో దుర్గా భాభి

ఈమె భగత్ సింగ్ సహచరురాలిగా ఉండేది. ఈమె నవజవాన్ భారత్ సభ, హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్, రిపబ్లికన్ ఆర్మీ లలో సభ్యురాలిగా ఉత్సాహంగా పాల్గొన్నది. ఈమె పంజాబు మాజీ గవర్నరైన లార్డ్ హెయిలీ ని చంపాలని నిర్ణయించుకున్నది. ఈ విధంగా స్త్రీలు ఉగ్రవాద జాతీయోద్యమంలో పాల్గొని తమ వీరత్వాన్ని

[illegible]

జాతీయోద్యమంలో గాంధీజీ రాకతో ఉద్యమ స్వరూపం అహింసా రూపం దాల్చింది. గాంధీజీ దృష్టిలో (స్త్రీ) అహింసా చిహ్నం. ఆయన పిలుపు నందుకుని భారత మహిళలు ఉత్తేజితులయ్యారు. అందుకే (6) జాతీయోద్యమంలో గాంధీజీ నాయకత్వంలో స్త్రీల పాత్ర గణనీయంగా పెరిగింది.

గాంధీజీ నాయకత్వంలో జరిగిన

(a) సహాయనిరాకరణోద్యమంలో అన్ని వర్గాల మహిళలు విరివిగా పాల్గొన్నారు. ఈ ఉద్యమ కాలంలోనే కాంగ్రెస్‌లో చేరిన మహిళల సంఖ్య బాగా ఎక్కువయ్యింది. 1920 డిసెంబరులో నాగపూరు కాంగ్రెసు సభకు 169 మంది మహిళా ప్రతినిధులు హాజరయ్యారు. ఉద్యమ కార్యకలాపాల్లో భాగంగా వేలాది స్త్రీలు ఖద్దరునూలు వడకడం దినచర్యగా పెట్టుకున్నారు. సంప్రదాయ కుటుంబాల స్త్రీలు, బాలికలు సైతం గాంధీజీ పిలుపుమేర మద్యం షాపుల ముందు నిలబడి పికెటింగులు చేయడం విశేషం! ఉద్యమ సందర్భంగా ఇద్దరు కలకత్తాలో చిత్తరంజన్ దాస్ భార్యను, కొడుకును ఆడపడుచులు అరెస్టు చేయడంతో ఆగ్రహోదగ్రులై వేలాది

వేల మంది స్త్రీలు వాలంటీర్లుగా చేరిపోయారు. మహిళలు జైళ్లకు వెళ్లే ఉద్యమం చేస్తున్న స్త్రీలకి లాఠీల్ని ఎదుర్కొని దెబ్బలు తింటూ, ఇంటి పనులు వదిలి వచ్చేవారు. వారి ఎంతో కష్టం మీద వళ్లు చేరుకునేవారు. సహాయనిరాకరణ ఉద్యమ సందర్భంగా ప్రారంభించిన 'తిలక్ సహాయనిధి' / 'తిలక్ స్వరాజ్య నిధి' కి వేల మంది ఆడవాళ్లు ఉత్సాహంగా తమ నగల్ని అందించారు.

1927-28 ప్రాంతంలో జరిగిన సైమన్ వ్యతిరేక ప్రదర్శనల్లో కూడా మహిళలు విస్తృతంగా పాల్గొన్నారు.

1930-34 మధ్య జరిగిన శాసనోల్లంఘనోద్యమం లో మహిళల పాత్ర మరవలేనిది. గాంధీజీ శాసనోల్లంఘనలో ఉప్పు శాసనాన్ని ఎదుర్కోవడం సహజంగానే స్త్రీలకి ఉత్సాహం వచ్చింది. గాంధీజీ ఉప్పు శాసనాన్ని ధిక్కరించే సమయంలో ఆయన వెంట సరోజినీ నాయుడు, కమలాదేవి ఛట్టి, శ్రీమతి మంథుబెన్ పటేలు, డా॥ సుమన్ మహలూ

వంటి మహోత్కృష్ట నాయకురాళ్లు ఉన్నారు. ఆయన ఉద్బోధించిన
మరుక్షణమే జయజయ ధ్వానాలు చేసి అనేకమంది
స్త్రీలు పుట్టిండ్లు, అత్తిండ్ల వాకిళ్లు, కాయ పాళాలు వదిలేసి
భగవంతుడే సముద్రంవైపులా వండిన ఉప్పును దోసిళ్లలో
లేక లోటా చెంబుల్లో నింపడానికి వచ్చారు. గాంధీజీ
ఉద్యమం ప్రారంభించగానే అక్కడ ఉన్న స్త్రీలు
సముద్రంలోకి కెరటాలవలె ఉరికి. ఒడ్డున ఉన్న ఉప్పును
లోటా చెంబుల్లోకి నింపుకున్నారు. ఈ ఉద్యమంలోకి
స్త్రీల సహాయం అవశ్యమేనని గాంధీజీ పదే పదే నొక్కి
చెప్పారు. ఉప్పు అమ్మేటప్పుడు స్త్రీలు లారీల్లో
లేకపోయినా నిర్మానుష్యమైన ప్రదేశాల్లో వదిలివేసేవారు.
ఈ ఉద్యమంలో భాగంగా దరసానా ఉప్పు కోఠారులపై
సరోజినీ నాయుడు ౨౦ వేల మంది సత్యాగ్రహులను వాలంటీర్లను
వెంటబెట్టుకుని శాంతంగా నెమ్మదిగా సత్యాగ్రహ దండయాత్ర సాగించింది.
అంత పెద్ద సైన్యం నాయకురాలై అహింసా యుద్ధ యాత్ర
సాగించడం, పోలీసుల దగ్గరకు రానీయకుండా
ఓపిక పట్టడం ఈ భారతంలో సరోజినీ నాయుడుగారు
మోసి ఒక్కొక స్త్రీ పురుషునికన్నా మిన్నయని
ధైర్యంలో

పిలుపునందుకొని ఉద్యమం నాయకులు లేక దౌర్జన్యకాండగా జరుగుతున్నా తీవ్రంగా విజృంభించారు. ఉద్యమ అణచివేతలో భాగంగా స్త్రీలను దిగంబరులుగా చేసి వీధుల వెంట త్రిప్పి వారి శీలాన్ని దోచుకొంటూ ఎన్నో కష్టాలు విధించింది. మహిళల్ని మానభంగాలు చేసారు. దేశ స్వాతంత్ర్యం కోసం భారతీయ మహిళ ఈ అవమానాలన్నింటినీ మౌనంగా భరించింది.

బొంబాయికి చెందిన 'ఉషామెహతా' గొప్ప తెలివితేటలు గల నాయకురాలు, విప్లవకారి. ఈమె క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో 'రహస్య రేడియో' 'స్వాతంత్ర్య గొంతుక' పేరుతో నడిపింది.

1942 ఉద్యమంలో నాయిక అరుణా ఆసఫ్ అలీ. ఈమె ఉద్యమకాలంలో భూగర్భ స్థావరాల్లో కార్యకలాపాలు సాగించింది. బొంబాయిలో జాతీయ పతాకాన్ని ఎగరేసింది. ఢిల్లీకి మేయర్ గా పెద్దల వారి మన్ననలు పొందింది. ఆమె లోహియా జయప్రకాష్ నారాయణ్ లతో కలిసి జాతీయ కాంగ్రెస్ సోషలిస్టువాద శాఖ ను ఏర్పరిచింది.

ప్రధాన జాతీయోద్యమ ప్రవాహంలోనే

కొన్ని భారతీయ మహిళలు నేతాజీ నడిపిన 'ఆజాద్ హింద్ ఫౌజు' లో ఆగ్రా చేరి ఉద్యమాలలో సమానంగా పోరాడారు. కెప్టెన్ లక్ష్మి సెహగల్ వీర నారీమణుల్లో సాయుధ పోరాటంలో పాల్గొని రాణి ఝాన్సీ రెజిమెంట్ కు నేతృత్వం వహించింది. అంతేగాక నేతాజీ అండమాన్ నికోబార్ దీవుల్ని షహీద్, స్వరాజ్ దీవులుగా పేరిడి ఏర్పరచిన తాత్కాలిక ప్రభుత్వంలో లక్ష్మి సెహగల్ మంత్రి గా ఉన్నారు.

కపుర్తలా రాష్ట్ర రాకుమార్తె అయిన రాజకుమారి, అమృత కౌర్ గాంధీజీకి 16 ఏళ్ళ కార్యదర్శిగా ఉండి స్వాతంత్ర్య భారతదేశ ప్రథమ ఆరోగ్య శాఖా మంత్రి గా చేశారు.

ఐ. ఎన్. ఎ. లోని కల్నల్ లక్ష్మి కి తల్లి అయిన అమ్మ స్వామినాథన్ చేరి ఉద్యమ గా ప్రసిద్ధురాలు. ఆమె మద్రాసులో అఖిల భారత మహిళా సదస్సు ను ఏర్పరచింది. 1934 లో కాంగ్రెసులో చేరి 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమంలో కీలక పాత్ర పోషించింది.

## Add these points

* ఉప్పు సత్యాగ్రహ సమయంలో ప్రాముఖ్యత వహించిన నాయకురాలు గా ఎదిగింది దుర్గాబాయి దేశ్‌ముఖ్. 'ఉక్కు మహిళ' గా పేరొందిన ఆమె 1930 లో ఆంగ్ల అధికారాన్ని ఎదిరించి నిల్చింది. ఆంధ్ర మహిళా సభ ను స్థాపించి మహిళా సంక్షేమానికి బాలికోద్ధరణకు కృషి చేసింది. 'ఆంధ్ర మహిళ' అనే పత్రికను కూడా నడిపింది.

* బొంబాయి మహిళలు 'రాష్ట్రీయ స్త్రీ సభ' ను స్థాపించి దాని ద్వారా కార్యకలాపాలను ప్రారంభం చేశారు. స్త్రీల హక్కులు, స్త్రీ-పురుష సమానత్వం వంటి ప్రశ్నలు చర్చించేవారు. ఖాదీ ప్రచారం విస్తృతంగా చేశారు.

* విదేశాల్లో స్త్రీలు జాతీయోద్యమం చే ప్రభావితులై వారు ఉత్సాహం గా పాల్గొన్నారు. ఆంగ్ల సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా ఇంగ్లాండు నుండే రేణుకా రే కృషి చేసింది. ప్రభావతి ఒక కమ్యూనిస్టు సంస్థ నుండి కృషి చేసింది. ఆమె తర్వాత ట్రేడ్ యూనియనిస్టు గా మారి జాతీయోద్యమంలో పాల్గొంది.

* 1905 – 08 ల ప్రాంతంలో బెంగాల్ ఉద్యమంలో స్త్రీలు ఎక్కువ పాత్ర పోషించారు. స్త్రీలు సమావేశ సంఘాల్ని ఏర్పరిచారు. మధ్యతరగతికి చెందిన బెంగాలియుల జాతీయ భావం చే ప్రేరేపితమైన స్త్రీలు స్వదేశీ ఉద్యమానికి తమ నగలు, ధనాన్ని విరాళంగా ఇచ్చారు. వాళ్ళు ఆహార ధాన్యాల్ని కూడా విరాళంగా ఇచ్చారు. ఈ సమయంలో సిస్టర్ నివేదిత ముందున్నారు. ఆమె రవీంద్రునితో సాన్నిహిత్యం గలిగి దగ్గరగా ఎన్నో పనులు నిర్వహించింది. ఆమె చరఖా ని (spinning) పునరుద్ధరించి మరియు వడకడాన్ని ప్రచారం చేసింది.

* ఇక పశ్చిమ భారత దేశం లో బ్రాహ్మణ స్త్రీలు పార్వతి బాపట్, సరస్వతి భాను, భట కాండె ల నాయకత్వంలో స్వదేశీ ని గురించి చర్చించేవారు. వాళ్ళు విదేశీ వస్తువుల్ని బహిరంగంగా తిరస్కరించారు.

* పంజాబు బెంగాలీయుల వారి మహిళలు స్వదేశీ ఉద్యమాన్ని బాగా నడిపారు. 1909 లో జరిగిన దేశీయ పారిశ్రామిక మరియు వ్యవసాయ ప్రదర్శనలో లాహోరు మహిళలు మహిళా విభాగాన్ని ఏర్పాటు చేసి స్వదేశీకి తోడ్పడ్డారు.

* 1907 లో ప్రమోదిని మిత్ర బెంగాలులో 'సుప్రభాత్' అనే జర్నల్ ని ఆరంభించింది. ఈ పత్రిక విప్లవానికి, నారీ ముక్తికి - దేశముక్తికి మధ్య సంబంధాన్ని చిత్రీకరించింది.

ఈ విధంగా భారత జాతీయోద్యమంలో ఎంతో మంది మహిళలు కీలకపాత్ర వహించారు. వారి కృషి కలవడం వల్లనే మన స్వాతంత్ర్యమనే కల ఫలించింది.

---

## Conclusion

పై వివరాల్ని గమనిస్తే దేశ స్వాతంత్ర్యం కోసం జరిగిన వివిధ తరహా పోరాటాల్లో - అహింసాయుత, విప్లవవాద ఉగ్రవాద, INA సాయుధ, కాంగ్రెస్ లోపల కాంగ్రెస్ వెలుపల, సోషలిస్టు మార్గపు ... ఇలా అన్ని తరహా పోరాటాల్లో భారత స్త్రీలు (దేశం లోపల, దేశం వెలుపల) తమదైన ముద్రని వేసి స్వాతంత్ర్య సాధన లో తమ పాత్రని చాటారు.

---

"No native state should be left to exist in India which is not upheld by the British power or the political conduct of which is not under its absolute control." see page : 168

## భారత దేశం ఫ్రెంచి భీతి

నెపోలియన్ వ్యూహాత్మకంగా సాయంగా ఉండేందుకు వెళ్లితే భారత్ లోని ప్రతి స్వదేశీ సంస్థానం / రాజ్యం పై తన నియంత్రణ ఏర్పాటుకు పూనుకున్నాడు.

[1797, వెల్లస్లీ భారత్‌కు బయలు దేరిన ఆ కాలం ఇంగ్లాండు చరిత్రలో చీకటి సంవత్సరం. యూరోప్ దేశాల పెద్దల సంకీర్ణం నెపోలియన్ చే చిత్తు చేయబడింది.] నెపోలియన్ ఈజిప్టు, సిరియాలను జయించి భారత ఆక్రమణ గురించి తీవ్రంగా యోచిస్తున్నాడు. 1798 లో నెపోలియన్ లక్ష మంది సైన్యం తో యూఫ్రటీస్ మీదుగా భారత్ ను ఆక్రమించాలను కున్నాడు. [అలెగ్జాండ్రియా నుండి అలెగ్జాండర్ భారత్ ను ఆక్రమించినట్లే తాను చేయాలని తలచాడు.] 1801 లో నెపోలియన్

కై ఉద్విగ్నులమయ్యే నెపోలియన్ అసాధారణ ప్రయత్నాల గురించి తెలియజేస్తూ పంపడం ఇందుకు నిదర్శనం.

ఫ్రెంచి స్థావరమైన మారిషస్ దీవుల నుంచి ఫ్రాన్సు నౌకా దళాలు భారత సముద్రంలో జరపవచ్చు. (అమెరికా స్వాతంత్ర్య యుద్ధ సమయంలో ఇంగ్లాండు ఫ్రెంచి నౌకాబలాన్ని చవిచూసింది.)

ఇదే సమయంలో భారతపాలకులు కూడా ఫ్రెంచి సాయంతో ఆంగ్లేయుల్ని ఓడించాలనే కాంక్షతో ఉన్నారు. కంపెనీ శత్రువులైన టిప్పు ఫ్రాన్సులో సంప్రదింపులు జరపడం ఫ్రాన్సు అతనికి సహాయాన్ని ప్రమాణం చేయటం జరిగాయి. (నెపోలియన్ భారత ఆక్రమణ ఆలోచనల్లో టిప్పుకు ఆంగ్లేయుల్ని తరిమికొట్టేందుకు మంచి అవకాశం కల్పించింది. కంపెనీలో యుద్ధానికి విస్తృత ప్రయత్నాలు చేయసాగాడు.)

[1795 లో 'ఖర్దా' వద్ద జరిగిన [illegible] మరాఠాల చేతుల్లో ఓటమి అనంతరం ఆంగ్లేయులచే వదిలివేయబడ్డ (deserted)] నిజాం కూడా మాన్సియర్ రేమండ్ అనే ఫ్రెంచ్ కమాండెంట్ ను నియమించి అతని నాయకత్వంలో 14,000 మంది

సైన్యాన్ని తయారు చేశాడు.

మహాదాజీ సింధియా లేక్ - ఫ్రెంచి

ఫ్రెంచి వారిచే శిక్షణ పొందిన 8000 కాల్బలం

8000 అశ్వదళాన్ని మరాఠా దళాలకు ఇచ్చారు
మాన్సియర్ పెర్రన్
నిర్మించడంలో ఫ్రెంచి అధికారుల్ని నియమించాడు.

దళ్ళు కొనసాగే కుటుంబికే వర్తిపై సింధియా నియమాలు

కొందరు తేరా వరు వెమాలియర్ చేతిలో ఉండేట్లుగా

ఉండేవారు. ఢిల్లీ, ఆగ్రా లపై పట్టు సంపాదించిన

వీరు బీహారు, బెంగాలుపై దాడి చేయగల

స్థితిలో కూడా ఉన్నారు.

వెల్లెస్లీ సింధియా రాజ్యాన్ని మాన్సియర్

పెర్రన్ యొక్క 'స్వతంత్ర రాజ్యం' గా వ్యవహరించి

హిందూస్థాన్ హృదయభాగంలో ఫ్రెంచి స్థావరం

ఉండటాన్ని అడ్డుకోవాలనుకున్నాడు.

వాయువ్యం నుంచి జమన్ షా దాడి

చేస్తాడనే భయం కారణంగా చూపి రంజిత్ సింగ్

కూడా యూరోపు, ఫ్రెంచి అధికారుల్ని ఉద్యోగాల్లో

నియమించుకోవడం కూడా వెల్లెస్లీ గమనించాడు.

'అసాధ్యమైనది మూర్ఖుల నిఘంటువుల్లో

క్విబెక్ పదం' అనే నెపోలియన్ నాయకుని వెల్లెస్లీ బాగా అర్థం చేసుకున్నాడు. అందుకే అతడు ఎలాంటి అవకాశం శత్రువుకి ఇవ్వదల్చుకోలేదు. ప్రాచ్యంలో ఆంగ్లేయుల స్థితికి ఫ్రెంచి ఆటంకాన్ని తొలగించుకొనేందుకు వెల్లెస్లీ సరైన అడుగులు వేశాడు.

నెపోలియన్ వ్యూహాల్నుంచి భారతదేశాన్ని రక్షించడానికి గానూ భారత రాజకీయ ప్రపంచానికి కంపెనీ మధ్యవర్తి కావాలి, భారత రాజ్యాల్ని ఫ్రెంచి ప్రభావం నుంచి దూరంగా ఉంచాలి అని సరైన ముగింపుకి వెల్లెస్లీ వచ్చాడు. వెల్లెస్లీ యొక్క ఈ విధానాన్ని 1803 లో జార్జి బార్లో ఇలా చెప్పాడు..

"(ఫ్రెంచివారి) ఈ వ్యూహాలను చిత్తు చేయడానికి భారతదేశంలో ఏ స్వదేశీ రాజ్యం కూడా ఆంగ్లేయుల చేతిలో ఉండకుండా గాని, దాని రాజకీయ వ్యవహారాల పై ఆంగ్ల అధికారానికి పూర్తి నియంత్రణ ఉండకుండా గాని ఉండరాదన్నది సంపూర్ణంగా అవసరమైన అంశం."

